# భారతి

మాసపత్రిక

*

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

*

మే 1979

సంపుటము : 56 సంచిక : 5

విడిపత్రిక వెల రూపాయిన్నర



# సాగులోకి మరింత భూమి

అందరికీ సరిపోయేటంత ఆహారం కావాలంటే ఎక్కువ భూమిని సాగుచేయాలి. ఈ విషయంలో నీటిపారుదల సౌకర్యాల కల్పన ఎంతగానో ప్రాముఖ్యత వహిస్తుంది. అందుకే ఆంధ్ర ప్రదేశ్ బడ్జెటులో యిటీవలి కాలంలో అధికభాగం నిధులను నీటి పారుదల ప్రాజెక్టులకు కేటాయిస్తున్నారు.

రాష్ట్రంలో నిర్ణీత ప్రాంతాలలో రు. **21.68** కోట్ల ఖర్చుతో ఆరు మధ్యతరహా నీటిపారుదల పథకాలను చేపట్టారు. మధ్య తరహా నీటిపారుదల సౌకర్యానికి అవకాశమున్న **22** లక్షల హెక్టారులలోనూ ఇంతవరకు **17.6** లక్షల హెక్టార్లలో నీటి వసతి కల్పించారు.

**1979-80** సంవత్సరంలో రు. **680.26** లక్షల ఖర్చుతో అదనంగా **6350** హెక్టార్లకు నీటిపారుదల కల్పించాలని సంకల్పించారు.

---

*డైరెక్టరు, సమాచార, పౌరసంబంధశాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాద్.*
44/78-79



# విషయానుక్రమణిక

## మే 1979







# అక్షరస్మృతి

## శ్రీ బులుసు వేంకటేశ్వర్లు

సీ. వీధులంబడి పిచ్చి పిచ్చిగా గొంతెత్తి
యఱచెడు మతిలేని నరుని పగిది
ప్రతియింటి మూదల గతి తప్పి పడిపోవు
సురనుఁ గ్రోలిన మనుజుని విధమ్మ
కఱినాగు విషకీలికలు మేను దహియింప
వాలలుఁగ్రక్కు బాలకుని భంగి
తనతోనె తను – యేదొ తత్త్వపదార్థంపు
దలఁజూడ నెంచు వేదాంతివోలె

తే.గీ. ఎన్నియో యవతారంబులెత్తినాను
గాని, మధురార్ద్ర భవదీయక్రమవాక్కె
నన్ను బ్రతికించె – త్వత్పాద నళినయుగ వి
తానవాసనలన్ మున్గినామ తల్లి!! 1

సీ. ఒకసారి నవ శరద్వికచ వీధులఁ ద్రిప్పి
తీయని కథలెన్నొ తెలిపి తెలిపి
ఒకసారి నవనందనోద్యాన సీమల
కోయిల పాటలు కొసరి వినిచి
ఒకసారి మధురగీతిక లెల్లఁబాడించి
ప్రతిపదంబున రాగరక్తిఁజూపి
ఒకసారి శాంతి వీచికలలోఁ దేలించి
తలపులు – నావి – పేశలముఁజేసి

గీ. నన్ను నమృతాత్మగా – మహానవ్యభావుఁ
గా – సరాగిగా – భోగిగా – కడకునీదు
పాదమంజీరగాఁజేసి – స్వాదునాద
మొందు నాలోనఁ బుట్టించు చుంటివిగదె!! 2

గీ. తొట్టతొలుతనె నను గుర్తుపట్టి నీదు
సేవకై నన్నుఁ గొంపోయినావు తల్లి!
అవున? జ్ఞాపకముండెనా? అపుడు నేను
కిలకిలా నవ్వితిని తొల్లి కలలుపండి!! 3

శా. ఆ నవ్వుల్ వికసత్ప్రసూన మధుగంధామోద వీచీతతో
ద్యానంబుల్ కలయంగఁ జల్వజగమంతన్ యొందు సంతోష రే
ఖానవ్యంబయి కానుపించె; నిది నీకంజాతహస్తంబు త
ల్లీ! నాకున్ గిలిగింతవెట్టు ఫలముల్; నేనేమి భాగ్యుండనో!! 4

శా. నాయూహల్ శతముల్ సహస్రములుగానై, కళ్లెముల్ లేక యే
దో యేదో కుటివాధ్వమందఱుగగాఁ దోడై భవద్దాస కాం
తే యెంతేనియు కాఱు చీకటుల గెంటెన్; స్వచ్ఛ కార్తిక పుం
జాయన్ వెన్నెలలిచ్చె నాయెడదకున్; చాల్చాలు నీ భాగ్యముల్ !! 5

మ. గతులున్ లేక, కళావిహీన పశుసంస్కార ప్రభాహంకృత
స్థితులన్ తేలుచునున్న యజ్జుని నక్షీణాక్షరానంద సం
గతులన్ మెట్టగఁజేయు నీ మహిమలన్ గాసంత వర్ణింప భా
రతి! శక్యంబగునే? విముగ్ధ వచన ప్రారంభ హేలాగతిన్ !! 6

సీ. ఒక వంద పూర్ణిమా సకల చంద్రికలెల్ల
ఒకసారి నాలోన కొదిగ నటుల
ఒక వేయి నవసుధా నికరంపు తేటలు
ఒకసారి నాలోన కొదిగినటుల
ఒక లక్ష మిసిమి పాల కడలి కెరటాలు
ఒకసారి నాలోన కొదిగినటుల
ఒక కోటి సూర్యబింబ కళా సమగ్రత
లొకసారి నాలోన కొదిగినటుల

గీ. లెక్కలేనట్టి చైతన్య లీలలెవ్వొ
నన్నుఁబొందెను! తల్లి! యానాడు నా శి
రంబుపై నీవు భవ్యహస్తంబువెట్టి
ఆశిసుల నిడితివి గాదె! యాక్షణమునె !! 7

ఉ. ఆ క్షణమెన్ని పుట్టువుల కందనిదో! భవదీయమూర్తి ప్ర
త్యక్షర రూపమై హృదయమందునఁ దోచిన — యార్ద్ర కాంతులన్
చక్షువుల్ వెలింగె — మఱి సారసమన్విత కాంతిపుంజ మొం
డీ క్షణమందు దాక నటియించెను నూత్న కళావిలాసమై !! 8

సీ. నిన్న మొన్నటిదాఁక విన్నతనంబున
కదలని గళసీమ పదముఁబాడె
నిన్న మొన్నటిదాఁక నివురుఁకప్పిన గుండె
భావానిలంబునఁ బత్వెకాంతి
నిన్న మొన్నటిదాఁక నీరసా హతమైన
వాగ్జాల మురసార్ద్రభరితమయ్యె
విన్న మొన్నటిదాఁక నిష్కఁమ్మోదృష్టి
శారద చంద్రికాసరసమయ్యె

గీ. నేడు — నీవేమి మంత్రమ్ము నేర్పుతోడ
వైచితివొ గాని, మాత !! నా బ్రతుకు సకల
మెంతగా మారినదొ! నేనె వింతపడుదు
కాని చెప్పగ శక్యుండఁగాను నేను !! 9



కీ. శే. శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

# నాటక ప్రయోగానికి కళాకారుడెవడు?

కళకూ విద్యకూ భేదము చెప్పింది శుక్ర నీతిసారము. విద్యలు మూగా, చెవిటీ, గ్రుడ్డీ — వారు కూడా నేర్వగలరటా, కళలు అలాటి అంగవైకల్యమున్నవారు నేర్చుకోలేరట. కళలు అరవై నాలుగు అన్న సాంప్రదాయమున్నది. ఇది ఎలాగ వచ్చిందో తెలియరాదు కాని కళలన్నవి మొత్తముమీద అరవై నాలుగే అన్న నమ్మకముమాత్రము నిలిచిలేదు. యుద్ధానికి సంబంధించినవి అరవై నాలుగూ, శృంగారానికి సంబంధించినవి అరవై నాలుగూ, లోక వ్యవహారములో అరవై నాలుగూ చదివిన జ్ఞాపకమున్నది నాకు. శుక్ర నీతిలో ఒక పట్టికా, వాత్స్యాయన కామ సూత్రములలో ఇంకొక పట్టికా శబ్ద రత్నాకరములో మరొక పట్టికా కనబడుతున్నాయి. మొత్తము మీద కళ అన్నమాటకు మనలో నిర్దిష్టార్థము ఉన్నది అన్న అపోహయే గాని నిర్దిష్టార్థము మట్టుకు లేదు. ఆంగ్లేయులు నేర్పులన్నిటిని కళ అన్న మాటతోనే సూచించారూ, నేర్పు పేరు చెప్పి దానికి కళ అన్నమాటను చేర్చుకొని వాడుకొన్నారు. కవిత్వమూ, చిత్రకళా, సంగీతమూ, స్థాపత్యమూ, వాస్తువూ అన్న ఐదింటిని వారు లలిత కళలు (సుకుమార కళలు) అన్నారు. కాళిదాసు అజవిలాపములో "ప్రియ శిష్యా లలిత కలావిధౌ" అనిపించి, వీణావాదనమూ, ఆలేఖ్యమూ వంటి కళలను లలిత కళలని సూచించాడు. మనము పై అయిదింటికీ లలిత కళలుఅన్నమాటను రూఢి చేసివాడుకోవచ్చునూ, **చాలామంది వాడుతున్నారు కూడాను.**

కళ అన్న మాటను నేర్పు అనడానికి బదులుగా వాడుకోవడము అలవాటయిపోయింది మనలో కూడా. లలితకళ అంటే ఏది? అన్న పెద్ద జిజ్ఞాస చెయ్యకుండానే పై అయిదింటినీ లలితకళలు అని అనడమూ మామూలైంది. దీనిని మార్చుకోవలసిన అవసరము ఏమీ కనిపించదు. అయితే వీటిని తక్కిన కళల నుంచి విడదీసి ఒక పేరు పెట్టుకోడానికి వీటి విశేషమేమిటీ అన్న తర్కము కోసము కాకపోయినా ఒక జాతి ఓజస్సుకి కారణ భూతములన్న విశేషము గుర్తించిన కారణము వల్లనైనా వీటి విశిష్టతను చక్కగా తెలుసుకోవలసిన అవసరముంది. ఎక్కడిదో ఒకనిర్వచనము స్వీకరించి దానికి సరిపోయే వ్యాఖ్యానమును కిట్టించుకోడము కంటె, వాటి పరిశీలనను బట్టి వాటి లక్షణమును గ్రహించడమే యుక్తము. ఆ లలిత కళలన్నీ మానవుడు యత్నించి నిర్మించినట్టివిగాని మానవ ప్రకృతి అలవోకగా బయటబెట్టినవి కావు. అంటే కోయిలకూత, పశ్చిమాకాశ సువర్ణ రేఖలూ, తేనెపట్టూ, ప్రేయసుల ప్రేమాలాపమూ కళలు కావు, ప్రకృతే. కళ కృతకము. ఇక రెండో ధర్మము, కళ ఇతర మానవులకు ఉద్దేశించినట్టిది. లేకుంటే రచయిత దానిని మాటలతోనో, రంగులూ రేఖలతోనో రచించడమేల? 'ఇది నా కోసమే రచించుకున్నాన'నుకోడముగాని అనడముగాని వట్టి డాబు. కళారచన చేస్తూ రచయిత ఆ రచనను సర్దుతాడు శక్తికోసమో అందము కోసమో. కళాస్రష్టగా రచనచేస్తూ, సహృదయ ప్రేక్షకుడుగా చూచి దిద్దుకుంటాడు. అంటే సహృదయుల సహానుభూతిని కోరి రచిస్తాడన్నమాట. రచించేవి కేవలము తలంపులూ కోరికలూకావు. మరి ఏమిటీ? భావాలు. ఒకరి భావాలు ఇంకొకరికి కలగాలంటే దారులు రెండే ఉన్నాయి ఏ సూర్యాస్తమయాన్నో, సుందరగాథనో తాను చూచీ వినీ పులకించాడనుకొండి కళాకారుడు. ఆ చిత్రాన్నీ, ఆగాథనీ రచించి సహృదయుడికి ఎదురుగా పెట్టడము ఒకపద్ధతి. ఆ లేఖ్యకళా, శిల్పమూ, కథనమూ ఈ దారిలోని రచనలు. తన ఆనందాన్నో, ఉత్సాహాన్నో భావాల రూపంలో రచించడము రెండో పద్ధతి. సంగీతమూ, వాస్తు శిల్పమూ, భావకవిత్వమూ ఈ దారిలోనివి. ఒకరు దుఃఖిస్తూంటే ఇతరులలో అనురణనము కలిగి కన్నీరు నిండినట్టుగా ఈ రెండో పద్ధతి రచనను దర్శించినప్పుడు సహృదయునికి రచయితను పట్టి కదిపిన భావాలు కలుగుతాయి. రతి విలాపమూ, అజవిలాపమూ, మూర్ఛిత సోదరునికడ శ్రీరాముని విలాపమూ పెద్ద ఉదాహరణాలు. రచయిత ఆనందాన్నో ఉత్సాహాన్నో ప్రేక్షకులకు (చదువరులకు) కలిగించే ఉద్దేశంతో మాటలతో, రంగులూ రేఖలూతో, స్వరాలూ గమకాలూతో, జీవ రూపాలతో, ద్రవ్య సంచయ రూపాలతో రచించినది కళ చూచినవారిలో రచయిత ఉత్సాహమూ ఆనందమూ కలగడము కళకు పరీక్ష.

నాటకాన్ని రచయిత తన మనోరంగముమీద ఊహా ప్రదర్శనముగా చూచుకుంటాడూ పాత్రల భాషణ మాత్రమునూ, రంగభూమీ అభినయమూలను గురించి బహు కొద్దినీ, సూచిస్తాడు. నాటక ప్రయోక్త ఆ నాటకాన్ని చదివి, ప్రదర్శనాన్ని తన ఊహారంగమ్మీద పునర్నిర్మించుకుంటాడూ అర్హనటసంఘంతోనూ రంగ ప్రసాధనముతోనూ ఆ నాటకాన్ని ప్రయోగిస్తాడు. ఈ ప్రయోక్త (సూత్రధారుడు, డైరెక్టరు, దర్శకుడు) నాటకకర్తలో ఉత్తరభాగమన్నమాట. నాటకకర్తా ప్రయోక్తా ఇద్దరైనప్పటికీ నాటక ప్రేక్షకులపట్ల ఒక్కడుగానే లెక్క. చిరకాలమునుంచీ సంస్కృత నాటక కర్తలు 'పటాక్షేపముగా ప్రవేశించును' 'ఉపవిష్టులై యుందురు' 'నాట్యముచే మోము త్రిప్పుకొనును' వంటి వాక్యములతో నటుల అభినయాన్ని సూచిస్తూనే ఉండి నాటక ప్రయోగమే తమ లక్ష్యము అన్న సత్యాన్ని చెపుతునే వున్నారు. సూత్రధారుడికీ మారిషుడికీ, సూత్రధారుడికీ నటికీ సంభాషణ కల్పించి కవీ, కాలమూ సూచిస్తూనే, ఆ ప్రస్తావనను నాటకపు తొలిరంగములో

పాత్ర పలుకు వాక్యములతో అతికి, ప్రేక్షకుల మనస్సులను నాటక ప్రయోగమువైపు తిప్పడము కూడా నాటకరచయిత లక్ష్యము, (నాటక) కావ్యరచన కాక ప్రయోగమే నన్న సత్యాన్ని తెలుపుతుంది.

నాటక ప్రయోగము కవియే చేసినప్పుడు 'తన ఉత్సాహాన్నీ ఆనందాన్నీ సామాజికులకు కలిగించే ప్రయత్నము' అతనిదే అవుతుంది. కనక కళాకారుడు అతడే అని ఒప్పుకుంటాము. లోకవృత్తములోని ఒకముఖమును నాటకరూపములో ప్రదర్శించి, దానిని తాను గుర్తించినప్పుడు పొందిన ఆశ్చర్యోత్సాహములను సామాజికులకు కూడా కలిగించనెంచే కవి దర్శకుడే నాటక ప్రదర్శనకళకు కళాకారుడని గుర్తించడమూ, చెప్పడమూ సులభమే. నాటకరచన ఇంకొకరిదై, మీరు సమర్థులైన నటులను ఎంచుకొని వారి పాత్రాభినయాన్ని ఆమోదించి కొంత కొంత సర్ది నాటక ప్రదర్శనము జరిపించినప్పుడు మీరు ప్రదర్శన కళాకారులన్న స్ఫురణ కలగడము కష్టము. నాటక ప్రదర్శనాన్ని నిర్మించి దానిని మాటలలో పట్టగలినంత పట్టి వ్రాసి యిచ్చాడు కవి. మీరు దానిని చదివి ప్రదర్శనాన్ని—రెండోమారయితేనేం—నిర్మించుకుని, దానిని ప్రదర్శించారు. మాటలూ శిలపోషణమూ ఇత్యాదులు మీవికావు. ఆ వాక్య పంజరాన్ని స్వీకరించి భవనము నిర్మించారు మీరు. మొత్తానికి మేము చూచిన ప్రదర్శనఫలము, మానవుల అనుభవాన్నీ మాటల్నీ సాధనములుగా స్వీకరించి నాటకరచన చేసిన కవీ, అర్హవాతావరణము కల్పించి మాముందు ప్రదర్శించిన మీరూ ఇద్దరూ చేసినయత్నానికి ఫలము. కవిలేనప్పుడు ఆ కళానిర్మాణకార్యానికి ఆధారము మీరే. మరి కళాకారుడు ఎవరు అన్న సందేహమెందుకూ ?

''దేవతలకు ఈ నాట్యము (భరతాది) మునులు చాక్షుష క్రతువుగా సమర్పించినట్టిది. రుద్రుడు దీనిని తన శరీరమునందు రెండు (లాస్య తాండవములు)గా విభజించెను. నాటకములో లోక చరితము త్రైగుణ్యమునుండి పుట్టి నానారసములు కలదై దృశ్యమానమగుచున్నది. ఈ నాటకము బహుప్రకారములు కలిగియుండి భిన్నరుచిగల జనులకు అఖండముగా సంతుష్టికరమౌతున్నది'' అని కాళిదాసు మాళవికాగ్నిమిత్రములో గణదాసు అంటాడు. నాటక ప్రయోగము (భరత) ముని దేవతలకు సమర్పించినట్టి చాక్షుష క్రతువట. (నటులు సమర్పించినదికాదు !). కాళిదాసే, మళ్లీ ఊర్వశీపురూరవములో ప్రయోక్త ప్రాధాన్యాన్ని వివరిస్తాడు. దేవలోకములో భరతముని సరస్వతీదేవి రచించిన 'లక్ష్మీస్వయంవర' కావ్యబంధమును ప్రదర్శిస్తున్నాడు వారుణి భూమిక ధరించిన మేనక లక్ష్మి భూమిక ధరించిన ఊర్వశిని అడిగినది 'ఇదుగో కేశవ సహితులై లోక పాలకులూ త్రైలోక్యపురుషులూ వచ్చి ఉన్నారు. వీరిలో ఎవరియందు నీ హృదయము లగ్నమైనది ?'' అని. ఊర్వశి ఆ కావ్యబంధ రసాంతరములలో తన్మయురాలై ఉన్మాదితయైనది. ''పురుషోత్తమునియందు'' అనవలసి ఉండగా ''పురూరవసుని యందు'' అన్నమాటలు జారివచ్చినవట. ఈ కథ వింటూన్న ముని కుమారుడు ''ఆ మాటకు (భరత)ముని క్రుద్ధుడు కాలేదా ?'' అని అడుగుతాడు. పొడైనట్టిది ప్రయోక్త నాటక ప్రయోగము. భరతముని తన ఉపదేశమును ఉల్లంఘించి నందుకు ఊర్వశిని శపించాడు. దేవేంద్రుడు శాపాన్ని ఉపకారంగా మార్చాడు గాని మళ్లించలేదు. నాటకప్రయోగమన్నది ప్రయోక్తసామాజికుల కర్పించు కళోపాయనము. ఇది చిరానుగత భారతీయసంప్రదాయము. పై 'లక్ష్మీస్వయంవర' రచయిత సరస్వతి అని పాఠకులు గుర్తించి ఉందురు; ప్రయోక్త భరతుడు. నాటక ప్రయోగ కళాకారుడు సూత్రధారుడు, ప్రయోక్త, ఆచార్యుడు, దర్శకుడు, భరతుడే.

భరతుడు నాట్యశాస్త్రములో ''గీతం నృత్తం తథావాద్యం ప్రస్తారగమనక్రియా ! ఏ తాని పంచయోవేత్తి స ఆచార్యః ప్రకీర్తితంః॥ ఊహాపోహౌ మతిశ్చైవ స్మృతిర్మేధా తథైవచ। శిష్య నిష్పాదనం చైవషడాచార్యగుణాః స్మృతాః॥'' అని ఆచార్యుని గుణములు చెప్పి, నాట్యాచార్యుడే రంగ పూజ చేయవలెనని ఆచార్యుని యాజమాన్యము సూచించి, 'పాత్ర సమాశ్రయములైన గుణములను ... కనుగొని, పిమ్మట భూమికాయోజనమునకు కడంగినచో ... ప్రయోగము ఆచార్యుని ... కి ... ఖేదజనకము కాబోదు' అని ఆచార్యుని కార్యవిధానమును సూచించి, బ్రహ్మభరతాచార్యునితో 'ఓ అనఘ పుత్రశతయుక్తుడవైన నీవు దీనికి ప్రయోక్తవు కమ్ము' అని చేసిన ఆదేశమును వినిపించి, నాటకప్రయోక్త ఆచార్యుడేనని సూచించినాడు. నాట్యశాస్త్రములో అక్కడా ఇక్కడా ప్రయోక్తలు, భరతులు, సూత్రధారుడు చేయవలసిన పనులు దర్శకునివికాదా అన్న అనుమానము కలిగించేటివే అయినా నాటక ప్రదర్శనానికి సహాయపడేవారూ నాట్యరంగపూజలో తమ పనులు నెరవేర్చువారూ పెక్కురుండడములో ఈ ఉద్యోగములు పెరిగి వట్లున్నవి కాని ప్రదర్శన కార్యములో పరస్పర స్వతంత్రములైన పనులు నెరవేర్చే వారు కారు వారందరూ. ఆ తొలిరోజులలో ప్రతివారికీ తలొక పనీ పదవీ వచ్చింది. వాటినన్నిటినీ అదేరీతిగా నిలపడము నేడు విడ్డూరమౌతుందన్న మాటనలా ఉంచి, అనుపయోగమూ ప్రతిబంధమూ కూడాను.

నే నొకమారు స్ట్రాన్డ్ మాసపత్రికలో చదివినట్లు జ్ఞాపకము సర్ కెడ్రిక్ హార్డ్‌విక్ వ్యాసాన్ని, ఆయన హామ్‌లెట్ పాత్ర ధారణకు చాలా ప్రఖ్యాతి పొందినవారట. ఆయన వ్రాశారూ, ''నేను లండను నగరములోనూ జిల్లా పట్టణాలలోనూ ఒకే హామ్‌లెట్ పాత్రను చూపించను. జిల్లా పట్టణాలవారికి సంశ్లిష్ట నటన పట్టదు. కనక అక్కడి హామ్‌లెట్ చాలా సరళ స్వభావుడన్నట్లే నటిస్తాను'' అని. లండను నగర ప్రేక్షకులకూ చిన్న పట్టణాల ప్రేక్షకులకూ తేడా ఉండవచ్చును, అది వేరుమాట. కెడ్రిక్‌హార్డ్‌విక్ గారు మాత్రము తన పాత్రాభినయాన్ని సర్దితే ఏమయినట్టు. ప్రేక్షకులు చూడడానికి వచ్చినది హామ్‌లెట్ కథను. హామ్‌లెట్ ఒక్కడే నటకుడై, తాను చేసేది ఏకపాత్రాభినయమే అయితే నటుడి ఇష్టము. తాను ఆ పాత్రను ఎలా కనపరచానుకుంటాడో అలాగే కనపరుచుకోవచ్చును. కాని క్లాడియసూ, హొరేషియో, పొలోనియసూ, హామ్‌లెట్ మిత్రులూ, ఒఫీలియా — ఇంతమంది

హామ్‌లెట్ మాటలకు జవాబులు చెపుతూ కథను ఆవిష్కరించవలసి ఉండగా, ఒక్క హామ్‌లెట్ మాత్రము తన పాత్రాభినయాన్ని మార్చితే జరిగేది ఏమిటీ? వారందరూ ఈయన చేసిన మార్పునకు అనుగుణమైన మార్పును తమ పాత్రాభినయములో చేస్తారనే ఆయన నమ్మకమా? చెయ్యరనా ?

నటులందరూ తమ తమ సంస్కారానికీ, ఇష్టానికీ తోచే రీతిగా తమ పాత్రాభినయాన్ని తీర్చి ప్రదర్శిస్తే నాటకము ఎలా గుంటుందీ? నాటక ప్రదర్శనము వ్యక్తి నటనలు కలిపి కట్టిన మూటయేనా? ఒక నటుడు ప్రదర్శనము ప్రదర్శనానికీ తన నటనను పెంచుకునో దిద్దుకునో తయారు చేసుకుంటూంటే తక్కినవారు కూడా మారుతూనో మారకుండానో వుంటారుగదా, ఈ అందరి నటుల అభినయాలూ చేర్చి అతికిన ఆ నాటకపు బొంత ఎంత అందముగా ఉండగలదూ? శ్రీకృష్ణరాయబారము వర్ణచిత్రాన్ని ఊహించండి. శ్రీకృష్ణుడూ, సాత్యకీ, దుర్యోధనుడూ, దుశ్శాసనుడూ, ధృతరాష్ట్రుడూ భీష్మ ద్రోణ కర్ణ శకుని కృపాచార్య ప్రభృతు లుంటారు సేవకులుంటారు. మనమందరమూ చిత్రకారులమే అనుకొండి. ఒకొక్కరము ఒకొక్కరి చిత్రాన్ని తీర్చి చిత్రిస్తే ఆ రాయబార చిత్రము ఎలాగుంటుంది? ఇంతమంది చిత్రకారులు చిత్రించినదాయెను. అధికస్య అధికం ఫలం కాదా?

ఒకమారు స్థానం నరసింహారావుగారూ, బళ్లారి రాఘవాచార్యులుగారూ సారంగధర నాటకంలో చిత్రాంగీ రాజరాజు భూమికలను ధరించి, వేశారట. చివరి రంగంలో రాజరాజుకు చిత్రాంగి సారంగధరునికి వ్రాసిన ఉత్తరమూ, ఆమె మానసిక రహస్యమూ తెలిసినవి. కళ్లనిండా కోపము తెచ్చుకుని చిత్రాంగిని అరచి లేపి, ఎర్రవారి చూచినారట నాట్య కళాప్రపూర్ణులు. రాజరాజు వేంగీ సామ్రాజ్యాధీశుడు, ఎర్రవారి చూస్తే పెద్దపులి అయినా హడిలి పోవాలని వారి నమ్మకము· ఇక పద్మశ్రీ నరసింహారావుగారో. చిత్రాంగి తారుణ్యాభర, వంచిత ఏకాకి. రాజు కనుమొరిగి సారంగధరుని పొంద యత్నించి విఫలురాలై గాయపడిన అభిమానముతో వలవేసి సారంగధరునీ రాజరాజునీ పట్టింది· రాజరాజు తన మోసాన్ని గ్రహించాడు. తనకురాగల కొత్త, పెద్ద—అపాయమేమి కాగలదూ ? మృత్యువు. అది ఎప్పుడో స్థిరముచేసుకుంది. కసి తీరలేదు, దైవేచ్ఛ. మిగిలి వచ్చిన ఈ సన్నివేశాన్ని కాస్తా ఉపయోగించాలి. రాజరాజు దగ్గరకు చేరి 'ఓయి వెర్రిరాజా' అని ఆతని రొమ్ముమీద చరిచారట స్థానం వారు. ఆయనకు నాటకపు కోపము కాక నిజమైన కోపమేవచ్చినది! ఏమీ అని! ఇక్కడ ఆత్మవంచన చేసుకుని నటించిన వారెవరూలేరు. ఆయన దృష్టిలో ఆయనది రైటు, ఈయన దృష్టిలో ఈయనది రైటు! ఇందులో తప్పెవరిది?...ఉగాది కానుక అన్న కథ జ్ఞాపకానికి వస్తున్నది. ఆయనగారి వాచీకి చక్కని బంగారు గొలుసు కొనాలని ఈమె, ఈవిడ వేణిమీదకు రాగిడీ కొనడానికి ఆయనా బజారుకి వెళ్లారు. మర్నాడు ఈయన తెచ్చిన నాగరానికి ఆమె బాబ్డు జుట్టు పొట్టి అయివుందీ, ఆయన వాచీ ఈమె నాగరాన్ని కొనడానికి మారుగిళ్లయింది అని తెలిసింది ఇద్దరికీ! ఎవరిదారి వారిదయితే ఇదీ వరస.

''పోనీ ముందు చెప్పకుంటేనో?'' అంటారు పాఠకులు. సావిత్రి నాటకము జరుగుతోంది. ఉప్పలూరి సంజీవరావుగారు సావిత్రీ, నాట్య కళాప్రపూర్ణులు యముడూను. ''పోవుచున్నాడే నా విభుని జీవములను గొని'' అన్న సుదీర్ఘపు రాగమాలికపాట సంజీవరావుగారికి స్పెషల్· ముందే చెప్పేరు రాఘవాచార్యులుగారు 'ఆ పాట అభినయానికీ ఆ సన్నివేశానికీ కుదరదు, పాడవద్ద'ని. కాని హార్మనిస్టూ పాడేవారూ కూడబలుకుకుంటే ఎవరు అడ్డగలరూ? పాటను పాడనే పాడేరు సావిత్రిగారూ, 'ఎక్కడికీ వెళ్లలేదమ్మా ఇక్కడే వున్నాను. నీవు రాగమునంత శ్రావ్యముగా పాడుతూంటే ఎట్లాపోగలనూ?' అనో మరొకటనో అన్నారు యముడుగారు !

ఇద్దరిద్దరి ఆదర్శాలే ఇంత అతుకుతున్నాయే, మనమంతా చిత్రకారులమై శ్రీకృష్ణరాయబార వర్ణ చిత్రమును మొత్తంగా రచిస్తే ఆ చిత్రము ఎంత సొంపుగా ఉండగలదూ ? ఒక కథలోని సన్నివేశమొక్కటి ఇంత అందంగా కుదురుతోందే, నాటకము మొత్తమంతా నటుల ప్రదర్శనాల సమ్మేళనమైతె ఆ నాటకము ఎంత రాణించగలదూ ? ఒకొక్క ఊరినుంచి ఒకొక్క నటుణ్ణి తెప్పించి వేయించిన కంట్రాక్టు నాటకాలు చూస్తున్నాము గదా? ఈ సినీమా నటుడో నటో వస్తూండబట్టీ, ఆ నటుడు గ్రామఫోను పాటలుపాడతాడనే ఆకర్షణబట్టీ, వీరంతా ఒక్కమారు రంగంమీద కనబడే వింతను చూడనెంచీ వస్తారుగాని జనమూ, ఆ నాటకము చూడాలని రారు. కనుక ప్రేక్షకుల సమ్మర్దమును బట్టి నాటక ఆకర్షణను నిర్ణయించలేము.

చదువరులనవచ్చు : 'నటు లెక్కడ నుంచి వచ్చిన వారైతే నేమి రిహార్సల్సు పడిన తర్వాతనైతే నాటకము బాగుండక ఏమవుతుంది?' అని. కంట్రాక్టు నాటకాలలో కాంబినేషను — కలుపుగోలు తనము — కుదరదు. నేను చూచాను విజయనగరము వయొలినిస్టు సత్యంగారిని దైతా గోపాలంగారు 'వాయించండి' అని, పాడి, ఏవో అనుస్వరాలు రాలేదని అవస్థ పెట్టడమూ, మేనేజరు గుప్తగారితో 'చూచారా మేము ఎంత తంటాలు పడవలెనో' అని హెచ్చరించడమూను, రాఘవాచార్యులుగారు ధర్మరాజు వేసినవారిని — అనే జ్ఞాపకము — 'ఈ పద్యము కదన కుతూహలంలో పాడండి; బాగుంటుంది' అని సత్యంగారిని వాయించమంటే ఆయన విసిరేరు 'రఘువంశ సుధాంబుధి'. ఎవరి గొంతు పెద్దదైతే వారి మాట తేలి వినబడుతుంది. కూర్చి నాటకము వేయించేవారికి గల్లాపెట్టెమీదవున్న శ్రద్ధ మరిదేనిమీదా ఉండదు. నటులకు ఎవరి విజయముమీద వారికున్న కాంక్ష ప్రదర్శనము మీద ఉండదు. మరి రిహార్సలులో జరిగేది ఎంత మాత్రము సంఘటనము కాగలదూ? అందులో మనవారి నేర్పు నాటకరంగంమీద ప్రకటితమైనంత రిహార్సలులో ప్రకటితము కాదు, రహస్యము. అది వారి కొక్కరికీ సంబంధించినదీ స్వగతాల కాలంలోదీ అయితే ఇంకొకరికి బాధాకరము కాదు· రాఘవాచార్యులుగారు రామదాసువేస్తూ ఒకమారు ప్రేక్షకులలోనే కూర్చుని వుండి తొలి రంగంలో భద్రాద్రి యాత్రికులజట్టు ప్రవేశించి పాడుతూంటే ప్రేక్షకులలో నుంచే రంగస్థలం ఎక్కేరట. ప్రేక్షకుల హాలు తమ ఇల్లా రోడ్డా? అంతసేపూ 'ఈయన ఇక్కడ కూర్చున్నారేమిటి?'

అన్న అక్కాజము ఆ నటుని ఉపజ్ఞను సూచించి ఊరుకుంటుందను కోగలమా ? మళ్ళీ ఆ రాఘవాచార్యులుగారే ఒథెల్లో భూమిక నటిస్తూ డెజ్ డిమోనా హత్యా రంగంలో 'It is the cause, let me not name it to thee, it is the Cause' అన్నచోట అద్దములో చూసుకుంటూ ప్రవేశించి, పై మాటలని, అద్దాన్ని విసిరికొట్టేవారట; తన వల్లనిరూపే ఆమె ప్రేమఘాతకు కారణ మనీ. ఇది బాగున్నదనిపిస్తుంది. యముడి వేషంలో భీకరంగా కాక మహా సౌమ్యవేషంతో వచ్చి 'సావిత్రీ — నీ సౌశీల్యమును మన్నించుట కని ఈ సుసౌమ్య రూపముతో వచ్చినాను' అనేవారట. అది సరే, ఆమె వెంటాడకుండా కాచదే ? భటుల్ని పంపకుండా తానే రావడపు టుద్దేశ్యము పోతోంది? సౌమ్యరూపంతోవస్తే ఆమె లోకువకట్టదా? ఆమెకు భయోత్పాతము కలిగించి సత్యవంతుడు కాలధర్మము చెందె నన్న సమాధాన స్థితికి ఆమెను తీసుకురావడానికి యముని సౌమ్య వేషము అడ్డుకాదా ? రాఘవాచార్యులు గారికి వారికి తోచినట్లుగా చేసే స్వాతంత్ర్యముంటే సుబ్బయ్యగారి కెందుకులేదు? వారు చింతా వేశముతో స్మృతి తప్పిపడబోతే పట్టుకున్న ఈ నటులంతా నన్నూ పట్టుకుంటారని, భీమ వేషముతో ధర్మరాజుమీద నిందలుమోపి, సహదేవుడు కాబోలు 'అన్నా, ఏమిది ? ఎవరని ?' అంటే, 'స్మృతి తప్పి'నారు సుబ్బయ్యగారు. అయితే వారిని చుట్టుపట్లవారు పట్టు కోలేదు. వారికి కోపము వచ్చినది. సహజమే కదా ? ... సినిమా తీయునప్పుడే ఇంత కలుపు కానవచ్చిందే, నాటకములో అది ఎంత ఉండగలదు ?

నాటక ప్రదర్శనము ఒక్కరు నిర్మించినప్పుడే దానికి కళా సిద్ధి చేకూరగలదు. మేళ సంగీత సభలో వాద్యకాండ్రు పెక్కు రున్నా, వారు నిపుణులే అయి, ఎవరికి వారు చక్కగా వాయించినా, వారి వాద్యము లన్నిటినీ నడిపి మొత్తపు టందాన్ని సాధించినవాడు బృందనాయకుడే. వీరి వాద్యాలన్నిటినీ ఈ యీ స్థాయిలో ఈ రీతిగా నడిపినప్పుడే ఆ సంగీతము శ్రోతలను పలకరించి అలరించ గలదని ఊహచేసి దానిని ఆచరణలో పెట్టి ఆరీతిగా వినిపించినవాడు అతడు. బృందము వినిపించిన సంగీతము ఆతడు ప్రచోదించినట్టిది. వాద్యముల వరుసా, స్థాయీ, వాద్యకాల ప్రమాణమూ అతడే నిర్ణ యించాలి. అప్పుడే ఆ సంగీతమునకు ఐక్యత సిద్ధిస్తుంది. అదే ప్రకారము నాటక ప్రదర్శనలో నిపుణులైన కళాకారులతో సూత్ర ధారుడు లేదా డైరక్టరు రూపొందించాలి.

# పాలవెల్లి

## ప్రత్యూష

ఎగువ సూరయ్య మంటల అగ్గిపిడుగు
దిగువ నబ్బులు విప్పిన గుబ్బగొడుగు
కారుచీకట్లు మురిపాల మూటగట్టి
నా తుఫాను గాలుల బాణా లెక్కుపెట్టి
చీల్చి చెండాడగలనురా !
తలను వాల్చుక నడవరా !

నేను పెంచిన చిన్నారి జొన్నచేను
మృదుల మంజుల మరకత హసిత వదన
గట్టుపై నేను కట్టిన మంచెపైకి
దింపి సూరయ్య నభిషిక్తు చేతునిపుడె !

అతడు కృతకాద్రి నడికొప్పు కెక్కిచూచు !
దుష్ట పశువులు నాచేను మెక్కకుండ !!

సంజె కెంజాయ వడిసెలల్ త్రిప్పకాచు
పలుగు పులుగుల బారిని పడక చేను
దొంగ క్రీనీడ పిట్టల దిసెల కవల
ఇరుల తీరాల కరిగెనో ఎరుక పడదు ...

ఎండ వేళల మ్రోక మొదళ్ళనీడ
అదనుకోసము వేచిన పరిగపిట్ట
లెక్కరానీక సూరీడు కాపు కాచు !

పగటి వెచ్చటి గాడ్పుల కవసినరులు
తిట్టుకొనుచుండ్రి సూరయ్య నింతవరకు
ఇప్పుడా బెంగలేదు ! దినాంతమందు
కెంపు నిప్పుల కుంపటి రాజవేసి

జొన్నకంకుల కాల్చుచు —
విందులు పసందు సేయు !
ఇపుడె దివసాంత వేళలో ఇంపుకూర్చు
పారవశ్యంపు టనుభూతి ! పాలవెల్లి !

# కల

## శ్రీ పజ్ఝల కాళిదాసు

శ్రీ లక్ష్మి రుచిర స్మితంబు
లమృత స్తోమంబులున్ దేవతా
స్త్రీ లావణ్య విలాస వి భమములున్
క్షీరాబ్ధి ధావళ్యముల్
ప్రాలేయాంశు రుచుల్ తమోపహ
యశో వాల్లభ్యముల్ పైడి చూ
లాలిన్ స్వాపన ము దితన్ నిమిరె
సౌహార్ద్రమ్ము సాంద్రమ్ముగా !

రవి గ్రుంకినంతఁ జీకటి
భువిఁగ్రమ్మఁగఁ జూచి కాలపురుషుడు భాను
చ్ఛవి ప్రతిఫలింపఁ జేయన్
దవిలించిన ముకురమ్మో యనన్ శశి తోచెన్.

కటికిరేయితిండి కరముల గిలిగింతఁ
బులకరించి కులుకు కలువ కన్నె
కరగుచుండె మ్మోద భరమున ననగ వె
న్నెలలఁ దళుకులీను కొలను దోచె !

మిన్నున నాడు నచ్చరల
మేని తళత్తళ లుర్విమీదకున్
గ్రన్నన జారుచుండెననఁ
గన్పడె వెన్నెల వెల్లువల్; తదీ
యోన్నత చందనాంకిత
కుచోపరి నర్తిత రత్నహార సం
పన్నిలయమ్ములై కనుల
పండుగొనర్చెను తారకావళుల్ !

అల్లన గాలిలోఁ గదలియాడుచుఁ
బచ్చిక లేత కంబళుల్
తెల్లని వెల్గులన్ బ్రతిఫలించుచు
నుండగ దర్శనీయమై
చల్లని చందమామ నును
చక్కిలి గింతలలోన ధా తి సం
ఫుల్ల మనస్కయై కరగి
పోవుచునుండె ననన్ గనంబడెన్ !

ప్రమదావని ప్రసవోత్సవ
మమరులు తిలకించి చకితులై యనిమేష
త్వముఁ గోలుపోయిరనఁ దో
చె మినుకు మినుకుమనుచున్న చిరుచుక్కగముల్.

ఆ లీలావన మధ్యమందు
రమణీయంబై విశాలంబునై
ప్రాలేయాచల పూర్ణవైభవ
కళా ప్రాచుర్యమై క్రొత్త యం
దాలన్ జిందెడు నొక్క వేదికపయిన్
వైవిధ్యముల్ చంద్ర శా
లా లాస్యంబులు కూర్చు చుండె
నయనోల్లాసం బమందంబుగన్ !

రాకేందు ద్యుతి చుంబనోల్లసిత
పారావార దుగ్ధాచ్ఛ వీ
చీ క్రమాంక సముద్భవత్ కమలజా
శృంగార సంస్ఫోరకం
బై కన్పించె సముజ్వల ప్రభల
మాయాదేవి, తత్ చంద్ర శో
భా కుందస్రజ భూషితైందవ శిలా
పర్యంక మధ్యంబునన్ !

అంతర్వ్యాత తమోపహ చ్ఛవుల
మాయా ముద్రితాక్షిద్వయం
బంతన్ గాంచె సుషుప్తి మార్గముల
దివ్యా దర్శన స్ఫూర్తి, నా
శాంతవ్యాపృత సత్య శాంతిమయ
దుగ్ధావార పారోది తా
శ్రాంత ప్రస్ఫుర దంశుమంత సిత
విస్ఫారార్ద్ర చాంద్రీగతుల్.

జలతారు పోఁగులోయన
మిల మిల దివినుండి భూమి మీదకు దిగు వె
న్నెల తీగలందు నూగుచుఁ
గల హంసిక యొకటి యామె కన్నుల గట్టెన్ !

ఆ వెనుకన్ సితప్రభ
వెలార్చెడి, రెక్కల సొంపు నిండు పొ
రావత మొందు, స్వర్గనగర
ప్రమదావన పారిజాతముల్
క్రేవల మెల్ల జల్లుచు నిలింప
లతాంగులు వెంటరాగ నై
రావత మేగుదెంచిన తెరంగున
కన్నుల గట్టె నామెకున్!

దళదళమున తెలి వన్నెలు
తళ తళమని వెలుగగ కుముదమొకటి దంతా
వళ దీర్ఘ కరాగ్రమ్మున
కళలీనుచు నవ్వుచుండె కనుపండువుగా!

ఆ యపూర్వ వస్తు సముదాయ ప్రసారి
తాచ్ఛ కాంతిపుంజంబు మాయా శరీర
మున్ బ్రవేశించి నంతనే అనుపమాన
దివ్య తేజస్సుతో నామె తేజరిల్లె.

కలలోం గాంచిన వింతలన్
బతికెరుంగన్ జేయ శుద్ధోదనుం
డలరెన్ వింతగ; ప్రాజ్ఞులన్ బిలచి
వ్యాఖ్యానంబు నర్థింప వా
రలు వాక్రుచ్చిరి – "రాణికిన్ గలుగు
సర్వజ్ఞుండు, సర్వం సహా
తల సంపూజిత సాంద్రకీర్తి,
జినుడై, దైవాంశ సంభూతుడై!!!"

*[నా 'శాంతిజ్యోతి' నుండి]*

---

# కాలం సత్యం మరణం మిధ్య

శి వ కు మా ర్

ఎక్కడో దూరాన
వినిపించును
ఒక మధుర పికనాదం.

విచ్చుకొనును పశ్చిమాన
తొలివేకువ పసిడి మొగ్గ.

కాంతికిరణ కరాంగుళి సోకి
పులకించును పచ్చని ప్రకృతి

జీవితకాంతి దీధితులను
రాహువువలె కబళించనెంచు
మృత్యు కరాళ దంష్ట్రలు
గ్రసించలేదు మృత్యువు
వేయివెలుగుల వెదజిమ్ము
అమృతకాంతి లహరి.

తమస్సును దహించును
జ్ఞానాగ్ని జ్వాలలు
కాలమొక నిర్ఝరణి
నిరంతర పరిణామశైవలిని
జీవిత సరళ రేఖలో
మరణం స్థిరబిందువు

మరణం క్షణికం
మరణం మిధ్య
కాలం శాశ్వతం
కాలం సత్యం.

నిఖిల్

# అపనమ్మకపు నీడల్లో కవి బైరాగి

గత సంవత్సరం సెప్టెంబర్‌లో మరణించిన కవి బైరాగి అసలు 1970 నాటికే కవిత్వం రాయడం మానుకున్నారు. 1965లో దిగంబర కవితోద్యమాన్ని ప్రారంభించిన రోజుల్లో హైదరాబాద్‌లోనే బైరాగి పరిచయమయ్యారు. వాస్తవంగా అప్పటికే ఆయన కవితారచనను వదిలి వేసినట్టు అనుమానం. హైదరాబాద్‌లోని ఆబిడ్స్ సర్కిల్ వెనక 'దిగంబర కవుల' సంచాలకుడైన సుబ్రహ్మణ్యంగారి ఇల్లు ఆ రోజుల్లో మాకు 'సెంట్రల్ పాయింట్'. ఆ పాయింట్ దగ్గరే బైరాగిగారితో మా అందరి స్నేహం 1970 దాకా పెరిగింది. ఆ తర్వాత మళ్లా ఆయనను నేను చూడడం తటస్థించలేదు.

బైరాగితో నాకు వ్యక్తిగత పరిచయం కలగక ముందు 1960లో అనుకుంటూ ఆయన కవిత్వంతో పరిచయం ఏర్పడింది. అప్పుడప్పుడే గోపిచంద్‌గారి ''అసమర్థుని జీవయాత్ర'' చదివినపుడు అందులో ఒకచోట బైరాగి పేరు కనపడుతుంది. ఆ నవలలోని నాయకుడు సీతారామారావు ఒక సన్నివేశంలో విసుగుతో — కోపంతో ఒక కవిత వ్రాస్తాడు. ఆ కవితకింద గోపిచంద్‌గారు ''తాజమహల్ పడగొట్టండోయ్'' వ్రాసిన బైరాగికి క్షమాపణలతో అని ప్రత్యేకంగా ఉటంకించారు. గోపిచంద్‌గారికి సన్నిహిత బంధువులైన బైరాగి వ్యక్తిత్వంతో ఆయనకు పరిచయం వుంది కాబట్టి సీతారామారావు పాత్రలో బైరాగిఛాయలు వున్నాయనుకోడానికి ఆస్కారం వుంది. ఆ నవల చదివిన తర్వాత బైరాగిని కూడా చదవాలని నాకు ఆసక్తి పెరిగింది. అనుకోకుండా ఏదో పత్రికలో ఆయన కవితా ఖండిక ''నాకొంచెం నమ్మకమివ్వు!''ను చదవడం జరిగింది.

ఈ కవితా ఖండిక శైలీ —వస్తువు నన్ను ఎంతగా ఆకట్టుకుందంటే వెంటనే దాన్నిహిందిలోకి అనువదించాను. హైదరాబాద్ ప్రభుత్వ సాయం కళాశాలలో నేను, మిత్రుడు నగ్నముని బి. ఏ. చదువుతున్న రోజులవి. అప్పుడే 1962 లో ఆ కళాశాల హిందీ మ్యాగజైన్ ''ప్రతిభ 'లో బైరాగి కవితను ''ముజే కించిత్ విశ్వాస్ దో'' (నాకొంచెం నమ్మకమివ్వు) శీర్షిక కింద ప్రచురించారు. గమ్మత్తుగా జరిగిందేమిటంటే అనువాదకుడిగా నా పేరు ప్రచురించడం మరచిపోయి ఆ పత్రిక సంపాదకుడు — 'అనువాదకుడు — బైరాగి (బి ఏ. రెండో సంవత్సరం)' అని అచ్చువేసాడు. ప్రస్తుతం ఈ కవిత తెలుగు మూలం నా దగ్గర లేదు. హిందీ అనువాదం మాత్రం వుంది. చివరికి ఆయన కవితా సంపుటాలను పునర్ముద్రించిన ఎ. బి సి. ప్రచురణల వాళ్లు కూడా ఈ కవితను ఆ సంపుటాల్లో చేర్చలేదు. అలాగే బైరాగి మిగతా ఖండికలు 'పిరమిడ్లు' (అప్పట్లో ''యువ'' మాస పత్రికలో చదివినట్టు జ్ఞాపకం), శ్రీ రంగం నారాయణబాబు పోయినపుడు చెప్పిన కవిత మొదలైనవి కూడా ఈ సంపుటాల్లో చేరలేదు.

1940–50ల మధ్య వెలువడిన బైరాగి కవితా సంపుటాలు రెండు — 'నూతిలో గొంతుకలు', 'చీకటి నీడలు'. 1960 తర్వాత కూడా వాటిని పునర్ముద్రించాలని కవి ప్రయత్నించినట్టు లేదు. ఆయన బంధువులు లేదా శ్రేయోభిలాషులు కూడా అలాంటి ప్రయత్నం ఏదీ చేయలేదు. విచిత్రమేమిటంటే బైరాగి చివరి శ్వాస వదలగానే ఆ సంపుటాలు తిరిగి వెలుగును చూసాయి. వాటిని హడావిడిగా తిరిగి అచ్చువేయడంలో ప్రచురణకర్తలు ఈ సంపుటాల మొదటి ముద్రణ తేదీల గురించి అసలు పట్టించుకోలేదు. 1960 నుంచి 78 దాకా బైరాగిగారు కూడా తమ కవిత్వాన్ని అలక్ష్యం చేసారు కాబట్టి మరెవ్వరు పట్టించుకోలేదు అయితే కవి చనిపోగానే కనీసం సంతాప సభలు, పత్రికల్లో వార్తలు, వ్యాసాల ద్వారానైనా ఆ కవి రచనల మంచి చెడుల గురించి మాట్లాడుకొనే ఒక పద్ధతి ఇంకా తెలుగు సాహిత్యంలో మిగిలిపోయింది. అందువల్లనే కాబోలు బైరాగి కవిగా తనువు చాలించిన తర్వాత ఎవరూ పట్టించుకోలేదు. మనిషిగా పోయిన తర్వాత ఆయన కవిత్వాన్ని పునర్ముద్రణ ద్వారా బతికించే ప్రయత్నం చేసారు. మరింత శ్రద్ధ వహించి బైరాగి మిగతా ఖండికలను మరో సంపుటం ద్వారా తెలుగు సాహిత్యాభిమానులకు ఎ. బి. సి ప్రచురణ కర్తలు అందిస్తారని ఆశిద్దాం.

బైరాగి పోయిన తర్వాత ఆయన కవిత్వంతో—వ్యక్తిత్వంతో లంకెవడిన జ్ఞాపకాలు కొన్ని నాకు మిగిలిపోయాయి. ''నాకొంచెం నమ్మకమివ్వు'' కవితను హిందీలో అనువదించి 1962లోనే సాయం కళాశాల (నిజాం కాలేజి ఆవరణలో) హిందీ సాహిత్య సమితి ఏర్పాటు చేసిన కవిసమ్మేళనంలో చదివాను. ఆ సభకు ముఖ్యఅతిథి ఆనాటి రాష్ట్ర ఆరోగ్యమంత్రి మెహదీ నవాజ్ జంగ్. ఆయన ఆ కవితను విన్న తర్వాత వెళ్లిపోయేముందు విద్యార్థుల మధ్యనున్న నన్ను పలకరించి కరచాలనం చేసి కవితను మెచ్చుకున్నారు. ఆవిధంగా ఆనాటి బైరాగిలోని ఆశావాదానికి — నమ్మకానికి పరోక్షంగా అభినందన లభించింది.

అయితే 1965–70ల మధ్య దిగంబర కవితోద్యమ ఉధృతిలోవున్న మాకు ఆయన కేవలం నిరాశావాదిగానే కనిపించాడు. బక్కపలచగా పొడుగ్గావుండే బైరాగి తిండి విషయంలో ఏమాత్రం శ్రద్ధ వహించేవారుకాదు. స్ట్రాంగ్ చాయ్ (అసలు డికాషన్ మాత్రమే ఒక్కోసారి) బన్ రొట్టేమాత్రం తినేవారు. ప్రత్యేకించి

దేనిపట్ల ఆసక్తి వుండేది కాదు. అన్ని సిద్ధాంతాలను తీవ్రంగా విమర్శించేవారు. చివరికి 1968–70ల మధ్య ఆయన సంపాదకత్వం (అనువాదం కూడా)లో వెలువడిన ''ఆధునిక తెలుగు కవిత'' అనే తెలుగు కవితల హిందీ అనువాదాల సంకలనం (ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ) విషయంలో కూడా ఏదో వివాదం ఏర్పడి అశ్రద్ధ వహించారు. అప్పటికే ఆయనకు అటు సమాజంతో ఇటు సాహిత్యంతో సంబంధాలు తెగిపోయినాయి.

ఒకనాడు బైరాగి ప్రగాఢ విశ్వాసంతో ఈ సమాజాన్ని–వ్యవస్థను అర్థం చేసుకోవాలని బయలుదేరాడు.

> ''నాక్కొంచెం నమ్మక మివ్వు
> కొండలు పిండి కొట్టేస్తాను
> చితికిన టొమేటోలాంటి సూర్యుణ్ణి
> ఆరిన అప్పడంలాంటి చంద్రుణ్ణి
> ఆకాశపు ఎంగిలి పళ్ళెంలోంచి నెట్టేస్తాను
> నాదగు బాహుబంధనంలో
> ఈ సువిశాల బ్రహ్మాండాన్ని
> చాపలాగా చుట్టేస్తాను......
> నాక్కొంచెం నమ్మకమివ్వు......''

కాని చివరికి ఆయన అపనమ్మకపు నీడల్లోనే బతికి 'నమ్మకంలేని జీవితం నిరర్థకం' అనే తన స్వంత మాటలను సార్థకం చేసుకున్నాడు.

> ''నమ్మకంలేని బతుకు ఖాళీ సిగిరెట్టు టిన్ను
> నమ్మకంలేని హృదయం ఖాళీ అగ్గిపెట్టె
> నమ్మకంలేని జీవితం కాలిన సిగిరెట్టు బూడి
> అన్నీ వుండి కూడా
> నమ్మకంలేని జీవితం నిరర్థకం!
> నా క్కొంచెం నమ్మకమివ్వు''

అంటూ ఆయన ఆనాడు ఆశాజీవిగా ఆ కవితను ముగించాడు.

కాని బైరాగి స్వతహాగా 'సంశయాత్మ'తో బయలుదేరిన వాడు. అభ్యుదయ కవితోద్యమ ప్రభావంవల్ల కొంతకాలం ఆయనపై మార్క్సిజం ఛాయలు ప్రసరించాయి. ఆ ఛాయను చల్లని నీడగా చేసుకోకుండానే ఆయన 'అపనమ్మకపు నీడల'కిందికి చేరుకున్నారు. ఇంగ్లీషు కవి టి. యస్. ఇలియట్, హిందీకవి గజానన్ మాధవ్ ముక్తిబోధ్ కవితా ప్రభావం బైరాగిపై ప్రగాఢంగా వుంది. ఒకవిధంగా 'ముక్తిబోధ్' కవిత్వా–జీవితంతో బైరాగికి చాలా దగ్గరి పోలికలు వున్నాయి. అయితే ''ఛాంద్ కా మూంహ్ టేఢా హై'' (చంద్రుని ముఖం వంకరగా వుంది) అనే ప్రసిద్ధ కవిత రచించిన ముక్తిబోధ్ అంతిమ దశలో రోగగ్రస్తుడై ఆసుపత్రిలో మరణించేవరకు మార్క్సిజంపట్ల విశ్వాసంతో వున్నాడు. (బైరాగి హిందీలో కూడా కవిత్వం వ్రాసి ఉత్తర భారతదేశంలో పేరు తెచ్చుకున్నారు. చివరకి రాడికల్ హ్యూమనిజంపట్ల ఆయనలో కొంత విశ్వాసం మిగిలివుండేది.)

'నూతిలో గొంతుకలు' కవితా సంపుటికి తొలిపలుకు వ్రాసుకుంటూ బైరాగి వ్యాఖ్యానించారు.

—''నూతిలో గొంతుకలు సంశయ కావ్యం. దీనిలో మానవుడు 'ఏది త్రోవ?' అనే అడుగుతున్నాడు. 'నాన్యః పథా విద్యతేఽయనాయ' అని చెప్పగలిగే స్థితిలో లేడు. చీకటిలో ప్రారంభమైన ఈ కావ్యం 'ఆవేదనల అనంతంలో అంతమైన జీవితాలను' చర్చిస్తున్నది. దీనిలోని నాయకులు—'హేమ్లెట్, అర్జునుడు, రాస్కల్నికోవ్', సందిగ్ధావస్థలో ఒక క్రమబద్ధమైన పరిణామాన్ని సూచిస్తున్నారు. హేమ్లెట్ వేదన కర్మపూర్వం. అర్జునుడి వేదన కర్మక్షేత్రంలో తక్షణికం. రాస్కల్నికోవ్ బాధ కర్మ తరువాత. కాని ముగ్గురి బాధ ఒకేస్థాయిని అందుకుంటుంది. అది మానవుని సహజ వేదన. అతణ్ణి త్రికాల్లోను వెంటాడ్తుంది. ఆ బాధలో మథనపడనివాడు పూర్ణత్వాన్ని అందుకోలేడు. ఆ బాధనుంచి అతను తప్పుకునే మార్గంలేదా–అంటే వుంది. పలాయనం. కృతకశక్తుల పూజనం. ఆత్మహననం.'' ఈ వ్యాఖ్యానం ఆయన కవిత్వానికి — జీవితానికి అక్షరాల అన్వయిస్తుంది.

కవి సహజంగానే 'సంశయాత్మ'తోనే బయలుదేరుతాడు. తన సృజనాత్మకశక్తికి ఆ సందిగ్ధావస్థలోనే పని కల్పిస్తాడు. అయితే ఆ అన్వేషణ సమాజంలో ఒకడిగా, సమాజ శ్రేయస్సుకోసం, మార్పుకోసం కొనసాగితే ఆ కవి వ్యక్తిగత పరిధిలోంచి సమిష్టి అనుభవంలోకి ఎదుగుతాడు. తనకోసం సమాజం, సమాజంకోసం తాను అనే విశ్వాసం పెనవేసుకుంటుంది. అందరి ఆనందంకోసం ఆలోచనలకోసం సృజనాత్మకత పురోగమిస్తుంది. వ్యవస్థలో నిహితమై వున్న స్వార్థపరశక్తుల స్వరూపాన్ని బహిర్గతపరుస్తూ సాంఘిక నిరసనాన్ని వ్యక్తం చేస్తుంది. విముక్తి పోరాటాలకు సాధనమవుతుంది. అన్నిదశల్లో విశ్వాసంతో తనవంతు పాత్రను నిర్వహిస్తుంది.

ఈ లక్షణాన్ని — ప్రయోజనాన్ని కొంతమేర మొదటి దశలో బైరాగి కవిత నిర్వహించింది కాని ఆ తర్వాత ఓటమి తత్వంతో కొనసాగి శూన్యత్వంలోకి జారిపోయింది. సమాజంలోని కొల్లగొట్టే శక్తులతో పోరాడవలసిన చేవను కోల్పోయి పలాయనవాదంలోకి, నిష్ప్రయోజకత్వంలోకి చేరి నిష్ఫలమైపోయింది.

ఈ వ్యవస్థ సమాజానికి- వ్యక్తికిమధ్య కల్పించేవైరుధ్యాన్ని ఆయన పూరించుకోలేకపోయారు. ఆ అగడ్త పెద్దదైపోయింది. అవిశ్వాసం బోయమై, నిరాశా నిస్పృహలు దగ్ధంచేయగా బైరాగి కవిత్వం 'నూతిలో గొంతుకలు'గానే క్షీణస్వరంగా మిగిలిపోయింది. అపనమ్మకపు ''చీకటి నీడల'' మాటున ఆయన తప్పిపోయారు.



# తొలకరి

## శ్రీ కె. శివారెడ్డి

నిన్నెలా పైకెత్తగలను
  నా రెక్కలమీద కెక్కించుకుని ఎలా పైకెగరగలను
వానకన్న బరువై, మంచుకన్న బరువై
చూపులేని కన్నుకన్న బరువైన నిన్ను
నా రెక్కలమీద కెక్కించుకుని ఎలా పైకెగరగలను —

వేళ్ళలో అక్షరాల జీవరసం ప్రవహించని
కొండలా పాతేసుకున్న నిన్ను
ఎలా పెకలించ గలను —

చీకటి గడ్డకట్టి ఉక్కుస్తంభంలా
భూమిలో కూరుకుపోయిన నిన్ను
నా చూపుల కెరటాలు కుళ్ళగించగలవా —

నీ శరీరంలో ఎక్కడున్నా తడుంటే నిన్ను పెల్చగలను
పెల్చి, నా తట్టకెత్తుకుని పైకెక్కగలను —

రెళ్ళని నా ధనుస్సుమీద సంధించగలను
నువ్వు బతికుంటే — నా చంకనేసుకుని
భయంకర నిర్జనారణ్యాలు గడచి
'పాలిచ్చే పశువు మైదానం' పక్కలో పారేయగలను.

నా భుజంమీద కెక్కించుకుని సముద్రాలు దాటి
ఆ కంటి ఒడ్డుమీద కూర్చోపెట్టగలను —

మొలకెత్తని అక్షరానివై నన్ను వేధిస్తున్నావు
పండని కడుపు ఏకాకితనమై నన్ను కాలుస్తున్నావు

నన్ను కానని గుడ్డితనమా !
నన్ను పిలవని మూగతనమా !
నిన్ను మధిస్తేనే తప్ప
నిన్ను పారతో తిరగేసి
దమ్ముచేస్తేనే తప్ప నాకు నిద్రరాదే —

నీ గర్భంలో ఒక కొత్త విత్తు నాటందే
నాకు విశ్రాంతి లేదు, విశ్రాంతి లేదు, విశ్రాంతి లేదు.

# నిజమవుతుందీ సత్యం

## శ్రీ యన్నంరెడ్డి వెంకటరెడ్డి

అవినీతి గ్రీష్మంలో
  మానవ వృక్షం —
దేహం కొమ్మల్లోంచి ఆకుల అశువులు
భువికి చేరువై కూరుకుపోవడంలేదా ?

ఆపిదప —
రేపటి ఆశల వసంతంలో
ఆశయాల కొమ్మల చిగురున
కోరికల పచ్చని చివురులు వేయడంలేదా ?

రాలిన ఫల జీవన ఫలితం —
మనందరికీ తెలియనిదా ?

ఒక్క రాలిన విత్తులోంచి
ఎన్నెన్ని ఫలాలు
చెట్లులై లేస్తోన్నాయి !

ఒక్క మూగవోయిన గొంతులోంచి
ఎన్నెన్ని జీవాలు
పుట్టుకొని వస్తోన్నాయి !!

# కాకతీయ రుద్రదేవుడు - వెలనాటి చోళులు

రుద్రదేవుడు రెండవ ప్రోలరాజు తనయుడు క్రీ. శ. 1158 నాటిదగు ద్రాక్షారామ శాసనము రుద్రుని మొట్టమొదటి శాసనము.[1] గుంటూరుజిల్లా నరసారావుపేట తాలూకాలోని కంకల గుంటలో దొరికిన శాసనము ఇతని చివరిది. ఇది క్రీ శ. 1197 నాటిది.[2] కాబట్టి రుద్రదేవుడు క్రీ.శ. 1158 మొదలు క్రీ. శ. 1197 వరకు రాజ్యమును పాలించినట్లు స్పష్టమగుచున్నది. క్రీ. శ. 1163 నాటిదగు హనుమకొండ శాసనము రుద్రదేవుని జైత్రయాత్రలగురించి విపులమైన సమాచారమునందజేయుచున్నది. పైనుదహరించిన శాసనమునుబట్టి రుద్రదేవుడు దొమ్మరాజును, మేడరాజును, మైళిగిదేవుని, చోడోదయుని, భీముని, తైలపదేవుని వోడించినట్లు తెలియుచున్నది. ఈ వ్యాసములో, రుద్రదేవుడు వెలనాటి చోళులపై దండయాత్రచేసి వారిని వోడించెనా లేదా యను వివాదాస్పదమైన విషయమును కూలంకషముగ చర్చించబడినది.

రెండవ ప్రోలరాజు కాలమునుండి కాకతీయులకు వెలనాటి చోళులకు వైరము ప్రారంభమాయెను. వెలనాటి చోళులు ఆంధ్ర దేశమును 11వ శతాబ్దమునుండి 13వ శతాబ్దమువరకు పరి పాలించిరి. ధనదుపురము (ఆధునిక చందవోలు) వీరి రాజధాని. వీరు తూర్పుచాళుక్యులకు, చోళులకు, కళ్యాణీ చాళుక్యులకు సామంతులుగ, సేనాధిపతులుగ షట్సహస్ర గుద్రవారమండలమును పాలించుచుండిరి. [3] నన్నరాజు సేనానిపుత్రుడైన మొదటిగొంకరాజు వెలనాటి చోళవంశమునకు ఆదిపురుషుడు. ఇతడు మొదటి కుళోత్తుంగరాజునకు సామంతుడు. ఇతని తనయుడే మొదటి చోడుడు (క్రీ.శ. 1109 – 1136–37) మొదటి చోడుని తరువాత రాజ్యమునకు వచ్చినది రెండవగొంకరాజు (క్రీ.శ. 1137–1161 –62?). ఇతడు రెండవ కుళోత్తుంగునికి రెండవ రాజరాజునకు సామంతుడు.[4] సేతు, నర్మదా, కాళహస్తి, మహేంద్రగిరుల మధ్య మున్న భూభాగమునంతయు నితని యధికారము క్రిందనున్నట్లు శాసనములవలన తెలియుచున్నది [5] ఇతడే రెండవ ప్రోలరాజునకు సమకాలికుడు.

రెండవ గొంకరాజు కర్ణాట, ఆంధ్ర, కళింగ, కుంతల ప్రభువులపై విజయమును సాధించినట్లు ద్రాక్షారామ శాసనము నందు ప్రశంసింపబడియున్నది.[6] క్రీ.శ. 1132 నాటిదగు నందలూరి శాసనములో, రెండవగొంకరాజుమామయైన 'పండ'ను ఆంధ్రప్రభువు నాస్థానమునందు కొనియాడినట్లు పేర్కొని యున్నది.[7] ఈ శాసనముల ప్రాముఖ్యతనుగురించి శ్రీమతి వి.యశోదా దేవి ఇట్లు వ్రాసిరి :

"As Velanandu Cholas were Andhras ruling over Andhra or Vengi, the mention of Andhras in their records must refer to some other Andhra dynasty. In the absence of evidence to the contrary, the Andhras of the Velanandu records probably refer to the Kakatiyas."[8]

దీనినిబట్టి కాకతీయులకు వెలనాటి చోళులకు రెండవ ప్రోలరాజు కాలములో యుద్ధము జరిగినట్లున్నది. ఈ యుద్ధ విశేషములెవ్వియు తెలియరావు. కాని వెలనాటి చోళులకే జయము చేకూరినట్లు తెలుపు శాసనాధారములుగలవు. రెండవ గొంకరాజు పుత్రుడైన రెండవచోడునికి 'కాకతి ప్రోలనిర్దహన' బిరుదుగలదు.[9] ద్రాక్షారామకోట వంశ శాఖకు చెందిన చోడయరాజునకు కూడ 'కాకతి ప్రోలనిర్దహన' బిరుదున్నట్లు క్రీ.శ. 1169 నాటి ద్రాక్షా రామ శాసనము వలన తెలియుచున్నది.[10] హైహేయ వంశజుడైన మన్మసత్యరాజునకు, 'ప్రోడక్షితీపాల మేళిమకుటాలంకార సింహాసన' బిరుదున్నట్లు పిఠాపురము శాసనమువలన దెలియుచున్నది.[11] మలయ వంశజుడైన మహాదేవరాజునకు, 'ప్రోడ ఝరిబడబానల' యను బిరుదుగలదు.[11-a] కాబట్టి రెండవ చోడరాజు, కోట చోడయరాజు, హైహేయమన్మ సత్యరాజు మలయమహాదేవరాజు వెలనాటిచోళుల పక్షమునయుద్ధముచేసి కాకతి రెండవ ప్రోలరాజును వోడించుటయే గాక వధించిరి. తన తండ్రి మరణమునకు కారణభూతులైన వెలనాటిచోళులను అణచుటకు రుద్రదేవుడు ప్రత్యక్షముగనైనను లేదా పరోక్షముగనైనను ప్రయత్నించియుండవచ్చును.[12]

రుద్రదేవుని వెలనాటి దండయాత్రను గురించి శ్రీమాన్ నేలటూరి వెంకటరమణయ్యగారు మరియు శ్రీమాన్ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ఇట్లు వ్రాసిరి:[14]

"Though no mention of the conquest of the maritime tracts or of the chiefs holding sway over them is made in his Hanumakonda inscription, there

is good reason to believe that he invaded Vengi sometime before A D. 1162, the date of that inscription for it is stated in the record that Rudra's Kingdom extended in the east at that time as far as sea ......... It appears certain that Rudra led an expedition to the Godavari delta and succeeded in imposing his authority over it. An inscription in the same place (Draksharama) set up by Repalli Duggaraja (Durgaraja), so called after the name of his fief, son of Anumakonda Prola-nripati (Prola II), obviously one of Rudradeva's younger brothers whom he had apparently placed incharge of the conquered territory, clearly shows that Rudra managed to keep his hold on it for a period of four or five years after its conquest until A. D. 1163."

చరిత్ర పరిశోధనలో నిష్ణాతులైన వారిచే ప్రతిపాదింపబడిన పై యభిప్రాయమునిచ్చుట విపులముగ పరిశీలింపవలసిన యవసరము ఏంతేనివున్నది.

శ్రీమాన్ వెంకటరమణయ్యగారు, శ్రీమాన్ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, వారి వాదమునకు బలమునిచ్చుటకై ద్రాక్షారామమునందు కనుపించినది, రుద్రునికాలమునాటివియైన మూడు శాసనములను సాక్ష్యముగ జూపిరి. మనము మొదట ద్రాక్షారామమునందు దొరికిన కాకతీయశాసనములను పరిశీలింతము. ఇందుతో మొదటిది క్రీ.శ. 1158వ సంవత్సరమున కాకతీయ రుద్రదేవుని ప్రెగ్గడ ఇనుగల బ్రహ్మిరెడ్డి వేయించిన దానశాసనము.[13] రెండవది క్రీ.శ. 1163 నాటిదగు శాసనము. దీనిని రేపల్లి దుగ్గరాజుల యర్ధాంగి లక్ష్మియైన బొప్పాదేవి వేయించిన దానశాసనము.[14] చివరిది, మూడవది రుద్రదేవుని భార్యయైన ధన్నమదేవి క్రీ. శ. 1168 – 69లో వేయించిన దానశాసనము.[15] పైన పేర్కొన్న ఏ వొక్క శాసనమునందుకూడ రుద్రదేవుని దండయాత్రనుగురించి ప్రశంసలేదు. బహుశ పై మూడు కాకతీయ శాసనములు ద్రాక్షారామమునందు కనుపించుటయే, రుద్రదేవుని దండయాత్రకు నాధారమని పై నుదహరించిన చరిత్రకారులు భావించియుండవచ్చును. దీనికొక గట్టి యాక్షేపణము గలదు. ద్రాక్షారామము పంచారామాలలో నొకటియేగాక, ఆంధ్రులకు నత్యంత ప్రీతిపాత్రమైన పుణ్యక్షేత్రము. రాజులు, రాణులు, సామంతులు, సేనానులు, వారి ఇతర పరిచారకులు పుణ్యక్షేత్రముల సందర్శించి దానశాసనములు వేయించుట సర్వసామాన్యమైన విషయము. చోళ చక్రవర్తియగు మూడవరాజేంద్రుని శాసనమొకటి క్రీ. శ. 1260–61నాటిది త్రిపురాంతకమున కలదు.[16] ద్రాక్షారామమువలె నిదియొక పుణ్యక్షేత్రము. ఇచ్చట పలు రాజవంశములకు చెందిన చక్రవర్తుల, వారి సామంతుల శాసనములు నూటికి పైగాగలవు. అట్టితరి పై శాసనము నాధారముగ తీసుకొని, క్రీ.శ. 1260–61 లో త్రిపురాంతక ప్రాంతముపై చోళుల యధికారమున్నదని వాదించుట అనృతము· కళింగ చక్రవర్తియైన అనంతవర్మ చోడగంగు రాణియైన జయనకొండ చోడి వేయించిన దానశాసనమొకటి క్రీ.శ.1128నాటిది ద్రాక్షారామమందుగలదు.[17] ఈ శాసనమునందు వేంగి చక్రవర్తి ప్రశంసలేదు. ఈ శాసనమును గురించి డి. సి. సర్కారుగారు ఇట్లు వ్రాసిరి:[18]

"If one reads only this inscription of the locality, it may be concluded that the Draksharama region formed a part of the empire of the said Ganga monarch. But we have several inscriptions at the same place bearing exactly the same date equating the year with the 2nd or 3rd regnal year of Vishnu-vardhana."

చౌహాను వంశజుడగు జాజల్లదేవుని రాణియైన జాఖదేవి భూదాన శాసనము జంబుకేశ్వరములో దొరికినది.[19] గహద్వాల భూదాన శాసన మొకటి గంగైకొండ చోళపురము నందున్నది.[20] చౌహాను మరియు గహద్వాల శాసనములు జంబుకేశ్వరము, గంగైకొండ చోళపురములందు కనుపించినప్పటికి వారి యాధిపత్యమా ప్రాంతములపై నెలకొల్పబడెనని చెప్పజాలము. దీనికి కారణము పై నుదహరించిన ప్రాంతములు పుణ్యక్షేత్రములు కాబట్టి. అటులనే పుణ్యక్షేత్రమైన ద్రాక్షారామమునందుదొరికిన కాకతీయ శాసనముల నాధారముగ జేసుకొని రుద్రదేవుడు వేంగి మండలమును ఆక్రమించెనని చెప్పుట అసమంజసము.

ద్రాక్షారామములోని కాకతీయ శాసనములు సాధారణముగ పేర్కొను శక సంవత్సరములోనేగాక, చాళుక్య చోళ చక్రవర్తియైన రెండవ రాజరాజు విజయ రాజ్య సంవత్సరములలో కూడ నుండుట విశేషాంశముగ నున్నది. ఈ విషయమై శ్రీమాన్ నేలటూరి వెంకట రమణయ్యగారు, శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగార్లు ఇట్లు అభిప్రాయపడిరి:[21]

"Rudra probably entered into an alliance with Rajaraja II, and having obtained the Godavari delta as a fief from him, invaded the country with the object of avenging the previous defeat and death of his father at the hands of Haihayas of Kona and the Suryavamsis of Malaya and of reducing these clans to subjection." ఈ అభిప్రాయము కూడా సమంజసమైనది కాదని తోచుచున్నది. కోనమండలమునేలు హైహేయులు, మలయ దేశము నేలు సూర్యవంశ క్షత్రియులు వెలనాటి చోళులకు సామంతులు. వెలనాటి చోళులు చాళుక్య–చోళ చక్రవర్తియైన రెండవ రాజరాజునకు సామంతులు.[22] అట్టితరి రెండవ రాజరాజు తన సామంత మాండలీకులైన హైహేయ, మలయ వంశజులపై దాడి చేయుటకు కాకతీయ రుద్రదేవునకు సహాయము చేసెనను వాదము అనృతము, అసమంజసము. అటులైన రాజరాజు విజయ రాజ్య సంవత్సరములు కాకతీయ శాసనము లందు పేర్కొనుటకు గల

కారణమేమి? బహుశ కాకతీయులు చాళుక్య చోళ యాధిపత్యమును వేంగిపై గుర్తించినందువలన వారిశాసనములందు రాజరాజు విజయ రాజ్య సంవత్సరములు పేర్కొనబడి యుండవచ్చును, లేదా అవి యాత్రికుల దాన శాసనములైనను కావచ్చును. కాబట్టి పై చర్చ వలన ద్రాక్షారామమునందు కనుపించు కాకతీయ శాసనములను యాధారముగ తీసుకొని రుద్రదేవుడు వేంగిపై దండయాత్ర చేసి, విజయలక్ష్మిని వరించి, ఆ ప్రాంతముపై తన యాధిపత్యమును నెలకొల్పెనను వాదము సత్యదూరమని తెలియుచున్నది.

క్రీ. శ. 1163 నాటిదగు హనుమకొండ శాసనము రుద్రదేవుని రాజ్య విస్తీర్ణమును గురించి ఈ క్రింది విధముగ చెప్పుచున్నది : [23]

> ''రాజ్యం ప్రాజ్యం లవణ జలధేస్తీర పర్యంతమస్య శ్రీశైలాంతాం ప్రచరితి సదా దక్షిణాశాం సమగ్రాం।
> ప్రాతీచ్యాంన్తా కటక వికట స్థాయినీ రాజ్యలక్ష్మీః కౌబేర్యా శాతట విలసితే మాల్యవంత ప్రదేశే॥''

ఈ శ్లోకము వలన రుద్రుని సామ్రాజ్యము తూర్పున సముద్ర తీరము వరకు, దక్షిణమున శ్రీశైల పర్వతము వరకు, పశ్చిమమున మాల్యవంతము వరకు వ్యాపించినదని తెలియుచున్నది. కాకతీయ సామ్రాజ్యము తూర్పున సముద్ర తీర ప్రాంతము వరకు వ్యాపించి వున్నదని పై నుదహరించిన హనుమకొండ శాసనమున నున్న విషయమును సాక్ష్యముగ గ్రహించి శ్రీమాన్ నెలటూరి వెంకటరమణయ్య,శ్రీమల్లంపల్లి సోమశేఖర శర్మగారలు రుద్రదేవుడు వెలనాడును జయించెనని యూహించిరి. ఈయూహ సరియైనదిగాదు. చాళుక్య చోళచక్రవర్తియైన రెండవ రాజరాజుయొక్క యధికారము వేంగి రాజ్యము పై సుస్థిరముగ నున్నట్లు ఆధారములు గలవు. ఆచార్య నీలకంఠశాస్త్రిగారు రెండవ రాజరాజుయొక్క సామ్రాజ్య విస్తీర్ణమును గురించి ఈ క్రింది విధముగా వ్రాసిరి :[24]

**"The extent of the empire under Rajaraja's rule is borne out by the provenance of his inscriptions. In the Telugu country Rajaraja's suzerainty is clearly attested by a fair number of stone inscriptions found throughout the Vengi country up to Draksharama, though it is clear that feudatory chiefs of Velanandu were becoming more and more independent and over - bearing."**

వెలనాటి చోళ రాజైన కుళోత్తుంగ రాజేంద్ర చోడ లేక రెండవ చోడుడు క్రీ. శ. 1163 సంవత్సరమునందు గోదావరీ మండలమును పాలించుచుండెను. [25] ఇతని బాపట్ల మరియు నందూరిశాసనములవలన ఇతనిరాజ్యము ఉత్తరమున కళింగ నగరము వరకు,దక్షిణమున కాళహస్తి వరకు, పశ్చిమమున శ్రీశైలము వరకు, తూర్పున సముద్రమువరకు వ్యాపించివుండెనని స్పష్టముగ తెలియుచున్నది.[26] రెండవ చోడుడు, చాళుక్య చోళ చక్రవర్తులైన రెండవ రాజరాజునకు, మరియు రెండవ రాజాధి రాజునకు సామంతుడు.[27] కాబట్టి కళింగనగరము, కాళహస్తి, శ్రీశైలము మరియు తూర్పు సముద్రతీర ప్రాంతముల మధ్యనున్న భూభాగము చాళుక్య చోళ చక్రవర్తుల యధీనమందున్నట్లు విశదమగుచున్నది. దీనినిబట్టి హనుమకొండ శాసనమునందు పేర్కొన్న రుద్రుని సామ్రాజ్య విస్తీర్ణము సత్యదూరము. బహుశ పై శాసనకర్తయైన అచింతేంద్రుడు తన ప్రభువగు రుద్రదేవుని సామ్రాజ్య వైశాల్యమును నుత్ప్రేక్షించి యుండును. అందువలన పై నుదహరించిన చరిత్రకారులచేత ప్రతిపాదించబడిన యూహ సరియైనది కాదని నొక్కి వక్కాణించవచ్చును.

కర్నూలు జిల్లా, మార్కాపూరు తాలూకా, త్రిపురాంతకము నందు క్రీ. శ. 1189 నాటి రుద్రదేవుని శాసనమొకటిగలదు. [28] శ్రీమత్ కుమారగిరి త్రిపురాంతక దేవర అంగరంగ భోగాలకు కృష్ణవేణీ నదీ తీరమందు మరియు కొండపల్లి నాంటిలోని రేవూరను చతుస్సీమమును ధారా పూర్వకముగ సకలాయ సహితముగాను దానమిచ్చినట్లు పై శాసనమునందు పేర్కొనియున్నది. దీని నాధరముగ తీసుకొని శ్రీమాన్ మారేమండ రామారావుగారు ఈక్రింది విధముగ వ్రాసిరి :[29]

**"Rudradeva conquered both these places (Sri sailam and Tripurantakam) from the contemporary Velanandu ruler Gonka II (A.D.1132 – 1163) by A.D. 1162."** ఈ యభిప్రాయము సరియైనది కాదు. పై శాసనము వలన రుద్రునియొక్క యధికారము కొండపల్లినాడుపై యుండెనని తెలియుచున్నది కాని త్రిపురాంతకము శ్రీశైల ప్రాంతములమీద కాదు. ఎందులకన రుద్రదేవుడు కొండపల్లినాడులోనున్న రేవూరును దానమిచ్చినాడు గనుక. చాళుక్య చోళ చక్రవర్తుల సామంతులుగ వెలనాటి చోళుల యధికారము కర్నూలు జిల్లాలో సుస్థిరముగనున్నది. అదియుగాక వెలనాటి చోళులు రెండవ గొంకరాజు కాలమునందు కాకతి రెండవ ప్రోలరాజును వోడించుటయేగాక వధించిరి కూడ. పైగా త్రిపురాంతకము ఆంధ్రులకు పుణ్యక్షేత్రము. కాన అచ్చట కనుపించిన శాసనములు ఎక్కువగ యాత్రికులైన రాజులు, వారి సామంతులచేత వేయించినవి. పై కారణములవలన శ్రీమాన్ మారేమండ రామారావుగారిచేత ప్రతిపాదించబడిన వాదము సత్యదూరమని చెప్పవచ్చును.

శ్రీమాన్ నెలటూరి వెంకటరమణయ్యగారు, శ్రీమాన్ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు రుద్రదేవుడు వెలనాడును ఆక్రమించిన తరువాత తన సోదరుడైన రేపల్లి దుగ్గరాజును తత్ ప్రాంతమునకు పాలకునిగ నియమించినట్లుయభిప్రాయపడిరి. ఇదియు పొసగని వాదమే. ఎందులకన 'రేపల్లి' దుగ్గరాజను వ్యక్తి రుద్రుని సోదరులలో నొకడుగ ఏ కాకతీయ శాసనమునందు ప్రశంసింపబడలేదు. అదియుగాక ద్రాక్షారామ శాసనమునందు పేర్కొనబడిన దుగ్గరాజు కాకతీయుడైన అతనిని 'రేపల్లి దుగ్గరాజు' అని ఎందులకు సంబోధించబడెను ?

పై చర్చవలన తెలియునదేమన కాకతీయ రుద్రదేవుడు, పై నుదహరించిన చరిత్రకారులు భావించినట్లు, వెలనాటి చోళులపై దండయాత్రచేసి వారిని వోడించి వేంగిమండలమును ఆక్రమించలేదు. కానీ తన తండ్రి మరణమునకు కారణభూతులైన వెలనాటి చోళులపై ప్రతీకారము తీసుకొనుటకు పలుమారులు ప్రయత్నించినట్లు శాసనాధారములు గలవు. ఈ ప్రయత్నములో విఫలుడైనట్లు కూడా సాక్ష్యములున్నవి

క్రీ. శ. 1173–74లో చాళుక్య చోళ చక్రవర్తియైన రెండవరాజరాజు మరణించెను. ఈ సంఘటన అటు దక్షిణ హిందూ దేశ ఇటు ఆంధ్రదేశ రాజకీయములలో సంచలనమును కలిగించెను. అధికారమును కైవశము చేసుకొనుటకై సామంత మాండలికులు ప్రయత్నము చేయసాగిరి. వేంగి మండలమును పాలించుచున్న వెలనాటి చోళ కుళోత్తుంగ రాజేంద్ర చోడుడు (రెండవ చోడుడు) చాళుక్యచోళ అధికారమును ధిక్కరించసాగెను. ఇతడు వేయించిన శాసనములందు రెండవ రాజాధిరాజు మరియు మూడవ కుళోత్తుంగుని విజయ రాజ్యసంవత్సరములు కానరావు. శ్రీమతి యశోదాదేవిగారు ఈ విషయమై ఇట్లు ప్రస్తావించిరి :[30]

**This sudden elimination of Chola emperors and their regnal years in Velanandu records — after A. D. 1173 or 1174 till A. D. 1180, the last regnal year of Choda–was due perhaps to the assumption by Choda of an attitude that no regular or formal recognition of Chola authority was necessary after the renewal of the confirmation of his Kingdom by Rajaraja in A. D. 1169 and the lack of interest in the affairs of Vengi in the reigns of Rajadhiraja and Kulottunga III"**

రెండవచోడుని పరిపాలనా ప్రారంభము శాంతియుతముగ సాగినను, అంతి కాలములోనే తాను సామంతుల తిరుగుబాటులను అంతర్యుద్ధములను ఎదుర్కొనవలసివచ్చెను. క్రీ. శ. 1163–64లో కోనమండలములో (అమలాపురము, రాజోలి ప్రాంతముల) అంతర్యుద్ధము ప్రారంభమైనట్లున్నది. హైహేయవంశజులు కోన మండలమును పాలించుచుండిరి. లోకభూపాలుడు, మూడవభీముడు, వల్లభుడు, మన్నిదేవుడు వెలనాటిచోళ రెండవ చోడునికి సమకాలికులు. కోన హైహేయలోక భూపాలుడు వేంగిమండలముపై దండయాత్ర చేసెను. ఈ యధికార ధిక్కరణను సహించలేని రెండవ చోడుడు క్రీ శ. 1163–64లో తన సేనానియైన దేవని ప్రెగ్గడను లోకభూపాలునిపైకి పంపెను. ఈ యుద్ధములో లోకభూపాలుడు వోడిపోయెను. ఈ సంఘటన క్రీ. శ 1163–64లో జరిగెను.[31] సుమారు పది సంవత్సరముల తరువాత, అనగా క్రీ. శ. 1174–75లో, వేంగి మండలముపై మరలా లోకభూపాలుడు దండయాత్ర చేయ ప్రయత్నించెను. రెండవచోడుని పెదమక్కిన శాసనమువలన వెలనాటి చోళుల సేనానియైన ప్రోలయ నాయకుడు కోనలోక భూపాలుని తుంగభద్రానదీతీరమున వోడించినట్లు తెలియుచున్నది.[31a] పైన పేర్కొన్న సమాచారమునుబట్టి కోన హైహేయ రాజైన లోకభూపాలుడు రెండుమార్లు వెలనాటి చోళులపై తిరుగుబాటుచేసి వోడిపోయినట్లు విశదమగుచున్నది. లోకభూపాలుడొక సామాన్య సామంతుడు. అట్టితరి బలవంతుడైన రెండవ చోడునిపై దండయాత్ర స్వయముగ చేసివుండడు. కాకతీయ రుద్రదేవుడు కోనలోక భూపాలుని తిరుగుబాటు చేయమని ప్రోత్సాహమును మరియు తగు సహాయమును పంపియుండవచ్చును. కానీ ఈ ప్రయత్నములో రుద్రదేవుడు విఫలుడాయెను. ఎందులకన తనచేత ప్రోత్సాహించబడి తిరుగుబాటుచేసిన లోకభూపాలుడు వెలనాటి చోళరాజు చేతిలో వోడిపోయెను.

క్రీ. శ. 1163 నాటిదగు నొక ద్రాక్షారామ శాసనము నందు వెలనాటి రెండవ చోడరాజు త్రికళింగాధిపై విజయమును సాధించినట్లున్నది.[32] మంచన 'కేయూరబాహుచరిత్ర'వలన రెండవ చోడుడు కటక (కళింగ) సామంతులను వోడించినట్లు తెలియుచున్నది.[33] అదియుగాక కొలను మాండలికులకు వెలనాటి చోళులకు మధ్య యుద్ధము జరిగినట్లు శాసనాధారములు గలవు. క్రీ.శ. 1165–75 నాటివగు రెండు సిరిపురము శాసనములందు రెండవ చోడుడు కొలను భీమదేవుని వోడించుటయేగాక వధించినట్లుకూడా పేర్కొనుచున్నవి.[4] తెలుగు చోళులకు వెలనాటి చోళులకు మధ్య స్నేహము పొసగినట్లులేదు: ఇవానికంద్రవాడి పాలకుడు, పండ ప్రభువు కుమారుడైన కంత ప్రభువు నొకసిద్ధిపై విజయమును సంపాదించెను ఈ సిద్ధి, తెలుగు చోళవంశజుడు (క్రీ.శ.1175-92) మొదటి దాయభీమునికి మామ, బెట్టరాజునకు అన్న. ఇవానికంద్రవాడి కంత ప్రభువు వెలనాటి రెండవ చోడునికి సామంతుడు. బహుశ తెలుగుచోళులు వెలనాటిచోళుల యధికారమును తిరస్కరించి యుండవచ్చును. వారిని అణచుటకై రెండవచోడుడు తన సామంతుడైన కంత ప్రభువును పంపియుండవచ్చును.[35] పై విషయ పరిశీలనమువలన, రెండవ చోడుని పరిపాలనా కాలము నందు వేంగి మండలముపై కళింగ గాంగ సామంతులు, కొలను మాండలికులు, తెలుగు చోళులు దండయాత్రలు చేసినట్లు స్పష్టమగుచున్నది. వీరందరు సామంతులు. బలవంతులుకారు. బహుశ రుద్రదేవుడు తన తండ్రి వధకు కారణభూతులైన వెలనాటి చోళులపై ప్రతీకారమును తీసుకొనుటకు పరోక్షముగ పై నుదహరించిన సామంతులతో చేతులు కలిపియైనను వుండవచ్చును లేదా సహాయమునైనను చేసివుండవచ్చును. ఈ ప్రయత్నములో కూడా రుద్రుడు పరాజితుడాయెను.

క్రీ. శ. 1176 మొదలు క్రీ. శ. 1182 వరకు పల్నాటి సీమలో యుద్ధము జరిగెను. పల్నాటిసీమలో అన్నదమ్ములైన నలగామరాజు, మల్దేవరాజు మున్నగువారి మధ్య రాజ్యముకొరకై వైషమ్యములు ప్రబలి అది యుద్ధముగా మారెను. ఈ యుద్ధమునందు అనేక సామంత మాండలికులు, రాజులు ఇరుపక్షముల చేరిరి. కాకతి రుద్రదేవుడు నలగామునికి సహాయముగ కొంత సైన్యమును పంపినట్లు

శ్రీనాథుని 'పల్నాటి వీర చరిత్రము' వలన తెలియుచున్నది. పల్నాడు ప్రాంతములో జరిగిన అంతర్యుద్ధము, పైన నుదహరించిన కోన హైహేయుల, కొలను మాండలికుల, తెలుగు చోళుల, కళింగ గాంగ సామంతుల తిరుగుబాట్లు వేంగి మండలములోని శాంతియుత వాతావరణమునకు గొడ్డలి పెట్టాయెను. ఈ రాజకీయ అశాంతిని అనరముగ తీసుకొని బేట విజయాదిత్యుని వంశజుడైన మూడవ విజయాదిత్యుడు ప్రోలునాడును (పిఠాపురము, కాకినాడ తాలూకాలు) ఆక్రమించి స్వతంత్రతను ప్రకటించుకొనెను.[36] విజయాదిత్యుని యధికారమును, వేంగి మరియు నిడదవోలు చాళుక్య వంశములకు చెందిన, మల్లపరాజు, మొదటి గొంకరాజు గుర్తించిరి.[37] మొదటి గొంకరాజు వెలనాడులోని షట్ సహస్ర ప్రాంతమును ఆక్రమించి నట్లుకూడా శాసనాధారములు గలవు.[38] ఇట్టి పరిస్థితులలో వెలనాటి చోళప్రభువైన మూడవ గొంకరాజు (క్రీ. శ. 1181–1186) మూడవ విజయాదిత్యునిపై దండయాత్ర చేసెను. విజయాదిత్యుడు వెలనాటి చోళ ప్రభువు ధాటికి తట్టుకొనలేక కాకతీయ రుద్రదేవుని సహాయమును కోరి యుండవచ్చును. వెలనాటి చోళులపై విజయమును సాధింప విశ్వప్రయత్నము చేయుచున్న రుద్రుడు విజయాదిత్యునికి సహాయము చేసినట్లున్నది. కాకతీయులు చాళుక్యులకు సహాయము చేసినట్లు ఋజువుచేయు రుద్రదేవుని శాసనమొకటి క్రీ. శ. 1185–86 నాటిది ద్రాక్షారామమునందు దొరికినది.[39] ఈ కాకతీయ శాసనము సర్వలోకాశ్రయ విష్ణువర్ధన మహారాజు పదిహేనవ విజయరాజ్య సంవత్సరములో వేయించినది. మూడవ విజయాదిత్యునికి 'విష్ణువర్ధనుడను' బిరుదము గలదు. ఈయుద్ధ విశేషము లెవ్వియు తెలియరావు. కానివెలనాటి చోళరాజైన మూడవ గొంకడు విజయమును సాధించినట్లున్నది. క్రీ. శ. 1185 నాటి శాసనములను బట్టి వెలనాటి చోళులు, ప్రోలునాడును ఆక్రమించి నట్లు స్పష్టముగ తెలియుచున్నది.[40] ఈ ప్రయత్నములో కూడా రుద్రుడు విఫలుడాయెను.

పై చర్చ వలన, కాకతీయ రుద్రదేవుడు తనతండ్రిని వధించిన వెలనాటి చోళులపై ప్రతీకారము తీసుకొనుటకు విశ్వప్రయత్నము చేసెను. తనకు సమకాలులైన రెండవ చోడుడు, మూడవ గొంకరాజు కాలమునందు వేంగి మండలమున తిరుగుబాటు చేసిన కోన హైహేయులకు కొలను మాండలికులకు, కళింగ గాంగ సామంతులకు, తెలుగు చోళులకు, బేట విజయాదిత్య చాళుక్య వంశజులకు సహాయముచేసెను. వెలనాటి చోళులు, తిరుగుబాట్లను సక్రమముగ అణచి, వేంగి మండలముపై వారి యధికారమునకు ఎటువంటి నష్టము లేకుండా కాపాడుకొనిరి. వేంగి మండలమును, కాకతీయులు గణపతి దేవ మహారాజు కాలములో నాక్రమించినట్లు గణపేశ్వరము, దుగ్గిరాల, చందవోలు శాసనముల వలన తెలియుచున్నది.

# అధోజ్ఞాపికలు

1 దక్షిణ హిందూ దేశ శాసనములు, సంపుటి. IV, సంఖ్య 1107.
2 కె. అప్పన్నశాస్త్రి; వేయిస్తంభాలగుడి శాసనము, పుట 4.
3 ద. హి. శా. సంపుటి, IV, సంఖ్య. 1182; JAHRS; XVIII, Page. 42; AR, 1917, part II, para. 26.
4 JAHRS; XVIII, pp. 72 ff.
5 ద. హి. శా. సంపుటి, IV, సంఖ్య. 1280; Epi. Ind; IV, No. 4.
6 JAHRS; XVIII, p. 80; ద. హి. శా, సంపుటి IV, సంఖ్య. 1164.
7 అదే చూడుము.
8 అదే చూడుము.
9 అదే చూడుము.
10 ద. హి. శా. సంపుటి. IV, సంఖ్య. 1242.
11 Epi Ind. IV, p. 91.
11 a AR., Cp No. 10 of 1916–17.
12 G. Yazdani; The Early History of the Deccan (London. 1960), p. 592.
13 ద. హి. శా. సంపుటి, IV, సంఖ్య. 1107.
14 అదే, సంఖ్య. 1071.
15 అదే, సంఖ్య. 1095.
16 Epi, Ind, XXXI, p. 101; AR, 201 of 1905
17 Epi. Ind, XXXI, pp 101; ద. హి. శా, సంపుటి. IV, సంఖ్య. 1194.
18 అదే చూడుము.
19 ద. హి. శా, సంపుటి. IV, సంఖ్య. 428.
20 Epi Ind, XXXI, pp. 101 ff.
21 G. Yazdani, page 591
22 JAHRS, XIX, pp. 9 ff.
23 HAS, No 13. p 15, V. 48
24 K. A. N. Sastry, The Cholas, p. 352.
25 AR, 229, 233, 238, 256 of 1893
26 ద. హి. శా. సంపుటి. సంఖ్యలు 181, 1205, Epi. Ind, XXIX, pp. 225; JAHRS; XVIII; pp. 85ff.

27 JAHRS, XVIII, p 90; AR, 238, 256 of 1893; 299 of 1936 – 37.

28 ద. హి. శా, సంపుటి. X, సంఖ్య. 241.

29 JAHRS, VI, p. 28

30 JAHRS, XVIII, p. 91.

31 అదే చూడుము, పుట. 99.

31 A AR; 329 of 1932 – 33.

32 ద. హి. శా, సంపుటి. IV, సంఖ్య. 1113.

33 JAHRS, XVIII, p. 95.

34 AR, 334 of 1932 – 33; 490 of 1909.

35 JAHRS, XX, p. 137; AR, 303 of 1924.

36 అదే చూడుము, pp. 151 ff; AR, 352, 363, 433, 440-A, 479, 486 of 1893.

37 JAHRS, XXI, p. 69.

38 అదే చూడుము.

39 ద. హి. శా, సంపుటి. IV, సంఖ్య. 1155.

40 ద. హి. శా, సంపుటి. IV, సంఖ్య 1100; X, సంఖ్య. 211, AR, 247 of 1897, 97 of 1909; G. Yazdani, p. 595; JAHRS, XVIII, pp 105 ff.

# తీరాలను దాటుకుంటూ...,

## శ్రీ రామచంద్ర మౌళి

కళ్ళు...కళ్ళు...కళ్ళు
కళ్ళలో సముద్రాలు ఘోషిస్తున్నాయి
చేతిలో డిగ్రీలతో,
తలనిండా శూన్యంతో
యువతరం ఉప్పెనలా గర్జిస్తోంది కల్లోలంలో —
పక్షులు విడిచిపెట్టిపోయిన యీ ఆకాశం
బొమ్మలేని పటంలా వ్రేలాడుతోంది —
అక్కడేమో భవనాలు స్పాంజ్ మనుషులను కౌగలించుకుని
రాత్రులకు రాత్రులను చెరిచేస్తున్నాయి
కార్ల టైర్లను భరించి భరించి అలసిపోయిన యీ రోడ్లు
ఎముకల పాదాల ముద్రలను చూచి అసహ్యంతో [illegible]డుచుకు పోతున్నాయి
ప్రజాస్వామ్యం తెస్తున్నాం...అని ఎవ్వడో అంటించిపోయిన పోస్టర్
చిరిగి ఉచ్చల కుండీలో నవ్వుకోంది —
ఎండిపోయి నిలబడ్డ చెట్లనే
కళాస్వరూపాలుగా చిత్రించుకుని ఆరాధించుకోమంటున్నారు
ఉడిగిపోయిన స్తనాన్ని చీకమంటున్నట్లు —

గుండెలపై గుర్రాలు పరుగెత్తుతూంటే
గుండే, గుర్రం దాని పుట్టుపూర్వోత్తరాల గురించి కమిటీ వేసేవాళ్ళు
కాగితపు పడవలపై గిరికీలు కొడుతున్నారు ఒడ్డుదగ్గరే—
అటువేపు
ఓటున్న ప్రతివాడు ఇక ఓ బూటుమకూడా సంపాదించు కుంటున్నాడు
పిచ్చివాని చేతిలో వజ్రం = రాయి
రాళ్ళలోనుంచి
ఆలోచనలు చిమ్ముకొస్తున్నాయి ప్రభ జనాలై
యీ రాతి పాదాలు రోడ్లను జయించిననాడు
ఆకాశం మేఘాల చేతులతో చప్పట్లు కొడుతుంది గర్జిస్తూ
పక్షి ఒంటరిదైనా
రెక్కలతో దిక్కులను పాలిస్తూ ఎగిరిపోతుంది తీరాలను దాటుకుంటూ
ఆ దృశ్యాన్ని నా కన్నుల్లో దాచుకుని
గుండెలతో నిద్రపోతా.

# ఆధునిక కవిత్వంపై
# నారాయణబాబు అభిప్రాయాలు

ఆధునికాంధ్ర కవిత్వంలో అభ్యుదయ కవితా మహోదయానికి మూలపురుషులు ఇద్దరు. ఒకడు శ్రీ శ్రీ; రెండోవాడు నారాయణబాబు. శ్రీశ్రీ, నారాయణబాబులు జంటకవులు కాకపోయినా ఈ యుగసాహిత్యంలో వారి పేర్లు జంటగానే కనబడతాయి; వినబడతాయి. ఈ ఇద్దరూ ఒకేలక్ష్యంతో కవితా ప్రస్థానం చేసినా మార్గాలు భిన్నమయినవి. మాత్రా ఛందస్సులు, వచన గేయం వీరిద్దరి కవితా ప్రక్రియలైనప్పటికీ కవితావిర్భూతిలో వీరిద్దరికీ భేదం చాలా ఉంది. ఇది కవిత్వ శిల్పానికి సంబంధించినది. ప్రస్తుత వ్యాసం నారాయణబాబుకి ఆధునిక కవిత్వంపైగల అభిప్రాయాలను గూర్చి చర్చించడం. వ్యక్తి నిష్ఠమైన ఆధునిక కవితాలక్షణం సామాజిక నిష్ఠం కావడం శ్రీ శ్రీ నారాయణబాబులతోనే ప్రారంభమయింది. సమకాలీనులంతా ఆధునికులు కారు అన్నది యధార్థం. ఆధునిక కవిత్వమంతా సామాజిక స్పృహను కలిగి ఉన్నది అనేమాట యధార్థం కాదు. నారాయణబాబు ఆధునికులలో ఆధునికుడు. కవిత్వ దృక్పథంపై తన పూర్వం వరకూ ఉన్న అభిప్రాయాలను త్రోసిరాజని కవిత్వాన్ని ప్రజాపరం చెయ్యడానికి ముందుకురికినవారి వరుసలో ప్రథముడు నారాయణబాబు. ఆధునిక కవిత్వంయొక్క పరమోద్దేశాన్ని అతను సంఘర్షణకు రాసిన ప్రవరలోను, రుధిర జ్యోతిలోని కొన్ని కావ్యఖండికలలోనూ స్పష్టం చేశాదు.

> ''ఈ ప్రపంచ జీవన వైతరణి
> దాటేందుకు
> నీకోసం నే చేసిన
> గోదానం నా గీతం''

అంటాడు. ఈ పాదాల్లో ఉన్న ధ్వని అభ్యుదయ కవిత్వానికి మకుటాయమానమైన లక్షణం. మృతుడైనవాని ఆత్మ వైతరణిని దాటేందుకు కర్మచేసేటప్పుడు గోదానం చెయ్యడం సంప్రదాయం. ఈ సంప్రదాయ ప్రతీకల్లో ఆధునిక జీవితాన్ని ధ్వనింపచెయ్యడం నారాయణబాబు ప్రత్యేకత. వర్తమాన సమాజం అంతా వైతరణిలాగా ఉన్నదనే అర్థం ఈ ప్రపంచ జీవన వైతరణి అనే మాటల్లో ధ్వనింపబడింది. అస్తవ్యస్తమయిన ఈ సమాజం వ్యవస్థీకృతం కావడానికి కవిత్వం నిబద్ధం కావాలనే అభిప్రాయం చివరి పాదాల్లో ధ్వన్యమానమవుతున్నది. సమకాలీన సమాజం, దాని స్థితిగతులే సత్కవితా వస్తువులని సారాంశం.

> ''ఖ్యాతి గడించే
> గీతం వ్రాసి
> ప్రేయసి కంకిత
> మీయాలంటూ
> మూతి బిగించి
> చేతులు నులుముతు
> కూచున్నావ''

అంటూ కవిని హెచ్చరించే ఈ పాదాల్లో కవిత్వంలో రావలసిన తిరుగుబాటు సూచితమవుతున్నది. అభ్యుదయ కవితాగమనానికి పూర్వం ప్రాచీన కవిత్వంపై వచ్చిన తిరుగుబాటు భావకవిత్వం. భావ కవిత్వానికి కాలం చెల్లిపోయినదని, కవిత్వం సమాజంచేత ప్రేరేపింపబడి సమాజాన్ని జాగృతం చెయ్యవలసిన సమయం ఆసన్నమయినదని కవికి తన బాధ్యతను గుర్తుచేస్తూ రాసిన పాదాలివి. ''అంతవరకూ భావకవులతోబాటు మేము కూడా జీవిత గ్రీష్మాన్ని దర్శించేందుకు మనోనేత్రానికి తగిలించిన గాగుల్స్ నేల విసిరి కొడుదుంగదా! హృదయంలో పొగలు సెగలురేగి వీధి కాలవ నీటిలో బురదలో ఆపసోపాలు పడిపోతున్న విశ్వనాధుడు. ఊరిబయట పొలంలో ఇన కిరణాల క్రౌర్యంతో కాయక్లేశపడుతున్న సేద్యగాని శరీరంమీద పండిస్తున్న ఘర్మ మౌక్తికాలతో ఒక తాజ్‌మహల్ కట్టాలని బుద్ధి పుట్టింది. మా కవిత్వంలో ఉండకూడని వస్తువు వాడకూడని భాష లేదు. చాకలాడు, సంతబయలు, కుక్క, గాడిద, కుళ్ళుకాలువ, ఫ్యాక్టరీ, మర ఫిరంగి...అవేమిటి ఇవేమిటి లోకంలో ఉన్నవన్నీ; పలాయనత్వం పనికిరాదు; నల్లమందు నిషా పనికిరాదు'' అంటూ తన కాలానికి కావలసిన కవితా సంరంభాన్ని సూచ్యం చేశాడు నారాయణబాబు. భావకవులు తీసుకువచ్చింది కవిత్వంలో తిరుగుబాటే అయినా ఆ తిరుగుబాటుకు సమాజంతో గాని, దానిలో ఉన్న మంచి చెడులతోగాని సామాన్యుని జీవితంతో గాని పొత్తులేదు. అది కేవలం వ్యక్తిపరమైన తిరుగుబాటు; అది కోరేది వ్యక్తి స్వేచ్ఛ; వ్యక్తి యొక్క విశృంఖల ప్రవృత్తి మాత్రమే. ఆ ప్రభావంలో కొంతకాలం ఉన్నా, తత్ప్రభావంలోంచి బయటపడి కవిత్వంలో ఆశించే స్వేచ్ఛ సర్వమానవ స్వేచ్ఛ కావాలని, తిరుగుబాటు సమాజపరమైన

తిరుగుబాటు కావాలని, సమాజంలోని చెడును తొలగించి దానిస్థానే మంచిని ప్రతిష్ఠించాలని నారాయణబాబు ఆదిగా గల కవులు వాంఛించారు. నారాయణబాబు కాలం నాటికి 'నిబద్ధత' అనేది ఈనాడున్నంత తీవ్రంగాలేదు. అయినా నారాయణబాబును గురించి చెప్పేటప్పుడు అతను ఆనాటికీ, ఈనాటికీ అభ్యుదయ దృక్పథం గల నిబద్ధకవి అనే చెప్పాలి. ఇప్పటికీ ఎప్పటికీ జాతి పురోగమ నానికి సాంఘిక చైతన్యం వాంఛనీయమని ఏకైక మానవ కుటుం బంగా వర్థిల్లి ఈ కాశ్యపిని భూతల స్వర్గం చేసుకుందామని కవికీ, సామాన్య మానవునికీ కూడా ఏకైక లక్ష్యం'' అని నారాయణ బాబు కవికి సాధారణ మానవునికి సమాజగతమైన ఆశయాల్లో అభేదం చెబుతాడు. ప్రాచీన కవులు, ఇప్పటి కవులు విశ్వశ్రేయస్సును కాంక్షించిన వారేకాని మార్గాల్లోమాత్రమే భేదం. ఆనాడు వారు విశ్వసించిన సమాజం వేరు. ఈనాడు వీరు అభిలషించిన సమాజం వేరు. గిడచిపోయిన సంప్రదాయ సమాజానికి గడుస్తున్న ఆధునిక సమాజానికి జీవిత విధానంలో, వ్యవస్థాగత నియమాల్లో పోలికలేదు. గడచినకాలం గడుస్తున్నకాలంతో రాజీ పడదు; ఓటమిని అంగీక రించదు. తిరోగమన వాదులకు, పురోగమన వాదులకు సంఘర్షణ తప్పదు. సాహిత్యాది కళలు ఈ సంఘర్షణలో పురోగామి దృక్పథాన్ని కలిగి ఉండాలేగాని పలాయనవాదాన్ని సమర్థించకూడదనేది నారా యణబాబు కవిత్వంలో ధ్వనిస్తున్న యధార్థం.

''మహాశక్తినై
మారణ మంత్రం పారణచేస్తూ
చివురించిన ఈ జనాళియుద్ధం
జైత్ర రథమ్మెగ
కజ్జల కాళిగజ్జల గుణ్ణిం
కాలభుజంగం
కళ్ళెం లాగి
'ఛలో! ఛలో' యని
సాగిపోయెదను''

అంటూ కదన కుతూహల రాగంలో రాబోయే ప్రజాపోరాటాలను, ఆ పోరాటాలకు అండగా నిలచే కవిత్వ దృక్పథాన్ని ధ్వనింపచేశాడు నారాయణబాబు.

''పాతాళమ్మున
పతితులు పలవించే
మాటల
జిలిబిలి తేటల
చీకటిగుండె కదల్చి
జాలిపాట పాడమంది
లోపలికే చూడమంది''

అనే ఈ పాదాల్లో నారాయణబాబు కవిత్వ ధ్యేయాన్ని చెబు తున్నాడు. ఆధునిక కవిత్వం పీడిత మానవునికి అండగా నిలబడా లనీ, పీడించే వర్గాన్ని రూపుమాపడానికి అనుగుణమైన మార్గాన్ని అన్వేషించడానికి ఆధునిక కవిత్వం అంతర్ముఖం కావాలని స్పష్టం చేస్తున్నాయి ఈ పాదాలు. లోపలికే చూడమనడంలో సమాజంలో ఒకవర్గం పడే బాధలు, ఆ బాధలకు గల కారణాలు, ఆ బాధలను తొలగించేటందుకు గల అవకాశాల అన్వేషణ ధ్వనిస్తోంది.

''మర ఫిరంగినై
మహతిగ మీటి
కదన కుతూహల రాగం
వినిపిస్తాను
అగ్గిని కురిపిస్తాను''

అనే పాదాల్లో నారాయణబాబు యొక్క కవితాపరమైన నిబద్ధత తీవ్రంగా వ్యంజితం చేయబడింది. సమాజం సవ్యంగా ఉన్నప్పుడు వీణారవం మానసికానందాన్ని కలుగ చేస్తుంది. సమాజం బీభత్స మైన స్థితిలో నున్నపుడు వినిపించే వీణారవం బీభత్స రస ప్రధానం గానే ఉంటుంది. వీణారవాన్ని ఇక్కడ సంకేతంగా తీసుకుంటే కళా స్వరూపాలన్నీ సర్వ మానవ సంక్షేమంతో కూడిన సమాజ వ్యవస్థ యొక్క అస్తిత్వ నిర్మాణానికి పునాది రాళ్ళుగా మారాలనేది నారా యణ బాబు దృఢవిశ్వాసంగా ఈ పాదాలు ఋజువు చేస్తున్నాయి.

'ఈనాడు కవిత అభ్యుదయ పథాల నంటి మానవజాతి పురోగమనంకోసం ఒక మహనీయ పథాన్ని పట్టింది. ఇది మానవ జాతి అంతటికీ ముక్తినిస్తుంది'' అనే విశ్వాసంతో నారాయణబాబు కవిత్వం రాశాడు. కవిత్వం గాని, సాహిత్యాది ఇతర కళలుగాని వాటంతటవిగా సమాజంలో విప్లవాలను, తిరుగుబాట్లను లేవదీయ లేకపోయినా సమాజంలో ఒక భావ విప్లవం సాధించడానికి మహోప కరణాలుగా యావత్తు సాహిత్యకారులు భావించడం యధార్థం. రేపు రాబోయే సామాజిక విప్లవానికి ఈనాటి కవిత్వం పునాది కావాలి. అదే పురోగమన మార్గం. ఆ మార్గంలో పయనించిన అభ్యుదయ కవి నారాయణబాబు. నారాయణబాబు నిన్నటి ఈనాటి కవికాదు; మానవాభ్యుదయంకోసం తన కలాన్ని కత్తిగా ఝుళిపించిన ప్రగతివాద కవి; అతను ఎప్పటికీ కవే.



# జంటపదాలు: ఒకపరిశీలన

మన భాషలో జంటపదాలు అనేకంగా వున్నాయి. ఇవి కొన్ని ద్వంద్వ సమాసాలు. ఇల్లు వాకిలి, కట్టు బొట్టు, తోడు నీడ, పని పాట, ఒడ్డు పొడుగు, చదువు సాము మొ. ఇవి శుద్ధంగా ద్వంద్వ సమాసాలు అనబడటంకంటె జంటపదాలు అనటం సమంజసం. ఈ పదాలు సాధారణంగా వ్యస్తంగాకంటె సమస్తంగా ప్రయోగించబడటం విశేషం. తెలుగువాళ్ళు వీటిని జంటపదాలుగానే వాడతారు.

ఈ జంటపదాలలో కొన్ని, రెండోపదం **కూడా** మొదటి పదంయొక్క అర్థాన్నే యిస్తూ **మొదటి** పదానికి **వత్తా**సుగా **అంటే ఊత**గా నిలబడుతుంది. సిగ్గు సెరము, నిలువు నిదాణం, ముసిలి ముతక, బిడ్డ పాప, కరువు కాటకం, వాన వంగిడి, వేరు వెల్లంకి **మొ.** యీ తెగకు చెందుతాయి. వీటిని **ఊత**పదాలు అనటం వాడుక. ఇవి కూడా జంటపదాలలో **భాగమే.** అందువల్లనే జంటపదాలను ద్వంద్వ సమాసాలనుంచి వేరుచేసి చెప్పడం సమంజస మంటున్నది.

పరస్పర సన్నిహిత సంబంధం కలవి (ఇల్లు వాకిలి) జంట పదాలైతే, సమానార్థక పదాలు ఊతపదా **లవుతున్నాయి.** ఇవికాక ''మొదలైనవి etcetera, తత్సంబంధమైనవి and all'' అనే తాత్పర్యంలో వచ్చే జంటపదాలు కొన్ని వున్నాయి. పురుగు బుట్ర, ఏండ్లు **పూండ్లు**, నగ నట్ర, **కూర** నార, బూతు బొందు, పెట్టె బేడ, వైద్యం నాద్యం మొ. యీ తెగకు చెందుతాయి **వీటినిగూడా** **ఊత**పదాలనే అనటం బాగుంటుంది.

ఈ జంట పదాలలోనే మరికొన్ని పరస్పర విరుద్ధమైనవి **గూడా** **వున్నాయి** పెళ్లి పెడాకులు, **హీ**నం మానం, నీళ్లు నిప్పులు, ఇహం పరం, మంచి చెబ్బర, **తలా తో**క, అన్నెం పున్నెం మొ. యీ రకానికి **వస్తాయి.**

జంట పదాలలో **ఊత**పదాల క్రింద రాగిచెంబు, గాజుగ్లాసు, పేపరు కాగితం వంటివి సమానార్థకాలే అయినా యిప్పటి వాటి వాడుక, అభిప్రాయం వేరుగా వుంటున్నందున వాటిని యిక్కడ **ఊత**పదాల క్రింద చేర్చడం కుదరదు.

జంటపదాలలో ముఖ్యంగా రెండోపదంయొక్క అర్థం కాలక్రమంలోమరుగున పడిపోతున్నది. వాటి సహజ స్వరూపం తెలియక, వ్యుత్పత్తి బోధపడక, అర్థసామ్యం గుర్తురాక **ఊత**పదాలు చాలా భాగం వ్యర్థంగా వుపయోగించబడుతున్నట్టు మనకు అనిపిస్తున్నది. నిదానంగా ఆలోచించి చూస్తే వాటికీ అర్థం వుందనీ, అవీ ఒక ప్రయోజనాన్ని ఉద్దేశించి చేర్చబడ్డాయనీ తేల్చుకోగలుగుతాము.

ఇక్కడ కొన్ని జంటపదాల స్వరూప స్వభావాల్ని నేను గుర్తించగలిగినమట్టుకు మనవి చేద్దామని మనసుపడ్డాను. **భాషా**భిజ్ఞులు మన్నించి తగుసూచనలు సెలవిస్తారని అభ్యర్థిస్తున్నాను.

కొన్ని పదాలు అక్షరక్రమంలో చర్చిస్తూ జంటపదాలను (జం), **ఊత**పదాలను (ఊ), వ్యతిరేకార్థకాలను (వ్య), అక్కడి కక్కడే సూచిస్తాను. **ఊత**పదాలు సమానార్థకాలని (ఊ. స.), తత్సంబంధార్థకాలని (ఊ. త.), రెండు రకాలనుకున్నందువల్ల ఆ విభాగం **కూడ** చూపడం బాగుంటుం దనుకున్నాను.

ఇక్కడ చెప్పిన అంశాలు కొన్ని సందర్భవశాత్తు ఇంతకు పూర్వం స్వల్పంగా స్పృశించి వున్నసంగతి నా వ్యాసాలు **కటాక్షిం**చినవారు గమనించేవుంటారు. అస్పష్టమైన అటువంటి పునరుక్తుల్ని విజ్ఞులు క్షమించగలరు.

జంటపదాలు చాలావరకు వ్యస్తంగానే ప్రయోగించబడుతున్నాయి. మాటా-మంతీ, నగా-న**ట్రా** మొ. వీటిలో నిత్యైకవచనంగా వాడబడేవి అధికమే. సమస్తంచేసి బహువచనాంతాలుగా **గూడ** వాడబడుతున్నాయి. చెట్టు చేమలు, పైరు పచ్చలు మొ. వ్యస్త ప్రయోగాల్లో రెండూ బహువచనాంతాలు కావడం **కూడా** కద్దు. ఏండ్లు పూండ్లు, బిడ్డలు పాపలు, నీళ్లు నిప్పులు, ముద్దులు ముచ్చట్లు, చిలవలు పలవలు, ఆస్తులు పాస్తులు మొ.

''ఎఱుకలు గట్టుకొన్న మతి యేండ్లను బూండ్లను బట్టు'' అని పెద్దన ప్రయోగం. ''పురుగుండును బుట్రయుండు'' అన్నది ధూర్జటి శ్రీకాళహస్తిమాహాత్మ్య ప్రయోగం. ఇది మరీ విశిష్ట ప్రయోగం. ఈ జంట పదాన్ని **పూర్తి**గా విడగొట్టాడు.

నింద్యార్థంలో రెండో పదాదిలో గి గీలు రావడం రావణుడు గీవణుడు, పున్నెం గిన్నెం వంటివి ఇక్కడ సందర్భపడే సంగతికాదు. గిగీలతోనే ప్రారంభమయ్యే పదాలకు నింద్యార్థం**లో** ఏమి **వస్తాయి?** గిన్నె, గీత **మొ** వాటికి నింద్యార్థంలో వాటినే ఆమ్రేడితం చెయ్యాల్సి వుంటుంది.

ఒక్కొక్కప్పుడు—'బొచ్చె గిచ్చె తెచ్చుకోండి' అన్నప్పుడు—నింద్యార్థకం కాక జంటపదాల సారూప్యమే సందర్భపడుతున్నట్టు కూడా తోస్తుంది. 'బొచ్చె బోలె తెచ్చుకోండి' అన్న అర్థప్రతీతి లోనే పై వాక్యం **గూడా** వాడబడ్డట్టు గమనించవచ్చు.

## కొన్ని పదాల చర్చ

**ఈ** క్రింద అక్షరక్రమంలో మచ్చుకు ఇచ్చిన కొన్ని జంట పదాల్లో సాధారణంగా మొదటి పదానికి వివరణ అక్కర్లేదు. రెండవ పదానికి సూక్ష్మవివరణ సూచించబడుతున్నది.

# సంకేతాలు

జం = జంట పదాలు.

ఊ = ఊత పదాలు.  ఊ. స. = సమానార్థక ఊత పదాలు.
ఊ. త. = తత్సంబంధార్థక ఊతపదాలు

వ్య = వ్యతిరేకార్థకాలు

1 అంగడి—సంగడి. (ఊ. త.) సంగడి అంటే స్నేహం. అంగడిన్నీ స్నేహమున్నూ పరస్పర సంబంధమున్న సంగతులు.

2 అంగు—సంగు. (జం.) అంగు = హంగు. చక్కదనమన్న మాట. సంగు = సంగము. అంటే ఒకదాని కొకటి సరిపడే టటువంటి కూర్పు.

3 అంటు—సంటు. (ఊ. త.) అంటరాని వస్తువు, తత్సంబంధము. 'అంటు—ముట్టు' అని కూడా వాడుక. ఇక్కడ ఇది సమానార్థక ఊతపదం. కూడిక — స్నేహము అని అభిప్రాయం. లేదా అంటరానిది ముట్టరానిది అనిన్నీ.

4 అందం — చందం. (ఊ. స.) చందం=అలంకరణ విధానం.

5 అగ్గి—బుగ్గి (జం.) బుగ్గి=బూడిద.

6 అచ్చట—ముచ్చట. (జం.) అలంకారం—దానిపై కోరిక.

7 అచ్చుగ—పచ్చుగ [ఉండు]. (జం.) అచ్చుగ = ముక్తసరిగ, ముచ్చటగ, సమతూకపు కూర్పుతో అని తాత్పర్యం. (పచ్చుగ= కలకల లాడుతు.)

8 అతుకు—బొతుకు. (ఊ. త.) బొత్త=ప్రాతలచిల్లి. అతుకు అనే మాటతో చేరి బొత్త, బొతుకు అయింది.

9 అదును—పదును. (జం.) అదను = సరైన సమయం. పదను = దున్నుటకు అనువుగా చెమ్మ యెక్కిన స్థితి. "అదన్నా పదన్నా చెడిశిందిగదరా యేపనాగేలి" అని పొలం కాపుల సామెత.

10 అయిన పొయిన. (జం.) అయిన=సంబంధించిన. పొయిన= మరణించిన. మరణించిన వాళ్లు (విరోధులైనా) మంచివాళ్లే, వైరుధ్యం సమసిపోతుంది. అట్లా వాళ్ళా సంబంధీకులే. లేక మరణించిన పెద్దలైన బంధువులు, తత్సంబంధీకులు అని భావం. "అయినోళ్లు పొయినోళ్లు ఆ వీధి నుండంగ— కానోళ్ల బట్టుకొని కన్నీళ్లు బెట్టుకొను" అని వ్యవహారం. (ఇదొక గేయ పంక్తి లేక సామెత.) పోయినోళ్లందరూ మంచోళ్లు—అని సినిమా పాట

11 అరి—గురి. (ఊ త.) అరి = శత్రువు. గురి = శత్రువుమీద లక్ష్యం (గురి) పెట్టడం. "నీది అరీ—గురీ లేని పద్ధతి" అంటాము.

12 అరువు—తెరువు. (జం.) అరువు = న్యాయం (అరవం.) తెరువు=మార్గం. "పనిచేస్తే అరువూ తెరువూ వుండాల."

13 అలుపు—సొలుపు. (జం.) సొలుపు = సొలపు — బడలిక. "పనిలో దిగితే అలుపూ సొలుపూ ఎరగడు." (సలుపు అని కూడా. నొప్పి అని అర్థం.) ఆడుతు పాడుతు పనిచేస్తుంటే అలుపు సొలుపే మున్నది—సినిమా పాట.

14 అల్లరి—చిల్లరి. (జం.) చిల్లరి = చిలిపి (పనులు). చిల్లర అంటే పెద్ద మొత్తానికి చిల్లర (తుంట, ముక్క, విడి భాగం)గా పైకం తీసుకోవడం తెలిసిందే. చిల్లరి పనులు, చిల్లర మాటలు, చిలిపి చేష్టలు, తుంటరి వంటి అభిప్రాయాలు. "అల్లరి చిల్లరిగా తిరగవద్దు."

15 అల్లి—బొల్లి. (జం.) అల్లి=ఒక (పిల్లల) ఆట. ఆటల ధోరణిగా బొల్లి = అబద్ధం చెప్పడమన్నమాట. అల్లినట్టు బొల్లిమాటలు చెప్పడంకూడా కావచ్చు. 'కల్ల—బొల్లి' అని కూడా వ్యవహారం. అప్పుడది ఊతపదం, సమానార్థకం.

16 అస్తు—బిస్తు. (ఊ. త.) అసదు = అస్తు, అల్పము. బిస్తు = బిస్త, దుర్గతి (బ్రౌ.ని.) "వాడి పరిస్థితి అస్తో బిస్తో అన్నట్టుంది."

17 ఆకు—అలుము. (ఊ. స.) అలము=శాక విశేషము. (ఆకు, పువ్వు, కాయ మొ. అలములు దుంపలు నములుచు—శ. ర.) "ఆకూ అలమూమేసి కూడబెట్టాడు" అంటాము. అలము—కాయ అనుకొన్నప్పుడు ఇది జంటపదం అవుతుంది.

18 ఆయాకు—పాయాకు. (ఊ. త.) పాయలాకు, చెంచలాకు, గురుగాకు మొ. కొన్ని ఆకుల పేర్లు. పాయాకు = జీర్ణకారి అయిన ఒక ఆకుకూర. ఆయాకు=ఏదో ఒక రకమైన ఆకు—అని అర్థం. 'ఆయలాకు—పాయలాకు'అని కూడా వాడుక. "ఆయాకు పాయాకు దిని సరిపెట్టుకున్నాను." అని వ్యవహారం.

19 ఆర్చు—తీర్చు. (జం.) బాధతొలగించుట, న్యాయం తీర్చుట. "ఆర్చేవా తీర్చేవా నా ఊసు నీకెందుకు ?" అంటాము.

20 ఆలన—పాలన. (జం.) ఆలన = శ్రద్ధ.

21 ఆస్తి—పాస్తి. (ఊ. త.) స్థిరమైన ఆస్తి, చరమైన (గొడ్డు గోద మొ.) ఆస్తి అని అర్థం. (ఆస్తి సంస్కృత శబ్దమని ఆస్తిపాస్తి అంటే goods and chattels అని బ్రౌ. ని., దేశ్య శబ్దమని శ. ర.) "ఆస్తి—ఉపాస్తి" అనే జంట నుంచి యిట్లా వాడుక పడినట్టు ఊహిస్తే అప్పుడిది జంట పదమవుతుంది. ఉపాస్తి = సేవ. (దైవోపాసన లేక ఉద్యోగము వంటిదని అర్థ విపరిణామం.)

22 ఇచ్చు—రొచ్చు (వ్య.) ఇచ్చు=విచ్చు, వికాసము, అతి సంతోషము, రొచ్చు=రొంపి, రొబ్బి, సంకటము. "ఇచ్చు రొచ్చు

ఈగల తాళింపు'' అని నానుడి. ఇచ్చు రొచ్చు అవుతుంది, ఈగల తాలింపు పెట్టుకొనే టువంటి **హీ**నస్థితి ప్రాప్తిస్తుంది అని అభిప్రాయం.

23 ఇరం—పరం. (జం.) ఇహము-పర**ము**నుంచి వచ్చి వుండవచ్చు. లేక ఇరుగు—పొరుగు ఇట్లా భ్రష్టమై వుండవచ్చు. ''వీడి కీ **వూళ్లో** ఇరం పరం లేదు, సిగ్గుమాలినోడు.''

24 ఇరుగు—పొరుగు. (జం.) ఇరుగు=ప్రక్కయిల్లు. పొరుగు=సమీపము, నాతి దూరము. (పొరుగూరు, పొరు**గూ**రినుంచి వచ్చాను అం**టా**ము.) ప్రక్కవాళ్లు, సమీపస్థులు అని అభిప్రాయము. **On** both sides అని బ్రౌ. ని. (అక్కం—పక్కం వీట్టు అని తమిళుల వ్యవహారం.) [అక్కంపేట అంటే సమీప గ్రామమని వ్యుత్పత్తి కావచ్చు.]

25 ఇల్లు—వాకిలి. (ఊ.త.) ఇల్లు తత్సంబంధమైన వాకిలి మొ.

26 ఈడు—జోడు. (జం.) వయస్సుకు సంబంధించిన సమానత్వము, ఒడ్డు పొడుగులకు సంబంధించిన సమానత్వము. ''ఈడు గానిదే యింటికి రాదు, జో**డు**గానిదే దొడికి రాదు''అని వ్యస్తంగా గూడ వాడుక. [జ — ర లకు యతి సమంజసమే.]

27 ఉడుకు-మెడుకు (ఊ.స.) ఉడుక మిడుకను to **grieve,** పరితపించు అని బ్రౌ. ని. మిడుకు—మెడుకు అని వాడుకైంది. ఎక్కువ ఉడుకు పదార్థమని తాత్పర్యం. ''ఆవురావురని ఉడుకు మెడుకు అట్లనే తిన్నాడు.''

28 ఉరుకు — పరుగు. (జం.) ''ఉరుకులు పరుగులుమీద వచ్చాడు.'', ''వాడి తొందర ఉరుకులు పరుగులుగాఉన్నది.''

29 ఉలుకు—పలుకు. (జం.) ఉలుకు=కదులుట. ''ఉలుకు పలుకు లేకుండా ఉన్నాడు.'' ''ఉలకడు పలకడు.''

30 ఊపర—దాపర. (జం.)ఊబ=నపుంసకుడు. దావరీడు=దొంగ వీటినుంచి వచ్చిన వాడుక. ''వా డొట్టి ఊపర్దాపరోడు.''

31 ఎక్కిడి—తొక్కిడి. (జం.) ఎక్కుడు=శ్రమకరమైన ఎత్తు దారి వంటిది; త్రొక్కుడు=జన సమ్మర్దముచేత ఇరుకైనటువంటిది. ఆ సందర్భంలో వాడేమాట, ''ప్యాసెంజరు బండిలో ప్రయాణం ఎక్కిడి తొక్కిడి గద?''

32 ఎక్కా ముక్కా. (ఊ. త.) ఎట్లం**టే** అట్ల—అని అర్థం. ''ఎక్కా ముక్కా తిన్నాడు.'' ఎక్కువగా **ము**క్కులవరకు

అని అభిప్రాయం. ''ఆ పని ఎక్కా ముక్కా చేసిపెట్టాడు'' ఎగుడు దిగుడుగా చేశాడని అర్థం. (ఈ అర్థంలో ''వక్కలా ముక్కలా'' అనేమాట వాడుతాము.)

33 ఎడ్డి—మడ్డి. (ఊ. స.) ఎడ్డె=బుద్ధిహీనత.

34 ఏండ్లు-పూండ్లు. (ఊ. స.) పూఁడులు రూ. పూండ్లు= అనేకములు (సంవత్సరముల). [బ్రౌ. ని., శ. ర.]

35 ఐసా—పైసా. (జం.) అటో యిటో తేల్చివేయడం అని భావం. ఐసలా పైసలా అని కూడా వాడుక. పైసలా అంటే పరిష్కారము. అసలు (మొదలు) పైసలు చెయ్యడమన్న మాట అది యిట్లా పరిణామం చెందినది.

36 ఒడ్డు—పొడుగు. (జం.) ఒడ్డు=స్థూలము, అడ్డపాటు, లావు. ''మనిషి ఒడ్డు పొడుగు బాగుంటుంది.''

37 కుండ—చట్టి/కుదురు. (జం./ఊ. త.) ''కుండ చట్టి కూడేసుకోవాల.'' ''కుండా లేదు కుదురూ లేదు, ఏం చెయ్యను?''

38 కొంప—గోడి / గోడు. (ఊ. త.) గోణి అంటే ఎద్దు. గోణి గోడి అయింది. లేదా గొడ్డు గోడు (లోప దీర్ఘత) అయి వుండవచ్చు. ఇల్లు వాకిలి మాదిరి. ''ఈ వూళ్లో నాకే మన్నా కొంపా గోడా ?'' (ఉన్నదా ? అని భావం.)

39 కట్టె—కంప. (జం.) కంప కూడ పెద్ద పొయ్యిలలోకి కట్టెలకి మారు వాడటం కద్దు. (చాకిపొయ్యి—ఉదాహరణ.)

40 కత్తి—కటారు. (ఊ. స.) కటారి=కత్తి లేక పెద్ద బాకు.

41 కథ—కమామీషు. (ఊ. త.) ప్రధాన విషయం తత్సంబంధ వివరం అని అర్థం. కమామీషు (హిం.) = సంఘటనలు, సందర్భాలు, వివరాలు.

42 కయ్యా—కాలవ. (ఊ. స.) క్రయ్య=కయ్య, కాలువ. (జం.) కయ్య=మడి; కాలవ=కాలువ, నీటి పారుదల. ఇది మొదట సమానార్థక ఊత పదం; తర్వాత జంట పదమైంది. ''కయ్యా గాలవ కొనుక్కొని ఇక్కడే స్థిరపడ్డాను.

43 కలి—గంజి (ఊ. స.) కలి = (తమిళం) అంబలి. గంజి = అన్నం కూడా కలిసిన వార్పు నీరు (liquid diet). (ఊ.త.) కలి = బియ్యం కడిగిన పులిసిననీరు. గంజి = అన్నం వార్చిన నీరు. (ఈ అర్థంలో ఈ పదం తమిళంలోను వాడుక, ''కంజికి లొట్టి, కయ్యిలె బ్యాట్టి.'' కలో గంజో పోసి సాకాను అన్నది మన వాడుక. కలి తేటకలి, చిక్కని కలి, కంచారు మొ. వాడుకలు.

44 కల్లి—బొల్లి. (ఊ. స.) బొల్లి ఒక చర్మరోగం. బొల్లి నాలుక, బొల్లి పెదవులు, బొల్లి నోరు, బొల్లి చర్మం మొ. వాడుకలు. బొల్లి జబ్బు కలవాడు అబద్ధాలు చెప్తాడని సాముద్రికంగా చెప్పుకొంటారు. బొల్లితనము=**dishonour**, విస్సదనము అని బ్రౌ.ని. బొల్లు=అబద్ధమాడు, అబద్ధము —అని నిఘంటువు. (పొల్లు అంటే కూడా అబద్ధమే.)

45 కాయ—గరుబు/గసురు. (ఊ. త.) గరుబు= **Thick**, as a forest. (బ్రౌ. ని.) విరగగాచిన కాయలని అభిప్రాయం. (ఊ. స.) కసురు = లేత కాయ. (కసుఁగాయ కఱచి చూచిన ...)

46 కుమ్ము—దుమ్ము. (జం.) కుమ్ములాడుకోవడం, దుమ్మే రేగి గొట్టడం. 'వాళ్ళిద్దరి వ్యవహారం కుమ్ము దుమ్ముగా ఉన్నది'.

47 కూన--కురుజ. (ఊ.స.,ఊ.త.) కురుజు=చిన్నది; కొత్తది (తెలియనిది) (కురుచకు వాడుకలో రూపాంతరంగా గూడ భావించవచ్చు.) 'బిడ్డలంతా కూనా కురుజా.'

48 'కూర—నార. (ఊ. త.) నార=కూరమీద పీచు. (శ. ర.) [నారజెల్ల= a sort of fish. (బ్రౌ. ని.] 'కూర నార లేక కూడెట్ట దింటాము ?'

49 కూలి—నాలి. (జం.) నాలి = A mean **work**, కుత్సితపు పని. కూలి నాలి= cooly and other low and un-certain **kind** of work. బ్రౌ. ని., శ. ర.

50 కొయ్య—గొణత. (ఊ. త.) గొణత → గొడితి = A sort of tree (బ్రౌ. ని.) 'కొయ్యా గొణతా యేవీలేదు ఇంటి పని బెట్టుకున్నాను ఎట్టవద్దో ?'

51 కోతి—కొండముచ్చు. (ఊ. స) కొండముచ్చు=కొండల్లో తిరిగే నల్లమూతి కోతి. 'పిల్లేమి కోతా కొండముచ్చా కాదనటానికి ?'

52 గింజ—గిట్ట. (ఊ. త.) గిట్ట—నగనట్ట, పురుగు బుట్ట, మనిషి మ ట—మొ. చోట్ల ''మొదలైనవి, అటువంటివి, అవన్నీ'' అని అర్థం చెప్పుకోవలసి వున్నది.

53 గుంట—మిట్ట. (వ్య.) ఎత్తుపల్లాలు, ఎగుడు దిగుడులు. 'గుంటనక మిట్టనక మిట్టమధ్యాన్నం ఎందుకు పోవడం?'

54 గడ్డి—గాదం. (ఊ. స) గాదము = **k**not grass that infests a field of dry grain, పైరులోని కసవు. (బ్రౌ ని., శ. ర.)

55 గొడ్డు—గోద. (ఊ. స.) గోద=ఎద్దు.

56 చదువు – చట్టుబండలు/సంధ్య/పాములు. (వ్య /జం.) 'చదువు చట్టుబండలు లేకుండా అడ్డగాడిద దిరిగినట్టు తిరగ తుంటాడు.'

57 చీకు—చింత. (ఊ. స.) చీకు=నలత. (మా. చీకాకు - శ.ర.)

58 చీము—నెత్తురు. (జం.) నెత్తురు అభిమానానికి, చీము అవమానం లేక దురభిమానానికి గుర్తు. ఆ అర్థాల్లో, అట్టి సందర్భాల్లో వాడుక 'వాడొక మనిషా? చీము, నెత్తురు లేదు.'

59 చిలవలు—పలవలు. (జం.) చిలవ=నీరుకోడి. పలవ=చెట్టు పంగాలు. పరస్పర సంబంధం లేనిది కల్పించి జతపరచడం అని అభిప్రాయం. 'చిలవలు పలవలు కల్పించి చెప్పాడని వాడుక.

60 చిలుము—చ్ఛిద్రము. (జం.) చిలుము = తుప్పు, ఛిద్రము = తప్పు. 'చిలుము చిద్రం వదిలించుకున్నాను.'

61 చీన్—నార. (ఊ. త.) చీర అంటే వస్త్రం. దానికుపయోగించే నార (నారతో చేసిన చీర లుండేవి కద?) మొదలైనవని అభిప్రాయం.

62 చెంబు—తపెల. (జం.) తపెల, తపేలా=A brass vessel. (బ్రౌ. ని.) చెంబు=రాగి పాత్ర. (తప్పేల—తమిళం—వంట గిన్నె—శ. ర. అను.) ఇవి రెండూ తమిళ పదాలే. రాగి, యిత్తడి పాత్రలని అభిప్రాయం.

63 చెట్టు—చేమ(లు). (ఊ.త.) చేమ=A plant, ఆలుకము. చెట్టు చేమలు=trees and so forth గెనుసుగడ్డ, చేమగడ్డ. (చూ. బ్రౌ. ని, శ. ర.)

64 చెత్త—చెదారం. (ఊ. స.) చెదారము=తృణలేశము (శ.ర.)

65 చెదురు—మదురు. (ఊ. త.) చెదరు అంటే నీళ్లబొట్టు లోన గూడ నవి యెగిరిపడు అని శ. ర. సక్రుత్తు అన్న అర్థంలో వాడుతాము. తత్సంబంధార్థకమే మదురు కూడా అని సరిపెట్టుకోవాలి.

66 చెప్పు—చేరు. (జం.) చేరు=నరము, త్రాడు, గొలుసు (శ. ర.) 'చెప్పు జేరు ఏమీ వేసుకొని రాలేదా'?

67 డబ్బు దస్కం. (జం.) దస్కం=దస్కత్తు (చేవ్రాలు) పెట్టిన విలువైన కాగితం; లెక్కలు భద్రపరిచిన దస్త్రం కావచ్చు.

'డబ్బూ దస్కం బాగా వున్నవాడు.'

68 తట్ట—బుట్ట. (జం.) 'బుట్ట—తట్ట' అని కూడా అంటాము. 'తట్టా బుట్టా' సర్దుకో, మునివ్కడ గిట్టవు.

69 తప్పు-దార. (ఊ. స.) తప్పిపోవునట్లు, మరుగునపడునట్లు (చేయుట). 'ఏదో చేశాడు తప్పా దారా, కొంచెం సర్దుకో.'

70 తరక-తాలు (ఊ. స.) తఱక=గింజపట్టని ధాన్యము; తాలు = ఎన్ను తీసి ఎండిపోయిన పైరు. 'తరక తాలు నా మొహాన కొట్టి మెరికలు వాడెత్తుకున్నాడు.'

71 తల—తోక. (జం.) ఆద్యంతాలని అభిప్రాయం. 'నువ్వేం జేసినా తలా తోకా వుండదే!'

72 తళుకు-బెళుకు. (ఊ స.) తళుకు=మిక్కిలి ప్రకాశము; బెళుకు=తళతళమని ప్రకాశించు. 'తళుకు బెళుకులు రాలు తట్టేడేల?'

73 తాలు—తకరారు/తప్పర. (జం.) తాలు — సంబంధార్థంలో వాడుక. తకరారు=తగువు. 'వాడి కేమీ తాలూ తకరారూ లేరు.' తాలు తప్పర ఊ.స.—'తాలు తప్పర మిగిలుంటే వాడి మొహాన గొట్టు.

74 తీరు దినుసు. (ఊ. స.) దినుసు, దినుసు = ప్రకారము, విధము. దిణుసు అని కూడా వాడుక.

75 తుక్కు—దుమారం/బొక్కు. (ఊ.త.) బొక్కు→పొక్కు, పక్కు=ఎండి లేచిన పెల్ల.

76 తెలివి—తేట. (ఊ. త.) తేట అయిన (శుద్ధమైన, స్పష్టమైన) తెలివి అన్న అభిప్రాయంలో వాడుక. తెలివితేటలు—అని కూడా.

77 తెప్ప—తేరు (జం.) "దీపారాధన తప్ప తెప్పాలేదు, తేరూ లేదు."

78 తోడు—నీడ. (జం.) నీడ=ఆశ్రయం, ఆధారం.

79 దిక్కు—దివాణం/దెస/మొక్కు (జం./ఊ.స/ఊ. త.)
"దిక్కూ దివాణం లేని ఊరిది."
"నాకు దిక్కూ దెసా తోచడంలేదు."
"దిక్కూ మొక్కూ లేనివాడు" (యజమాని గాని, గౌరవం గాని లేనివాడని భావం.)

80 దిగులు—విచారం. (ఊ. స.) విచారానికి ఆలోచనార్థం చెప్పినప్పుడు తత్సంబంధార్థక ఊతపదం.

81 దేవుడు—దయ్యం. (ఊ. స.) దయ్యం దైవ శబ్దానికి వికృతి. పిశాచార్థం (దెయ్యం అంటాము)లో వ్యతిరేకార్థకం.

82 నగ—నట్ర. (ఊ. త.) చూ. గింజ గిట్ర

83 నయాసు—నాగరికత. (ఊ. స.) నయాసు=nice

84 నదురు—బెదురు. (ఊ. త.) నదురు=కంటిభయం.

85 నిప్పు-నిపాతకం. (జం.) నిపాతనం=దిగద్రొబ్బుట. అలివిగాని మనిషిని గురించి యిట్లా (జంటపదంగా) వాడుతాము. "ఈ వూళ్లో మనం వుండలేం నిప్పు నిపాతకం అయిన కొంప."

86 నిలుపు—ఆదరువు/నిదానం. (జం./ఊ. స.)

87 నీళ్లు—నిప్పులు. (జం./వ్య.) ''నీళ్లు నిప్పులు ఇంకా చూసు కోలా.''

88 నౌకరి—సౌకరి. (జం.) సౌకరి→చాకరి, చాకిరి=నీచమ్మైన కొలువు (హిందీ) నవకరి - సవకరి (రూపాంతరం)

89 నొప్పి—నోవి. (ఊ. స.) నొవ్వు. నొవ్వి, నోవి=నొప్పి. నోవి (తమిళం). నోయి అని కూడా వాడుక. 'నొప్పి నోవి' ఎరక్కుండా దాటుకున్నాడు పుణ్యాత్ముడు.'

90 నోరు—వాయి (ఊ. స.) వాయి=నోరు (తమిళం). 'నోరు వాయి లేనోడు పాపం.'

91 పండగ-పబ్బం. (ఊ. స.) పర్వ శబ్ద వికృతి పబ్బం, పండుగ అనే అర్థం.

92 పండూ—ఫలము. (ఊ. స.) ''పండూ ఫలం ఏదీ పుచ్చు కోడు.''

93 పని-పాట/పాటు. పని చెయ్యటమూ, చేస్తూ ఉత్సాహం కొద్దీ పాడటమూ జంట పదము. 'పని—బాట' అని తీసు కున్నప్పుడు బాటకు తీరు అని అర్థం (జంట పదము). పనిని పాటు (శ్రమ) పడి చెయ్యాలని గ్రహించినప్పుడు ఊ. త. అవుతుంది. పనిపాట్లు అని కూడా వాడుక.

94 పరువు—ప్రతిష్ఠ. (జం.) పేరు—ప్రతిష్ఠ అని కూడా (బహువచనాంతంగానూ వాడుక.)

విస్తరభీతిచేత యిక్కడ చాలిస్తున్నాను. నిఘంటురూపంలో తేవాలని అభిలాష వున్నది. మంది మార్బలం, ముండ్లు ముడక, మట్టి మశానం, మాను మాకు, రాయి రప్ప, రోగం రొష్టు, వాన వంగిడి, వావి వరస, వేరు వెల్లంకి, సేద్యం నాద్యం, మొ. అనేక పదాల చర్చ ప్రస్తుతం చేర్చకపోవడం వసతి చాలక. మన్నించ ప్రార్థన.

# మజిలీ

## 'మోహి'

ఇదెక్కడి పక్షి
ఇక్కడ వాలింది
ఏముందని, దేనికని ?

ఎర్రబడ్డ కపోలాల్ని చిగురుటాకులనుకొందా
గులాబీ పెదవుల్ని మధుర ఫలాలనుకొందా
ఏంతిందామని, ఎలావుందామని

గుంపును వదలి, గుట్టలుదాటి
ఇటు, ఎలా కొట్టుకొచ్చిందో !

ఆకుల్లేవు
పూ రేకుల్లేవు.

ఎటుచూచినా మేకుల కేకులు
కాకుల కేకలు

రాత్రి కురిసిన ముత్యాలమాల
హృదయ క్షతంలో పొదిగి
యిద్దామనుకున్నా ఉదయం.

గుడ్లగూబలో రాబందులో
అర్థరాత్రి ఆనందంకోసం
హృదయాన్ని చీరేసి
రుధిరంలో కలిపేసాయ్

యింకేముందని ? !
పంజరం లేదునిజమే
పట్టుపరుపూ లేదుకదా.

ఆకాశం అగ్నీ
అవనీ నీరు — ఇవే, ఇవే యిక్కడున్నవి.

ఆమని లేదు.
కువలయామినీలేదు.
అయినా వాలిందెందుకని ?

నేడాగి రేపుసాగే యానానికి నైట్‌హాల్టేమో !
అలసిన మనసుకి మజిలీ యిదేమో ! !



శ్రీ ఏ. వి. బి. రామారావు

# బుజువు

ఆటో శబ్దం విని కిటికీ దగ్గర కొచ్చింది వర్ధనమ్మ. ఆటోలోంచి దిగుతున్నది 'ఆయన' కాదు. దిగుతున్నది తన కూతురను కోవడం భ్రాంతి అని తెలిసినా పడుతున్న బాధ కంటె తియ్యనిదే ననుకుని వర్షించని మేఘంగా బరువుగా నిట్టూర్చింది.

ఎదురింటి మీనాక్షి తొలిచూలు పిల్ల రాధ. రాధ షెళ్ళి కంటె ఏడాది వెనకాల జరిగింది సుశీల పెళ్ళి. అయితేనేం, రాధ అదృష్టం ఎవరికొస్తుంది! దగ్గర ఊళ్ళో అత్తవారు అత్త వారిలో కలిసిపోయిన అల్లుడు. దూరం వాడన్న విచారం లేదు. తలలో నాలుకలా మెలుగుతున్న మనిషి.

వీధి తలుపు తీసి బయటికివస్తూ "ఏం, రాధా! కులాసా!" గారంగా పలకరించింది వర్ధనమ్మ.

"కులాసానే అత్తయ్యా, సుశీల బావుందా?"

"ఓహో! వాళ్ళకేం! బాగున్నారు. రాజాల్లా ఉన్నారు."

నవ్వులు పంచే స్వభావంతోపాటు నవ్వులే పంచాలన్న తాపత్రయం పుట్టుకతో వచ్చింది కాదు వర్ధనమ్మకి.

బావ వెళ్ళిపోతూ చెప్పాడు : "నవ్వులు పంచమని అందరూ చెబుతారు. నువ్వు నవ్వులే పంచు" అని.

నవ్వులే పంచడం, మనసులో మూలుగుతున్న బాధని గుండె ల్లోంచి బయటకు రానివ్వకుండా బిగపట్టుతూ ఉండడం వర్ధనమ్మకి దినచర్య అయిపోయింది.

బావ !

బావను తలచుకుంటే గుండె నిండా దిగులు. ఏదో వెర్రి భయం. ఇంత దూరంలో ఇంత కాలం తర్వాత భయపడడం వెర్రి తనమని తెలుసు. కాని అది తెలిసినంత మాత్రాన దానంతట అదే... ఆ భయం ... పోవడం లేదు. పోదనీ తెలుసు. లక్కపిడతలతో ఆడుకుంటున్నప్పటినించీ అత్తయ్య కోడలా అంటూ మురిసి పోయేది.

బావకు తను ఎందుకు దూరమైంది ?

'ఆయనే' కారణం !

గుమాస్తా కొడుక్కు ఛస్తే పిల్లనియ్యనని నాన్నగారి గొడవ. అమ్మకి నాన్నగారి స్వభావం బాగా తెలుసునన్న గర్వం.

తోబుట్టువుల అభిమానంతో కన్నకూతురు జీవితాంతం -ఆడిపోసుకునేలా చెయ్యనని నాన్నగారు తెగేసి చెప్పేస్తే, ఆ పాట ఎప్పుడూ పాడేదేననీ సమయం చూసి నచ్చచెప్పలేకపోతానా అను కుంది అమ్మ.

కోరి చేసుకుంటానంటూ వచ్చారు 'ఆయన'. పట్నంలో పెద్ద చదువు చదివి కాలేజీలో ఉద్యోగం చేస్తున్న మూర్తి...

ఆ రోజు ఒంటరిగా...

కథ అంత ముందుకుపోతుందనుకోలేదు. కథ పూర్తి అయితేనే కాని తను పోగొట్టుకున్న దేవిటో తెలిసిరాలేదు.

దొడ్డమ్మ కూతురు వనజాక్షికి పెళ్ళి. నాగవిల్లి జరుగు తోంది. రెండోఆట సినిమాకెళ్ళే హడావుడిలో ఉన్నారు, తెల్లవారి ఊళ్ళకు తిరిగి వెళ్ళవలసిన మగపెళ్ళివారు.

రాత్రి భోజనాల దగ్గర 'చక్రపటాకీలా తిరుగుతున్నాది, ఎవరా అమ్మాయి' అని ఎవరో అడుగుతున్నారు.

వెనక్కు తిరిగి చూడబోయి తమాయించుకుని మరోసారి వచ్చినపుడు అక్కడచూసింది. పెళ్ళికొడుకు స్నేహితుడు. పట్నం నుంచి వచ్చిన సినిమా హీరోలా ఉన్నాడు. ఎందుకో చూపులు తిప్పుకోలేకపోయింది.

ఇంతలో విడిది కెళ్ళాల్సి వచ్చింది. వరండాలో ఆ అబ్బాయి ఒంటరిగా తనను చూసి జడుపుచ్చుకుని...

బావకి అన్యాయం జరిగిపోయిందన్న విషయం ఏమిటో ఆ మైకంలో తెలియనేలేదు.

మావయ్య నవ్వు నవ్వేసి 'పోన్లేవో, పెళ్ళిళ్ళు చేసేవాళ్ళం మనమా ?' అనేశాడు.

తనను పెళ్ళికూతురు చేసున్న గదిలోకి వచ్చి బావ "వర్ధనం...నువ్వు అదృష్టవంతురాలివి. ఎమ్మేవే కావాలని నా కెప్పుడైనా చెవిలో చెప్పి ఉంటే నా బియ్యే పరీక్ష పోయేది కాదు సుమా!...గుడ్‌లక్! ఆల్ ది బెస్ట్. నవ్వులు పంచమని అందరూ చెబుతారు. నువ్వు నవ్వులే పంచు."

ఏమిటేమిటో అనేశాడు.

గతంలోకి చూసుకుంటున్న వర్ధనమ్మ కళ్ళు తుడుచు కుంటూ శాపం తగిలిన విస్సహాయురాలిలా జాలిగా మూలిగింది.

దూరంగా రైలుకూత! 'ఆయన' వస్తారేమో! ఎందుకైనా మంచిదని ఓ గ్లాసుడు బియ్యం కడిగి స్టౌమీద పడేసి స్టూలుమీద కూచుంది. గిన్నెకింద మంట నీలంగా హుందాగా మండుతోంది.

కనపడడానికి మందకొడిగా కనపడినా నీలిమంట ఎర్రమంట కంటె ఎంతవేడి. పదినిముషాల్లో స్టవ్ ఆర్పేసి తలుపు తాళంవేసి బయటపడింది.

—''కూచో వర్ధనమ్మా! చాలా రోజులకి వచ్చావ్...అన్న గారు...''

''ఆ చెల్లెలిగారింటి కెళితే మనం ఎక్కడ గుర్తుంటాం వదినా. పగలల్లా షికార్లూ, రాత్రంతా కబుర్లూ...అమ్మాయి కెన్నో నెల?''

''తొమ్మిది వచ్చేసింది. నాలుగో నెల వెళ్ళిన దగ్గరనుంచీ అడుగుతూ ఉంటే ఇప్పడికి పంపించారు. ఆడపిల్లలవాళ్ళం, వర్ధ నమ్మా మనకెలాగైనా కిందచెయ్యి తప్పదు. ముందునుంచి వెళ్ళి అడుగుతూ ఉంటే ఇప్పడేం తొందరలెద్దూరూ అన్నారు. ఆ తర వాత వియ్యంకుడి నడిగితే ఆవిడ నడగమనీ, ఆవిడ నడిగితే అల్లుడి నడగమనీ—తీరా అతగాడి నడిగితే 'ఇప్పటినుంచి ఎందుకండీ!' అన్నాడు. అమ్మాయి ఏం చెయ్యగలదు చెప్పండి. 'తొమ్మిదో నెల వచ్చాక వెళ్లమంటున్నారమ్మా' అంది అమ్మాయి. కళ్లనీళ్ళు తిప్పు కుంది వెర్రినాగమ్మ. తీరా తొమ్మిదో నెల వచ్చాక వెడితే, నిన్ననే డాక్టరుకు చూపించాను. మరో వారం రోజులుంచి నేను స్వయంగా తీసుకొస్తానని అల్లుడు. ఏమిటోనమ్మా విడ్డూరం, మనరోజుల్లో ఇవన్నీ ఎరుగుదుమా—వారం వారం డాక్టర్లు, తనిఖీలు—మందులూ, ఇంజక్షన్లూ...అది అటుంచి సూడిదలు ముచ్చట వీల్లేదన్నారు. 'ఎందుకండీ, లేనిపోని ఖర్చులు· ఆడపిల్లల తండ్రులూ, తల్లులూ అర్థంలేని ఆడంబరాలూ, ఖర్చులూ మానాలి' అంటూ అల్లుడు లెక్చరిచ్చి తనే·తీసుకొచ్చి దిగబెట్టి వెళ్లాడు ... వదినా ఈమధ్య సుశీల వస్తున్నట్టేలేదు. మీ ఆడబిడ్డా వాళ్ళూ కులాసా?''

సంపద గునుపుల సొదలోంచి హఠాత్తుగా గాలి ఇటు మారింది. వర్ధనమ్మ ''మేనరికం అని మురిసిపోయి చేశాను. పై సంబంధం చేసుకున్న రాధకేమైంది చెప్పు. ఎవరి అదృష్టం వాళ్లది'' అని నిట్టూర్చింది

వర్ధనమ్మ నిట్టూర్పులోని ఆంతర్యం మీనాక్షమ్మకీ, రాధకీ అంతుచిక్కలేదు.

''మావయ్యగారు వస్తున్నట్టున్నారు!'' రాధ స్వెట్టరుగళ్ల మీద నుంచి తల పైకెత్తి చూసి చెప్పింది. నేను సాయంకాలం వస్తా అత్తయ్యా! మావయ్యగారితో మాటాడి చాలారోజులైంది.''

''తప్పకుండా .రా తల్లీ నే వెళ్లి బజారునుంచి...అభిమానం అంటేనే తల్లీ, పిలవాలని వచ్చినదాన్ని నే పిలవకుండానే వస్తా నన్నావ్...ఆఁ వస్తున్నా!'' లేచి నుంచుంది వర్ధనమ్మ.

మూర్తి వర్ధనమ్మ తాళం తీసేవరకూ ఆటోలోనే కూచుని తీరికగా సూట్‌కేసూ, హోల్డాలూ దింపి లోపలకు పట్టుకొచ్చారు.

''వర్ధనం, రెండు చెంబులనీళ్లు ఆ స్టౌమీద పడేయ్. కాస్త తల కడుక్కుంటేకాని...''

''ఆఁ వదినా, వాళ్ళూ అంతా బావున్నారా!''

''ఓ యస్. అమ్మాయి నిన్ను తీసుకురాకుండా వెళ్లానని విసుక్కుంది. కాని ఇన్ని రోజులు వాళ్లింట్లో...''

''ఆనంద్...''

''ఆనందుకేం అఖండుడు! ప్రమోషన్ లిస్ట్‌లోకి వెళ్లా డట. ప్రమోషన్ రావడానికి ఆట్టే రోజులు పట్టదని ప్రశాంతి...''

అవును ఆడబడచు ప్రశాంతి చెప్పింది. మరి ఆ అల్లుడూ, మేనల్లుడూ అయిన ఆనందే చెప్పచ్చుగా...కాని చెప్పడు. మావ గారిని, వస్తే అత్తగారినీ, తప్పించుకు తిరుగుతాడు. అక్కడ ఆయన ఉన్న పదిరోజుల్లోనూ ఆనంద్‌కి మావయ్యతో మాటాడే సావకాశం కాలేదా!

—వర్ధనమ్మ విషయం సేకరించడం ఎలాగా అని ఆలో చిస్తూ మరోసారి ప్రారంభించింది.

''అమ్మాయిని బజారుకు తీసుకెళ్లారా?''

''ఆఁ. నేనూ, ప్రశాంతీ, సుశీలా ముగ్గురం వెళ్లాం. ఆనంద్ కారు పంపించాడు.'' వెర్రిబాగుల మనిషి—కారు పంపించా డని సంతోషమే కాని, అల్లుడు ఏమౌతున్నాడన్న ఆలోచనే లేదు. నీళ్లు కాగాయేమో చూడాలనుకున్న వర్ధనమ్మ వేలు చురుక్కు మంది.

స్టవ్ ఆఫ్ చేసి నీళ్ళు బాత్‌రూంలో బకెట్‌లో తొరిపి షేవ్ చేసుకుంటున్న మూర్తి నడిగింది: ''అమ్మాయికేం కొన్నారూ?''

దానికి మన పెట్టు ఎందుకే మనం ఏం కొనక్కర్లేదు. ''రెండువందలిచ్చి ఏమైనా కొనుక్కో అమ్మా అంటే నాకేం లోటు నాన్నా అంది!'' గర్వంగా చెప్పాడు మూర్తి.

సుశీలకేం లోటో తెలుసుకోలేని తండ్రి!

నిట్టూర్చింది వర్ధనమ్మ...ఆ బావతో...

'బావ' మాట తలచుకునేసరికి తన బావ జ్ఞాపకం వచ్చాడు. ఆనాడు బావ చూపులలో శాపం...?

కాళ్లలో వణుకు పుట్టుకొచ్చి సావిట్లో కుర్చీలో కూల పడింది.

''పురటాలు నీళ్లలా కాచావ్ వళ్లు నొప్పులన్నీ పోతాయి!'' నీళ్లగదిలోనుంచి మూర్తి.

—అక్కడ ఏం జరిగిందో, మూర్తి అక్కడున్న రోజులన్నీ ఎలా గడిచిపోయాయో ఊహించగలదు వర్ధనమ్మ. క్రిందటి సంవత్సరం, ఇద్దరూ కలిసేగా వెళ్ళారు.. ప్రశాంతీ అంటూ చెల్లెల్ని ఆయన వదలరు. అమ్మాయి గదిలోనుంచి బయటకు రాకుండా ఏదో చదువుకుంటూ ఉంటుంది. సాయంకాలం వచ్చి 'అత్తయ్యా, సినిమా' అంటాడు అల్లుడు. లేకపోతే షికారు, షికారు కాకపోతే షాపింగు...కాని, కాని...

గుండెల్లో రాజుతున్న నిప్పును పొగ బయటకు రాకుండా ఇముడ్చుకోడం...నా తల్లికి నా పోలికే వచ్చింది.

—"బావుందండీ, సినిమాలూ, షికార్లూ, బాగానే ఉన్నాయి. కాని అమ్మాయి నిజంగా..."

"నిజంగా భేషుగ్గా ఉంది. పువ్వుల్లో పెట్టుకుని ఆదరించే అత్తగారూ, కాదు మేనత్తా, అంత గోముగా చూసుకునే..."

"అవును!"

ఈయనకు చెప్పి లాభం లేదనుకుంది వర్ధనమ్మ. మగవాళ్లని ఎంత గొప్పగా తీర్చిదిద్దినా, ఆడదాని అంతర్యం, కనీసం ఒక్క ఆడదాని అంతర్యం తెలుసుకునే శక్తిని మాత్రం ఇచ్చాడుకాదు ఆ వెర్రి బ్రహ్మ.

"ఈమారు గోలుకొండ, గండిపేట, ఫలక్‌నామా చాలా చూశాం."

"అందరూనా, ఆనంద్...?

"బావుంది. వాడికి మనలా తిరగాలంటే ఎలా కుదురుతుంది? స్పెషల్ బ్రాంచి ఇన్‌స్పెక్టర్ అంటే ఎంత బరువు, ఎంత బాధ్యత, అవన్నీ నీకెలా తెలుస్తాయ్?"

"అవును. ఆ బ్రాంచిలో వాళ్లకి సంసారాలు లేవ్!"

"ఉన్నాయ్, లేవోయ్. అంతా నీలాంటివాళ్లే అయితే దేశం బాగుపడినట్టే!"

చిరునవ్వు నవ్వడం తప్ప ఇంకోటిచేసి ఏం లాభం? వర్ధనమ్మ ఈ విషయం ఏనాడో తెలుసుకుంది.

మొదటిసారి కూతురు సంసారం చూడాలని తహతహతో వెళ్లినపుడే సగం విషయం బోధపడింది.

అల్లుడూ, అమ్మాయీ, పకపకలూ వికవికలూ లేవు సరిగదా ఏదో తప్పించుకు తిరుగుతున్నట్టు కనపడింది. ఎప్పుడూ నవ్వుతూ, కేరింతలు కొట్టే సుశీల ఎందుకో పరధ్యానంగా చూస్తుండడం చూసి మనసు కొట్టుకుపోయేది.

మేనరికం, నిజంగా మెడబట్టని మేనరికం అనుకున్న్టే— తన అనుభవందృష్ట్యా, వాళ్లు కోరివచ్చి అడిగిన సందర్భంలో కాదన లేకపోయింది.

ఆనంద్‌కి రూపురేఖల్లో కాని, చదువులో కాని, ఉద్యోగంలో కాని వేలెత్తి చూపించుకోవాల్సిన అవసరంలేదు. పాత బంధుత్వం కాదని కాలదన్నుకోడం మంచిది కాదని 'ఆయన' చెబుతుంటే— తన పెళ్లి కుదిరిందని తెలిసినరోజు వచ్చి మావయ్య మాటాడిన నూటి పోటి మాటలే గుర్తొచ్చాయి.

అనంద్ ప్రవర్తన విషయంలో ఉద్యోగ బాధ్యతలని ఆయన సమాధానపడినా, ఆడబడచూ, వియ్యంకుడూగార్ల ముఖాల్లో ఏమీ దైన్యత కనపడకపోయినా, సుశీల సుఖపడుతుందనుకోడానికి కావల సిన బుజావుమాత్రం వర్ధనమ్మకి కనపడలేదు.

భోజనం చేస్తుండగా ఆయనను మళ్లీ కదిపింది.

''అమ్మాయిని కోవెలకు తీసుకెళతానన్నారు, వెళ్లారా?''

''ఆఁ. వెళదామనే అకుకున్నాం. రోజూ ఏదో ఓ ప్రోగ్రాం. మొన్న వెళదామనుకునేసరికి అమ్మాయి ఇంటికి రాదు. 'నీళ్లయ్యాక నే వెళతాలెండి నాన్నగారూ' అంది.''

—వర్ధనమ్మకి కావలసిన సమాచారం దొరికిపోయింది. ప్రాణం ఉసూ మంది. తల్లి తండ్రులకు తగలాల్సిన శాపాల ప్రభావం పిల్లలమీద ఉంటుందా?

కళ్లలో నీళ్లు తిరగడం మూర్తి గమనించి ''మళ్లీ ప్రారం భించావా, పాతకాలం మనిషివి. సుశీల నీ కూతురే కాదు. నాకూ కూతురే. అది హాయిగా, రాజాలా ఉంది. దాని గురించి నీకు దిగులు...''

''అబ్బే. నాకేం దిగులండీ''—అప్పటికి అక్కడనుంచి తప్పు కుంది వర్ధనమ్మ.

సాయంకాలం ఆయన ఇట్లోంచి ఎక్కడికో వెళ్లారు వర్ధ నమ్మ సావిట్లో కూచుని మీనాక్షమ్మ ఇంటికేసే చూస్తోంది.

''ఏమిటత్తయ్యా! అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నావ్!'' రాధ గేటు తీస్తూ పలకరించింది.

బరువుగా మెట్లెక్కుతున్న రాధను తనివితీరా చూస్తూ ''రామ్మా! రా!'' అని ఆహ్వానించింది బయటకు వచ్చి.

అన్యోన్య దాంపత్యానికి బుజావైన ఆ వెలుగు, ఆ హుందా, సుశీల కళ్లలో కనపడుతుందేమోనని వెర్రిగా గోడమీద ఫోటోవంక చూసింది వర్ధనమ్మ.

ఓ జంట అన్యోన్యంగా ఉన్నారనడానికి నిదర్శనం ?

— ఎవరి సోదా వాళ్లది.

---

# సంచలనం

## శ్రీ కె. అంజయ్య

భూమి స్తనాల్లోంచి
మొదలే శాంతిపాలు గారాయంటే
నేన్నమ్మను ?
దేన్నయినా చిదిమితే
మొదట్లో కారేది నెత్తురే
కసురు కాయను చిదిమితే
కారేది పసరే.

గుండెల్లో
శాంతి నిండిందో
వేదాంతము చిందులేస్తుంది
ఈ జన్మకింతే లెమ్మంటుంది
నీటి సుడుల్లా
పుట్టిచచ్చే ఆలోచనలు
**శాంతిలో**
మొలచే తాత్కాలికాలే.
అందుకే డియర్
అశాంతిని ప్రేమించు
అశాంతిలో వీచేవి
అంతం లేకుండా వెలిగే కిరణాలు.

శ్రీ జి. జవహరలాలు

# అపురూపమైన ఇరుగొండ దేవచోళ మహారాజు జిన శాసనం

ఈ జిన శాసనం గల రాతి స్తంభము శిథిలావస్థలో నున్న జినాలయ ప్రాంగణములో నిలబెట్టబడియున్నది. ఈ పాడుపడిన జినాలయము అనంతపురం జిల్లా, మడకశిర తాలూకా, అమరాపురం గ్రామానికి రెండు కిలో మీటర్ల దూరమున నున్నది. శాసనము చరిత్రకారులు నిర్వచించిన 'తెల్గు—కన్నడ లిపి'లో వ్రాయబడియున్నది. అక్షరపొందిక 13–వ శతాబ్దానికి చెందిన శాసన లిపికి దగ్గరలో నున్నది. మొట్టమొదటి సారిగా యిది 1917–వ సంవత్సర దక్షిణదేశ శిలాశాసన వార్షిక నివేదిక [1] (Annual Report on South Indian Epigraphy)లో నమోదు చేయబడినది. ఇంత వరకు దీని వివరణ సవరించి ప్రచురింపబడలేదు.

శాసనస్థలమగు అమరాపురం మడకశిరకు 41 కి. మీ.లు. పెనుగొండకు 90 కి.మీ.లు, అనంతపురానికి 165 కి. మీ. లు, దూరములో నున్నది. ఈ గ్రామం చేరటానికి బస్సు సౌకర్యము మాత్రమే కలదు. పూర్వకాలములో దీనిని 'నడ్లహల్లి' అనేవారు. శబ్దార్థ ప్రకారం 'నడ్లహల్లి' అనగా 'మధ్యనున్న గ్రామం' అని అర్థము. ప్రాచీనకాలంలో ప్రస్తుత అమరాపురం గ్రామానికి యిరుప్రక్కల తైలగిరి మరియు కల్లుదుర్గమనే గ్రామాలు ఉండేవట. ప్రస్తుత శాసన స్థలము ఒకనాటి తైలగిరియే!! ఇప్పుడు ఇది దేవాలయ శిథిలాలతో చారిత్ర కావశేషాలతో నిండియున్నది. ఆ శిథిలాలయాలలో నొకటి జినాలయము. దాని ప్రాంగణములో జైనుల సమాధి రాళ్ళు (Tomb stones) మెండుగా నున్నవి. వాటి నడుమ యీ శాసన స్తంభము నిలబెట్టబడియున్నది. శాసనము మొత్తం 35 పంక్తులు కలిగి, కన్నడ భాషలో ఉన్నది. శాసనము అరగకు వివరంగా వుండుటచే పరిశోధన సులభదాయకమైనది. శాసనభాషా పరిచ్ఛేదములో ఏ విలక్షణమైన లక్షణాలు వాడబడలేదు.

అన్ని జిన శాసనాలవలె యిది జినస్తుతితో ప్రారంభింపబడినది. ఈ శాసనము మహామండలేశ్వర, త్రిభువనమల్ల, నిస్సంక ప్రతాప చక్రవర్తి, వీరదానవమురారి శ్రీ ఇరుగొండ దేవచోళ మహారాజు కాలములో నొసగబడినది. ఈ ఇరుగొండ చోళ మహారాజు చోళవంశపువాడై, నిడిగల్లు రాజధానిగా పాలించెనని శాసనము వివరించుచున్నది. పైగా యిది తారీఖు గల శాసనము (Dated Inscription). ఈ శాసనము శకవర్షము 1200 ఈశ్వర సంవత్సరమున ఆషాఢశుద్ధ పంచమీ సోమవారమునాడు నొసంగబడినది. ఈ శాసన కాలములోని శకవర్షము 1200కు మిగిలిన వివరణలకు పొత్తు కుదురుట లేదు. కాని శకవర్షము 1199కి పైని తెలిపిన కాల వివరణలు సరిపోవుచున్నవి. ఇది వ్రాయసగాని తప్పు (Scribe's error)గా తీసుకొన వచ్చును. ఇటు వంటివి శిలాశాసనాల యందు సర్వసామాన్యంగా గోచరిస్తూ వుంటాయి. అయిన శాసన కాలమును క్రీ. శ. 1277, జూన్–7, సోమవారముగా పరిగణింప వచ్చును.

శాసన వివరణ ఏమనగా—బాలేన్దు మలధారి దేవుని ప్రియ శిష్యుడు (lay disciple) సంగయన బొమ్మిసెట్టి యేల్వి దంపతుల ప్రియసుతుడు అగుమల్లిసెట్టి తమ్మడహల్లి యను గ్రామం మరియు 2000 పోకచెట్ల (areca trees) తోట తన ముఖ్య వంతు (Principal share)గా భావించి బ్రహ్మ జినాలయమునకు క్రీ. శ. 1277వ. సంవత్సరమున దాన మొసగెను. శాసనము అచ్చటితో ఆగక దాన వివరణ చక్కగా యిచ్చినది. పైని యిచ్చిన పోకచెట్లపై వచ్చు ఆదాయమును బ్రహ్మజినాలయమును 'ఉపాన—స్థూపి పర్యంతము' రాతితో నిర్మించుటకు, దానికి మహామండపము, భద్ర, లక్ష్మీమండపాలు, గోపురాలు, చుట్టు గోడ (enclosure) తోరణాలు (festoons) మాన స్తంభాలు కట్టుటకు, జినాలయానికి కావలసిన సమస్త వస్తువాహనాలు అమర్చు కొనుటకు మాత్రమే వెచ్చించవలయునని చెప్పబడియున్నది. దాన త్యాగి మల్లిసెట్టి గురువు బాలేందు మలధారి త్రిభువన కీర్తిరావులకు ప్రధాన శిష్యుడు. ఈ త్రిభువన కీర్తిరావుల ఇంగళేశ్వరబలి, మూల సంఘము, దేశీయగణము, కొండ కుందాన్వయము పుస్తక గచ్ఛగల సంఘారామమునకు చెందిన వారు. వీరు పొన్నమర వీటి [శీమ] సిర్కా, భువలోకనాథ విషయమున గల భూలోకనాథ నల్లూర్ల గ్రామానికి చెందిన జిన బ్రాహ్మణుడుగా శాసన మూలంలో పేర్కొనబడినాడు. ఈ పొన్నమర వాటి 'శీమ' దక్షిణ మధురకు ఉత్తరదిశగా నున్న దక్షిణ పాండ్య దేశములో నున్నదన్న వివరణ గూడ శాసనములో నున్నది.

ఇప్పటి వరకు మనము సంగ్రహించిన విషయం క్లుప్తముగా యిది—"శ్రీ ఇరుగొండ దేవచోళ మహారాజు నిడిగల్లు రాజధానిగా పరిపాలించుచున్న తరుణంలో జనమతాభిమాని మల్లిసెట్టి శక

వర్షము 1200 (ప్రాయశః 1199)లో శ్రైలగిరి యందున్న బ్రహ్మజినాలయానికి 2000 పోకచెట్లు గల తోటను దానముగా నొసంగెను".

వెల్లడైన చరిత్రాంశాలను బట్టి మనకు అర్వాచీన చాళుక్య రాజులకు సామంతులుగా తెలుగు చోళుల శాఖలు నిడిగల్లు, హేమవతి, కర్నూలు, కడప కేంద్రాలుగా చేసుకొని పాలించినట్లు తెలియుచున్నది. కాని తెలుగు చోళుల పేర్లనుబట్టి వారిని గుర్తించి కాల నిర్ణయం చేయుట మహాకష్టము. దీనికి కారణం ఒకే పేరుగల వారు పెక్కుమంది ఉండుటే! కీర్తిశేషులు డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారు[2] సిద్దేశ్వరం శాసనానికి చరిత్రాంశములను పేర్కొన్న సమయంలో యిదే విషయాన్ని వెలిబుచ్చిరి. "ఇరుంగోళ చోళ మహారాజు అర్వాచీన చాళుక్య త్రైలోక్యమల్లు (సోమేశ్వరుడుI)ని సామంతగా అలంపూరు శాసనము[3] (క్రీ.శ. 1056) లోను, మరియు అదే పేరుగల చోళ మహారాజు త్రిభువనమల్లదేవుని సామంతగా కన్నేకల్లు శాసనం[4] లో (క్రీ.శ. 1125)ను, పేర్కొనబడెను. కనుక కాల వివరణలేని సిద్దేశ్వర శాసనములోని ఇరుంగోళ చోళ మహారాజు పైని పేర్కొన్న చాళుక్య రాజులలో ఎవరి సామంతయో గుర్తించుట తేలిక గాదని చెప్పి ముగించిరి." పైగా మనకు కంబదూరు శాసనం[5] బట్టి మరియొక ఇరుంగోళ చోళమహారాజు నిడిగల్లు రాజధానిగా క్రీ.శ. 1244 లో నున్నట్లు తెలియుచున్నది.

చారిత్రక పరిశోధనల వలన మనకు తెలుగు చోళుల సంతతి వారు పలుప్రదేశము (tract)లలో పాలన సాగించినట్లు విశదమగుచున్నదని పైని పేర్కొనియుంటిని. అటువంటి తెలుగు చోళుల శాఖ (branch) ఒకటి నిడిగల్లు, హేమవతి ప్రాంతాలలో 11వ శతాబ్దం నుండి పాలించినట్లు మనకు లభ్యమైన శిలా శాసనాలను బట్టి తెలియుచున్నది. ఈ నిడిగల్లు చోళులలో పేర్కొనదగిన వారు మంగరసుడు మొదటి ఇరుంగోళుడు, మల్లిదేవుడు మరియు రెండవ ఇరుంగోళుడు. వీళ్లందరూ శిలా శాసనాలలో పేర్కొని కీర్తింపబడినవారే. వీరివంశము బహుశః రెండవ ఇరుంగోళుని మనవడగు గణేశ్వరదేవునితో అంత మొందినట్లు గుర్తింపనగును. అయిన యీ శాసనములో తెలుపబడిన ఇరుంగోళ దేవుడెవరు? ప్రాయశః యీ ఇరుంగోళ దేవుడు కంబదూరు శిలా శాసనములో పేర్కొనబడిన ఇరుంగోళ చోళ దేవునిగా గుర్తింపనగును. అనగా పైని తెల్పిన తెలుగు చోళులలో రెండవ ఇరుంగోళుడు. కాగా ప్రస్తుత శాసనములో ఇరుంగోళుడు 'త్రిభువన వల్లభుడు'యను బిరుదమును కలిగినట్లు చెప్పబడినది. ఈ బిరుదము చాళుక్యప్రభువుల ప్రశస్తిలో చేరినదే. అంతమాత్రమున ఇరుంగోళుడు స్వతంత పాలన సాగించినాడని పేర్కొనుట చరిత్ర విరుద్ధము. ఏలయన, చాళుక్యుల కాలంలో ప్రభువులు తమ సామంతులను తమ బిరుదములతో గౌరవించెడివారు. డాక్టరు యశోదదేవి[6] గారు వారి పరిశోధనా గ్రంథములో యిదే యభిప్రాయమును వెల్లబుచ్చియున్నారు.



ఇరుగొండ చోళదేవుని శిలాశాసనము.

సర్వసాధారణముగా ప్రతి జిన శాసనములో జినాచార్యుని పరిచయము చేయునపుడు వారి సంఘారామము యొక్కపూర్తి వివరణ పేర్కొనబడును. అవ్విధముగనే ప్రస్తుత జిన శాసనము త్రిభువన కీర్తిరావులుని పేర్కొని వారు మూలసంఘము, దేశీయ గణము, కొండకుండాన్వయము, పుస్తక గచ్ఛ సంఘారామమునకు చెందిన వారని తెల్పినది. జిన మత సాంప్రదాయములో సంఘము అతి ముఖ్యమైనది. దాని శాఖలు, ఉపశాఖలు కోకొల్లలు. అవి దేశం నలుమూలలా చొచ్చుకొని పోయినవి. ఈ జైనమతములోని శాఖలకు ఉపశాఖలకు 'సంఘము', గణము, గచ్ఛ, అన్వయము, బలి, సముదయము, మొదలగు పేర్లు గలవని శాసనములు జైనమత గ్రంథాలు తెలుపుచున్నవి. వీటి పుట్టుపూర్వోత్తరాలు తెల్పాలంటే చాలా పెద్ద గ్రంథము కాగలదు. ప్రస్తుతము ఈ సంఘము,

గణము, గచ్ఛ, అన్వయము, బలి, సముదయాలు జినమత వ్యవస్థ (Monastic Order)లగా గుర్తించిన యిచ్చట సరిపోవును.

తదుపరి, బ్రహ్మజినాలయము యొక్క అర్చకుడు(Priest) చల్వపిల్లెయని, జిన బ్రాహ్మణుడని తమిళ దేశమునకు చెందిన వాడని గూడా శాసనంలో చెప్పబడియున్నది. ఇది మిగుల ఉత్సుకతను కలిగించు విషయము. ఏలయన తమిళ దేశమునకు చెందినఅర్చకుడు ప్రస్తుత శాసన స్థలమునకు రానేల ? దానికి ప్రబల కారణం ఉన్నదా ? క్రీ.శ. 10వ శతాబ్దమునుండి జైనమత వ్యాప్తి కుంటి బడినది. జినులను, జినమతాభిమానులను ముఖ్యముగా వీరశైవులు చి తవధకు గురిచేసి, హింసించి, వధించినట్లు శాసనాధారాలు చాలా కలవు. ఆ సమయములో జినమతాచార్యులు పొట్టచేతపుచ్చుకొని, వారికి పోషణ, (సం)రక్షణ గల ప్రదేశములకు తరలిపోవుట చరిత్ర సత్యము. కన్నడ కవిగా పేరు గాంచిన 'పంప' తల్లిదండ్రులు గుంటూరు మండలము వదలి వేములవాడ చేరిరి.[7] అట్లే రాజరాజ నరేంద్రుని కాలంలో జైనులు రాజమండ్రి వదలి[8] రక్షణార్థమై హనుమకొండ చేరిరి. వీటికిగల కారణము నాడు ప్రబలిన జినమత దురభిమానమే !! కావున ఈ చల్వపిల్లె తమిళ దేశము వదులుటకు అచ్చట ప్రబలిన జైనమత ద్వేషమే కారణమైయుండ నోపు!! తదుపరి, చల్వపిల్లె జిన బ్రాహ్మణుడని పేర్కొనబడినది. అనగా జైనులు రానురాను హిందూ సాంప్రదాయం ప్రకారం కుల వ్యవస్థను పాటించినట్లు విశదమగుచున్నది అసలు జైనమతము హిందూమతములో గల కులవ్యవస్థను ఖండించి దానికి విరుద్ధముగా వుద్భవించి అన్నికులాలవారికి ఆశ్రయము కల్పించినది. ఈ శాసనముగాక, రెండవ అమ్మరాజుని కలుచుంబర్రు తామ్రశాసనము[9] జైనులలో గూడ నాలుగు కులవర్ణముల వ్యవస్థ కలదని తెల్పుచున్నది. అనగా జైనమతము మూల సిద్ధాంతము వీడి హిందూ సంప్రదాయాలను రానురాను పాటించి తనకు తానై నాశనమునకు హేతువు కల్పించుకొన్నది.

చివరిగా, యీ శాసనమును అపురూపముగా పైని పేర్కొనియుంటిని. కారణం జినాలయము యొక్క భాగములను తెల్పు శాసనము యిప్పటికి యిది ఒక్కటే. దీనివలన మనకు ప్రతి సంపూర్ణ జినాలయము ముఖమండపము, లక్ష్మి, భద్ర, మండపాలు, గోపురాలు, పరిసూత్రము, వందనమాల (festoons ) మానస్తంభము, మకర తోరణాలు, సంపూర్ణవాహనాలు కలిగి వుండవలయునని విశదమగుచున్నది. ఇప్పటి వరకు యావద్భారత దేశములోను జినాలయ భాగముల గురించి తెలిపే శాసనము మనకు లభ్యం కాలేదు. ఈ శాసనము మూలముగనే జినాలయ భాగము లను గుర్తించుట వీలగుచున్నది. ఇంతటి ఉత్సాహము కలిగించెడి విషయము యీ శాసనంలో పేర్కొన్నమూలముగా యిది నిజముగా అపురూప (unique) మైనదే !!

అమరాపురం ఇరుగొండ చోళదేవుని కాలంలో ప్రఖ్యాత జైన తీర్థంగా పేరుగాంచి యుండనోపు. అసంఖ్యాకమైన జైనుల సమాధి రాళ్లు అచ్చట అభ్యమగుట దీనికి తార్కాణం. సన్యాస వ్రతము (లేక) సల్లేఖన వ్రతము బూని ప్రాణత్యాగము జైన తీర్థ క్షేత్రాలలోనే చేసుకొనుట జైనులాచారం. ఇటువంటి క్షేత్రాలు మనరాష్ట్రంలో కడప జిల్లాలోని దానవులపాడు; అనంతపురం జిల్లాలోని పెనుగొండ, అమరాపురం, కర్నూలు జిల్లాలోని చిప్పగిరి, పెద్దతుంబళం, నిజామాబాదు జిల్లాలోని బోధన, విశాఖపట్టణ జిల్లాలోని రామతీర్థము గలవు. ఇప్పటికీ అమరాపురం జిన క్షేత్రముగా పేరువడసియున్నది. పూంచడుమ గల జినాలయము గ్రామవాసులచే పూజలందు కొనుచున్నది.

శాసనములో పేర్కొన్న తమ్మడహల్లి అదే పేరుతో యిప్పటికీ అమరాపురానికి నాలుగు కిలోమీటర్ల దూరంలో నున్నది. నేటికి మనం యిచ్చటనే పోకచెట్లను చూడగల్గుచున్నాము. శాసన స్థలములో పాడుబడిన జినాలయమే ఒకనాటి బ్రహ్మజినాలయం కాదగును. జిన తీర్థంకరుల విగ్రహాలు లేవు గాని, ఖాళీగా ఉన్న పానువట్టము పైగల సింహము గుర్తు, మహావీరుని లాంఛనము. కావున బ్రహ్మజినాలయములోని ఆరాధ్యజినుడు మహావీరుడని చెప్ప రాదు. హిందూ దైవాలకు వాహనాలు ఎట్లు కలవో జినదేవులకు గూడ వాహనాలు కలవు. వాటిని జైనమతంలో లాంఛనాలంటారు. జినదేవులను జైన తీర్థంకరులంటారు. వీరు 24 మంది. వారిలో ఋషభనాథుడు మొదటివాడు కాగా మహావీరుడు కడపటివాడు. పానువట్టము పైగల సింహము లాంఛనము మహావీరునిదే. కాని శాసనంలో బ్రహ్మజినాలయం ఆరాధ్యజినదేవుడు పార్శ్వనాథుడని పేర్కొన బడినది. దీనిని బట్టి, మన రాష్ట్రంలో జినదేవుల ప్రతి మలను జినమత గ్రంథాలను గుణంగా మలచలేదని గుర్తింపనగును. ఈ విషయం ఆంధ్రలోజినావశేషములను. జినశాసనములుపరీక్షించిన వారికి తేటతెల్లమగును. కావున శాసనాధారముగా బ్రహ్మజినా లయములోని ఆరాధ్య జినదేవుడు పార్శ్వనాథుడు కాగా పాను వట్టముపైగల సింహలాంఛనము మహావీరునిగా తెలుపుచున్నది.

నిడిగల్లు చోళుల కాలంలో ప్రజలాదరణ, ప్రభురక్షణ పొందిన జైనమతము రానురాను వీరశైవుల కోపాగ్నికి గురియై వారిచే జినాలయములు జినమూర్తులు ధ్వంసము (Dismantled) కావింపబడినట్లు మనకు మత గ్రంథాలు తెలుపుచున్నవి. జీర్ణ ములై పాడుబడిన జినాలయములు, భగ్నము కావింపబడిన జినావ శేషములు మత గ్రంథాల కథనమునకు సాక్ష్యులుగా నేటికి నిల్చియున్నవి. వీరశైవుల దాడులలోనే యీ బ్రహ్మజినాలయము ధ్వంసము చేయబడి దాని యారాధ్య విగ్రహము పెరికి వేయబడినదని మనం గుర్తింప నగును.

## శాసన పాఠము

1 శ్రీ మత్పరమ గంభీర స్యాద్వాదామో

2 ఘ లాంఛనం జియాతు త్రై[illegible]క్యనాథస్య శాసనంజిన—

3 శాసనం॥ స్వస్తి సమస్త వసువతి [illegible] దోర్దండ్డు

4 మతః క్రితొర్ద్ద న్దరుం మార్తా న్డకుళ భూషణరు మభీ

5 సంపా(త్) త భీషణ (మెూ)ఱ్యాప్స్ర వరాధీశ[రుక్య]

6 నిప్ప (చోళవనీశరోళు)॥ స్వస్తి శ్రీ మన్మహా మండ్డలేశ్వ (ర)

7 త్రిభువన మల్ల భుజబళ భీమరొద్దడ్డ గో(వ)ళల్గ సహో

8 (దొమ అరుకట్టాటు) కడలీకర తలెగొన్డగన్డ(బ)స్త్ర భా

9 (వ) పరనారీ సహోదర పడె మబ గణ్డ నిగలంక మల భీతరం కొల్లమతె

10 (షి) గె కావ సరణాగత వజ్రపంజరం అసహాయసూర యే కాం—

11 గ వీర నిస్సంక ప్రతాప చక్రవర్తి వీరదానవమొరారి యిరుంగొణ—

12 దేవ చోళమహారాజరు శ్రీ ప్రిథ్వీనిడిగల్లునెళవీడి నోళు నెలసి

13 సుఖ సంకతా వినోదదిం రాజ్యం గెయ్యెత్త మిరలు శకవష॥

14 1200 నెయ ఈశ్వర సంవత్సరద ఆషాడ శుద్ధ పంచమీ సోమవార (దం)—

15 దు (లెలం గెఱియ జోగ) (వ) ట్టిరెయ బ్రహ్మ జినా లయక్కె శ్రీ మోల సంఘ

16 దేశీయ గణ క్రొండకున్దాన్వయ పుస్తక గచ్ఛ ఇంగళేశ్వర బలియ

17 త్రిభువన కీర్తి రావుళర ప్రధాన శిష్యరు బాలేన్దు మలధారి

18 దేవరి (ప్రియ) గడ్డనుం సంఘయన బొమ్మిసెట్టిగం మెల్లవ్వెగం ఘట్టి—

19 ద మల్లిసెట్టి తమ్మడ హలియ ఎరయ గుయ్యాల తన్న ఎరడు భాగ॥

20 (మం) ఎరడు సాయిర (అడకెయ మావను) తైలం గెరెయ బసదియ ప్రసన్న పాశ్వ దేవ—

21 ర ప్రతి హస్తవాగి మక్కళు మక్కళు పయ్యన్త వృత్తి వన్త నెన్దు దక్షిణ.

22 పా(శ)స్య దేశవ దక్షిణ మఘురెయ ఉక్తర భాగదల్లి (బో)

23 (న్నమన్నైరుతి) సీమయ భువలోక నాథ విషయద భువలోక నాథ నల్ల—

24 ర జిన బ్రాహ్మణ (ర రట్టి) యజుర్వేద మైత్రేయ శాఖి వశిష్ఠ గోత్ర కొన్డి—

25 న్య మైత్ర వరుణ వశిష్ఠమెంబ ప్రవరదీప సాయకంగం పొన్న

26 వ్వెగం పుట్టిద శ్రీ సయన గిగియుం ఆ బాలేందు మలధా—

27 రిదేవర ప్రియ శిష్యను మ(ప్ప?) చెల్వపిల్లె హస్తదల్లి ఆ చంద్రార్క్క ం—

28 బరం తిన్న మెలిభాగవను ధారాపూర్వ్వకాదిం వృత్తియాగి కొట్ల (యా) యిం—

29 తప్ప దక్కె సాక్షిహదినెన్ట్ల సమయం మల్లిసెట్టి (ఒప్ప) శ్రీ వీ—

30 తిరాగ॥ హదినెన్ట్ల సమయద ఒప్ప సదాశివదేవరు॥ స్వద—

31 త్తం పరదత్తం వాయోహరేతి వసున్ధరాం షష్టిర్వ్వష సహస్రాణి విష్టా—

32 యాం జా యతె క్రిమి॥ ఈ తోటదవస్తు విన్దం ఉపానాది స్థాపి పవ్వ —

33 న్తం బసదియుం మహామన్డపయుం బద్రేయుం లక్ష్మీమన్డ పముం

34 గోపురముం పరిసూత్రముం వంన్దన మాలెయుం మాన స్తంభముం (మకర)

35 తోరణముం సంపూర్ణ వాహన (ముం) వనా కల్ల కెల నవనె మాడువం

## ఈ వ్యాసరచనకు పరిశీలించిన గ్రంథాలు


1 దక్షిణదేశ శాసనా వార్షిక నివేదిక, (ARSIE), 1917, నెంబరు 40.

2 ఆంధ్రప్రదేశ్ శిలాశాసన వార్షిక నివేదిక, 1966, నెంబరు 215 మరియు పుట 95 చూడవలయును.

3 తెలంగాణా శాసనాలు, II, కళ్యాణి చాళుక్యులు, నెంబర్లు 4, 5.

4 దక్షిణదేశ శాసన వార్షిక నివేదిక (ARSIE), 1924, నెం. 96. మరియు దక్షిణదేశ శాసనాలు (SII), IX, పార్టు i, నెం. 209.

5 దక్షిణదేశ శాసనాల వార్షిక నివేదిక (ARSIE), 1913, నెం. 89.

6 J. A. H. R S., XXIV, పుట 58.

7 Kurikyala Stone Inscription : Epigraphia Andhrica, Vol. II, P. P. 27-30.

8 ఓరుగల్లు కైఫీయాత్, L. R. Vol. XI, P. 133 ff.

9 Epigraphia Indica, Vol. VII, PP. 177-192.



# వెన్నెల మండింది

శ్రీ నందిగాం వీర వెంకటరమణ జోగారావు

వెన్నెల వర్షానికి
నల్ల మబ్బులు గొడుగులు పడుతున్నాయి !
అక్కడా అక్కడా చుక్కలు
నన్నే చూస్తూ వెక్కిరిస్తున్నాయి !!
అక్కడ నా సరస్వతికూడా
మాసిన తెల్ల చీరలాంటి వెన్నెలని
తన కన్నీళ్లతో ఉతుకుతోంది !
సర్వ సాక్షిలా నిశ్చలంగావున్న
పంచముఖీ పర్వతంలా
ఊరంతా రాత్రిదయ్యం నిశ్శబ్దంగా
అరచిన కేకకు జడిసి
స్తబ్దంగావుంది !!!
సిగిరెట్‌కోసం వెలిగిన
ఆఖరి అగ్గిపుల్ల వెలుగులో
యింటి కప్పులో పగిలిన పెంకుల సందుల్లోంచి
గతం నా గుండెలో
చెయ్యిపెట్టి కెలుకుతూవుంది !

మబ్బు మనసును పిల్లగాలి
తోసుకుపోతూవుంది !
సిగ్గు దొంతర్ల చినుకులు
టప టప మంటున్నాయి !!
నా కౌగిలిలో సరస్వతి !
కాదు !!
సరస్వతి కౌగిలిలో నేను !!!
వెన్నెలలో వాన !
వానలో వెన్నెల !
రెంటినీ కలబోస్తే
సరస్వతి కన్నీళ్ళే !!
కాలం తుఫానులో చెరిగిపోయిన
సరస్వతి నొసటి కుంకుమను గుర్తుచేస్తూ
ఎర్రటి మెరుపులు !
ఇద్దరి గుండెల్లో ఉరుములు తరిమే సవ్వడి !!
నాలుగు కన్నుల్లో జీవనకాంతి నిండింది !!!
మెరుపుల వర్షంలో వెన్నెల మండింది!!!!



హిందీ మూలం : శ్రీరామశర్మ ఆచార్య

# దీర్ఘ జీవనము యొక్క రహస్యము

సాధారణముగా వ్యక్తులు 40–45 సం॥ల తరువాత వారికివారే వృద్ధులనుకుంటారు. ఏదైనా సాధించుటకు, ముందుకు సాగుటకు, వారి జీవిత లక్ష్యములు గాని, ఆకాంక్షలుగాని, సాధించలేమనుకుంటారు. "మేము వృద్ధులమై పోతున్నాము" అను భావనే వారిని ఆలాగ తయారుచేయుచున్నది. గాని, శరీర దారుఢ్యములేకగాని జవసత్వము లుడిగిగాని కాదు. ఇది ఒక రకమైన మానసిక దౌర్బల్యము. వాస్తవంగా చూస్తే మహాపురుషులు వారి ఖ్యాతి 50 – 60 సం॥ల తరువాతనే సంపాదించిరి. ఎందువలననగా అన్ని సం॥ల అనుభవము వారికి సహాయకారిగ ఉంటున్నది. యౌవనమునకు శరీరిక అవస్థ మాత్రమేకాక, శక్తి సామర్థ్యములు, ఆనందోల్లాసములు, సృజనాత్మకశక్తి వంటి గుణములే యౌవనమునకు రెండవ అర్థమనవచ్చును. గేలార్డు హాజర్ అనునతని లెఖ్ఖ (చెప్పిన) ప్రకారము "వయస్సుయొక్క సంబంధము మనిషియొక్క శరీరము, ఆత్మ, మరియు మనస్సుగాని, 'కేలండర్'తో దానికి ఎటువంటి సంబంధమూ లేదు."

మహాపురుషుల జీవితమును పరిశీలించిన వయస్సు ఆ వ్యక్తులను బంధించలేక పోతున్నది. వారు మహత్కార్యములు చేస్తూనే ఉన్నారు. మహాత్మాగాంధీగారు 63 సం॥ల వయస్సులోనూ, ఆ తరువాతనూ, అనేక భాషలు, జ్ఞానము సంపాదించిరి. ఆయన మాటలలో చెప్పాలంటే "నేను ముసలివాడి నవుతున్నానన్న గుర్తు కూడా రావడం లేదు." పాఠశాలలో విద్యార్థిలాగ గాంధీగారు ఉర్దూ నేర్చుకుంటారని, తమిళము, తెలుగు మరియు బెంగాలీ భాషలు నేర్చుకోవాలన్న స్వప్నము సాఫల్యము గావించుకుంటారని ఎవరికి తెలుసు ? నిజముగా ఆయన ఆ వృద్ధావస్థలో పై భాషల 'లిపి' కూడ నేర్చుకున్నారు.

పారిశ్రామిక రంగంలో కూడ మనకి ఇటువంటి చాల ఉదాహరణలు దొరుకుతాయి. ఈ రంగంలో వయోవృద్ధులు యువకులకంటె హెచ్చుపని, కార్యకుశలత చూపి, వారి శక్తి సామర్థ్యముల పరిచయము చేస్తున్నారు. కమాండరు బైండర్ బిట్ 70 నుండి 80 సం॥ల వయస్సు మధ్య కాలములో సుమారు 10కోట్ల రూపాయల ఆస్తిసంపాదించి, యువకులకుకూడ ఆదర్శప్రాయుడయాడు. బ్రిటిష్ మాజీ ప్రధాన మంత్రి కీ॥ శే॥ విన్‌స్టన్ చర్చిల్ 70–80 సం॥ల వయసు తరువాత కూడ ఒక శక్తివంతమైన 'డైనమో' వని చేసిన విధముగా కార్యములను చకచక నిర్వర్తించేవారు. ఆయన క్రియాశీలత, తిరుగులేని ఉత్సాహము వలననే "ఉజ్వల భవిష్యత్తు గల యువకుడు"గా ఆయన్ని అంటూ ఉండేవారు.

"ఏదేనా ప్రాణియొక్క ఆయుర్దాయ మెంత ఉండవలెను?" ఈ ప్రశ్నకు సమాధాన మేమనగా "శరీర వికాస మెంతుండునో అంతకు ఆరు రెట్లు జీవించి యుండవలెను" అని చెప్పవచ్చును. అమెరికన్ 'మెడికల్ ఎసోసియేషన్' అధ్యక్షులు డా॥ ఎడ్వర్డు ఎల్. బోర్జ్ ఈ సిద్ధాంతము అనేక ప్రాణులపై ప్రయోగములు చేసి, నిరూపించిరి. ఆయన ప్రకారము మనుజుడు 25 సం॥ల వయసు వచ్చేసరికి లేక లోపలే పూర్ణ వికాసము పొందుతాడు పై సిద్ధాంతము ప్రకారము ప్రతిమనిషి 150 సం॥లువరకూ జీవించవచ్చును.

కాని, ఇలాగ ఎందుకు జరుగుట లేదు ? దీనికి కారణములు ఈ క్రింది సూచించిన ప్రకారముగా లెఖ్ఖించవచ్చును. అలసి, సొలసిన హృదయము శరీరమును ఉత్సాహవంతము లేక శక్తివంతముగా నుంచుటకు వలసిన రక్తమును సరఫరాచేయలేకపోవుట, 50సం॥లు వచ్చుసరికి ఊపిరితిత్తుల శక్తి 30% తక్కువగుట, ఎముకలు, వక్షస్థలమందుండు ఎముకలు గొలుసులాగ ఒక్కొక్కటే విరిగి, తెగిపోతున్నాయి. అందుచేత కోమలత్వం తగ్గుటవల్ల కూడ ఎముకలు నుండి, ఊపిరి తిత్తుల నుండి శరీరమునకు కావలసిన ప్రాణవాయువు పీల్చలేకపోవుట, వయస్సుతోపాటు ఊపిరి తిత్తుల బలం తగ్గిపోతూ, వయస్సులో సగం అయిపోవుట, నరములలో కంపన శక్తి 20% తగ్గిపోవుట మొదలైనవి. పై నుదహరించిన నిష్కర్షల వలన తేలిన విషయమేమనగా మనుజుడు 60 సం॥లు వయస్సును సమీపిస్తూనే పూర్తిగా ఎండిపోతున్నాడు. నిస్సత్తువై పోతున్నాడు.

డా॥ సి. వార్డు క్రేమ్టన్ అంటారు కదా — "ముసలితనం కేలండరు (వయసు) వల్ల కాక, క్షమత, లేక దక్షతపైన ఆధారపడి ఉంటుం"దని. రక్తం విరిగిపోవడం, లేక గ్రంథుల యొక్క కఠోరత, మానసికవత్తిడి, మరియు తీసుకున్న ఆహారము సమముగా పచనము కాకుండుట- ఈ నాలుగు గుణాల ప్రభావంవలన సమయం కంటే చాల ముందుగానే మనిషిని మృత్యుముఖం ముందు నిలబెట్టుచున్నది ముదుసలితనము ఒకే ఒకమారుకాక, అంచలంచలుగా వస్తుందని క్రేమ్టన్‌గారి అభిమతం (అనుమానం). కొన్ని అంగాలు శిథిలమయి, వాటి ప్రభావము మిగిలిన అంగాలపైబడి, ఇట్లా అవి కూడా శిథిలావస్థ చెందుతున్నాయి. ఈలాగ పూర్తిగా మృత్యువు రాకుండానే శరీరం లోపల లోపల అవయవం ఒక్కొక్కటిగా మృతి చెందుతున్నది.

యోగ వాశిష్ఠములో మృత్యువును సంబోధించి ఇలాగ వ్రాసి ఉంది :

"ఓ మృత్యువా! మీరొక్కరే మీ బలంతో ఎవ్వరినీ చంప లేరు. ఎవరు చనిపోవుచున్నారో, వారి వారి కర్మల చేతనే మృతి నొందుచున్నారు. మీరు నిమిత్తమాత్రులై యున్నారు."

వాస్తవంగా మనకున్న శుభ్రమైన శరీరమను యంత్రమును జాగ్రత్తగా కాపాడుకుంటే చాలకాలము మనము సహజముగా జీవించ వచ్చును. దానికొరకు విశేషమైన ఉపాయములుగాని, రహస్యములు వెదకుటకు ఏ ఆవశ్యకతలేదు. కేవలము ఈ సుందర యంత్రమున్ను (శరీరము) అల్లరి పిల్లలు ప్రతివస్తువునూ విరుగకొట్టి, పాడు చేస్తున్నట్లు చేయక, ప్రకృతి సిద్ధమైన, సాధారణమైన, సహజ మైన, శాంతియుతమయిన జీవనము గడపిన చాలును.

ఋషి మైక్సువార్మ వైండ్ చెప్పేవారు— "మనం మృత్యు వును జయించలేము. ఇది నిజం. కాని, కొంచెం బుద్ధి ఉపయో గించి, జీవితయాత్ర సాగిస్తే అధమం మృత్యువును వెనక్కు నెట్ట వచ్చుననడంలో ఎటువంటి సంశయమూలేదు."

పరిశోధకులు ప్రపంచంలో అనేక దీర్ఘజీవులతో సంపర్కము స్థాపించి, వారి దీర్ఘజీవిత రహస్యములను పరిశీలించిరి. ఎందువల ననగా సాధారణముగా అంతకాలము జీవించుట సామాన్యముగా సాధ్యముకాదు. ఈ పరిశోధకులకు సాధారణమైన, సరళమయిన, నియమబద్ధమయిన, సంతృప్తికరమైన ప్రసన్న చిత్తముగా జీవిం చుట, వంటి సామాన్య విషయములే వారూ కనుగొన్నారు. పై విష యాలు మనకీ తెలుసు. కాని, వాటిని పాటించుకొనుటలోనే మన అశ్రద్ధ అంతా ఉంది.

ఈజిప్టు దేశపు సికందరియా నగరానికి 143 మైళ్ళు దక్షిణ పశ్చిమంలో గిజియావా అనే ఒక గ్రామం ఉంది. ఈ గ్రామంలో రాజావాకా అనే 109 సం॥ల రైతు కొద్దికాలం క్రిందటి వరకూ ఉండేవాడు. ఆయనలో విశేషమేమిటంటే ఆ వయ స్సులో కూడ శరీరంలో ముడతలు పడలేదు. పలువరున క్రమంగానే ఉంది. ఒకపన్నూ ఊడలేదు. జుట్టు చాల నల్లగాను, దృష్టి చాల తీక్షణంగా ఉండేది. ఆయన శరీరాన్ని చూసి ఎవరేనా 40 సం॥లు కంటే అధిక వయస్కుడని అనుకోలేరు. ఇంత దీర్ఘవయస్సులో కూడ ఆయన శరీరం పటిష్టంగా ఉండడం, యౌవనంగా ఉండడం చూసి, చాల దేశాలనుండి 'రిసెర్చి స్కాలర్సు' జిజ్ఞాసవేత్తలు ఏ కారణాలవల్ల అతడు తన శరీరాన్ని ముసలితనంనుండి ఎలా కాపాడుకుంటున్నాడో కనుక్కోవడానికి వచ్చేవారు. వారిలో ఫ్రాన్సు నుండి, స్వీడన్నుండి, డా॥ లేసర్ వేస్ నేతృత్వంలో ఒక డాక్టర్ల బృందం మొదలైనవారు ముఖ్యులున్నారు.

వారితో తన ఆరోగ్య రహస్యం చెప్పడానికి తగిన బలమైన విషయం ఏదీ రాజావాకా దగ్గరలేదు. అతడు తూచి-తూచి మాట్లాడుతాడు.. (ముక్తసరి) అతడు చదువు సంధ్యలులేని చాల బీదరైతు పొలాల్లోనే పుట్టి పెరిగినవాడు. వర్షాకాలం మినహా అతడు ఎప్పుడూ యింట్లో పడుకొనేవాడు కాదు. "నేనెప్పుడూ మాంసం తినలేదు, మద్యం సేవించలేదు. రోజుకి కనీసం ఎనిమిది గంటలు కష్టించి పని చెయ్యడం, ఈత ఈదడం, చెట్లెక్కడం మొదలైనవి నా దినచర్య. 9 గజాల బట్ట మేరకు నాకు సం॥పాటు సరిపోతుంది. నాకు ఎవరితోనూ ద్వేషము లేదు. ఏ విశేషమైన చింతలూ లేవు. కష్టము—సుఖము; మంచి—చెడు దినములు కూడా వస్తూఉండేవి; పోతూఉండేవి. కాని, వాటన్నిటినీ ఈశ్వర అను గ్రహముగా స్వీకరించి, సంతోషం గారోజులు వెళ్ళగొడుతూ వచ్చాను" అన్నాడు.

సోవియట్ రష్యాకి చెందిన 160 సం॥ల దీర్ఘజీవి షిరాలీ ముస్లిమోవ్ — 'దాల్‌జావూ' అనే చిన్న గ్రామంలో ఉండేవాడు. పత్రికా విలేఖరులు ఈతని దీర్ఘ జీవిత రహస్యమును గ్రహించుటకు చాల ప్రశ్నలు వేసిరి. గాని, విలేఖరులకు ఏ విశేషములూ దొరక లేదు. ఏవేనా జవాబులు దొరికినా, అవి సహజ, సామాన్య, స్వాభా విక, సాధారణ జీవితక్రమము గురించి తప్ప మరేవిశేషములూ లేవు.

షిరాలీ అనే ఆయన జీవిత విధానము గురించి ముక్తసరిగా మాట్లాడేరు. "నేను జీవితమంతా అధిక పరిశ్రమ చేస్తాను. పశు వుల కాపరి వృత్తి వంటి వృత్తులు చేపట్టేను. దీర్ఘ జీవితానికిచ్చే 'గవర్నమెంటు' 'పెన్షన్' తీసుకుంటున్నా, ఈవృద్ధావస్థలో కూడా ఊరికినే కూర్చోను. ఎంత సంభవమైతే అంతమేరకు పనిచేస్తాను. నేనే కాదు. నా పరివారంలో ఎవ్వరూ మద్యము సేవింపరు; 'సిగ రెట్టు' కాల్చరు. నాకు దూరంగా నడవడం చాల అలవాటు. ఎప్పుడే అవుసరమయినా ఏదో ఒక వంకపెట్టి, నడక సాగిస్తూనే ఉంటాను." ఈ వృద్ధావస్థలో ఆయనకు "వాకూనగర్" చూడా లని కోరిక ఉండేది. దానికోసం దగ్గరగా ఉన్న 'రైల్వేస్టేషన్' వరకూ సుమారు 60మైళ్ళు నడకతోనూ, గుఱ్ఱముమీద స్వారీచేసి, ఆ స్టేషను చేరిరి. యాత్రలో ఆయనతో మునిమనవడు మట్టుక్కి ఉన్నాడు. అంతవరకె.

దీర్ఘజీవి సర్ జేమ్సు సేయర్ జీవితములో చాల తక్కువ మార్లు జబ్బుపడ్డారు. ఆయన ఆరోగ్యానికి సంబంధించిన కొన్ని మంచి అలవాట్లతో సంబంధం ఉందని చెప్పేవారు. వారు ముఖ్య ముగా ఆరు ఆరోగ్య సూత్రాలవైపు ధ్యానం చూపేరు. అవి :—

(1) ఎనిమిది గంటలు పూర్తిగా నిద్రపోవుట,

(2) ఆరుబయట పరుండుట,

(3) మంచము ను గోడలకి తగలకుండా దూరంగా వేసుకొనుట,

(4) గోరువెచ్చనినీటితో ప్రాతఃకాలమున స్నానముచేయుట,

(5) స్వల్పంగా శాఖాహార భోజనము చేయుట; మరియు,

(6) రోజూ కాలినడకని నడచుట, మొ॥ల॥నవి.

ఇరాన్ దేశానికి చెందిన 191 సం॥ల సైయ్యద్ అబూ తవిల్ మిసావీ అంటారు కదా :— "నవ్వుతూ, ఆడుతూ, ఉండడం మొదటి నుండి అలవాటు చేసుకుని, ఆ గుణాన్ని బలంగా ఆచరిం

చేను'' అన్నారు. వారు ఎప్పుడూ దేనికీ చింత పెట్టుకోలేదు. ఎవ్వరితోనూ ద్వేషం పెంచుకోలేదు.

జపాన్ దేశస్థురాలు, దీర్ఘజీవి అయిన 118 ఏళ్ళ శ్రీమతి కోవాయాసీయాస్టు చెప్పిన ప్రకారం ఆమె జీవితమంతా శాఖాహారి గానే ఉండేది. ఏ చీకూ, చింతా లేక గాఢంగా నిద్రపోయేది ఎప్పుడూ మత్తుపదార్థాలు సేవించి ఎఱుగదు; ఎప్పుడూ మందులు త్రాగలేదు.

సింగపూరు దేశస్థురాలు 133 ఏండ్ల వయోవృద్ధురాలు శ్రీమతి నోరియా విగతే అనే ఆమె సూచించిన ప్రకారం ఆమె ఎప్పుడూ ''అల్లా'' నే నమ్ముకొనేది. మరియు ప్రతిరోజూ ''నమాజు'' (ప్రార్థన) చేస్తూ ఉండేది.

అమెరికాలో అందరికంటే అధిక వయస్కురాలు, నీగ్రోవనిత అయిన శ్రీమతి చార్లీ స్మిత్ అనే ఆమె ఉండేది. ఆమెకి 121 సం॥ లున్నప్పటికీ ఆమె తన దుకాణం నడుపుకుంటూ ఉండేది. ఫ్రాన్సు దేశస్థురాలు అయిన శ్రీమతి ఫ్రైలిసీ 106 సం॥ల వయసు దాటినమహిళ. భారతదేశం కూడా ఈ విషయంలో సౌభాగ్య శాలి అని చెప్పవచ్చును. ఎందువలననగా ప్రభుత్వ అంచనాల ప్రకారం 1971 నాటికే 60 వేల మంది వ్యక్తులు 100సం॥లు దాటినవారున్నారుట.

దీర్ఘ సమయము వరకూ జీవించి యుండుటకు పనికివచ్చు అనేక కారణములను అన్వేషించుటలో అనేక 'రిసెర్చి' (అన్వేషణ) సంస్థలు చాల సమయము వెచ్చించి, కృషి సల్పినవి. అవి ఏయొక్క 'మాయ – మంత్రం' కనిపెట్టలేకపోయేయి. అనగా ఏ ఒక్క బల మైన కారణం వారికి పట్టుబడలేదు. అయితే అందరూ వచ్చిన నిర్ధారణ ఏమిటనగా ఆరోగ్యానికి సంబంధించిన సూత్రాలను నియమం తప్పకుండానూ, కఠినంగానూ పాటించుటేకాక వాటిని ప్రసన్నపూర్వకంగా కూడా ఈ నియమాలు పాటించుట వంటివే దీర్ఘాయుష్యుకు రహస్యములని కనుగొనిరి.

లండన్ విశ్వవిద్యాలయంలో వృద్ధాప్యంమీద ఒక పరిశోధనా విభాగం ఉంది. అక్కడ ముందుగా ముసలితనం వచ్చుటకు కను గొన్న కారణాల్లో కావలసిన దానికంటే అధికంగా భుజించుట, మరియు, వయసుకు మించిన పుష్టిగల భోజనము చేయుట,మొ॥ల నవని కనుగొన్నారు.

సర్ హర్‌మన్ వేవరే అను వ్యక్తి 100 సం॥లు పైబడిన సుమారు 150 మంది వయోవృద్ధులతో ముచ్చటించి, వారిని ప్రశ్నించి, జవాబులు సమన్వయించి చూస్తే చాల మట్టుక్కి అన్ని జవాబులూ ఒకే మోస్తరుగా ఉన్నాయిట. ఉదాహరణకి :—

(1) ఆకలి వేసిన దానికన్నా చాల తక్కువ తినుట,

(2) ఆరుబయట అంటే స్వచ్ఛమైన గాలిలో జీవనము గడుపుట,

(3) ఎల్లప్పుడూ ఏదో ఒక పనిచేస్తూ ఉండుట,

(4) ఏ చీకూచింతాలేక నవ్వుతూ, తూలుతూ జీవించుట,

(5) రోజూ వేగిరముగా పరుండి, వేకువఝామునే లేచుట (వేగముగా) మరియు, మరో చింతలేక గాఢంగా రాత్రి నిద్రపోవుట,

(6) నియమితమైన దినచర్య అలవరచుకొనుట, మరియు

(7) మత్తు ('నిషా') పదార్థముల నుండి దూరముగా నుండుట (సేవింపకుండుట), వంటివి.

ఇటువంటి అధ్యయనమే ప్రొఫెసర్ నెల్సన్ అను ఆయన 87 మంది దీర్ఘజీవులను పరిశీలించిరి. ఆయన కూడా రమారమి పై నుదహరించిన నిష్కర్షలనే రుజువుచేస్తూ ఇంకా వివరంగా సేకరించిన విషయములేమంటే ఈ 87 మంది వ్యక్తులలో ఎవ్వరికీ విశేషమైన శరీర సౌష్ఠవము లేదని వారి శరీరములకు ఇతరమైన మరే పోషణగాని, జాగ్రత్తగాని, లేదని తెలుసుకొనిరి. వారందరూ సుఖంగా నవ్వుతూ, నిశ్చింతగా కాలం గడుపుట వల్లనే అంతకాలము జీవించియుండుటకు సాధ్యపడినదని తేల్చిచెప్పిరి.

కేలిఫోర్నియాయొక్క ఆరోగ్య విశేషజ్ఞులు జాన్ వాట్‌సన్ అను నతడు విషయమేమంటే— ''ఈజిప్టు దేశానికి చెందిన 109 సం॥ల రాజావాకా యొక్క ఆరోగ్య నియమములు మనని పూర్వపు అన్వేషణ, నిష్కర్షలపైకే కేంద్రీకరింపజేస్తాయి. వేటి గురించైతే మనము అధికంగా ధనం, వ్యయ, ప్రయాసలు చేసి, ఇన్ని ఆరోగ్య సిద్ధాంతాలు కనిపెట్టామో''నని. వీటివల్ల తేటతెల్లమైన సత్య మేమంటే దీర్ఘజీవనానికి జాబు సాధారణమైన, శాంతియుతమైన జీవనముతప్ప; వేరొకటిలేదని ఋజువైనది.

'ఓటేగీ' విశ్వవిద్యాలయంయొక్క 'డీన్' (Dean) సర్ ఛార్లెస్ హర్‌కన్‌గారు యౌవనములో ముదుసలితనం, ముసలితనంలో యౌవనం ఎందుకు వస్తాయో విశ్లేషణచేస్తూ ఈ విధంగా చెప్పేరు. ''ఎవరైతే మారుతున్న పరిస్థితుల కనుగుణంగా వారూ మారుతూ, వారి అభిరుచుల్ని మార్చుకుంటారో, వారు వార్థక్యం లోనూ, యౌవనవంతులుగా ఉంటారు. అలాగ కాకుండా మారు తున్న పరిస్థితులకు వ్యతిరేకంగానో లేక పొందిక కుదుర్చుకోలేకపోతే యౌవనంలోనే వార్థక్యం దాపురిస్తుంది'' అని.

డా॥ హోన్సు వోల్టర్ నీక్ వ్రాసిన పుస్తకం ''A New life in old age''లో ఈ విధంగా వ్రాసేరు. ''ప్రస్తుత పరిస్థితులకి అనుగుణంగా ఏ వ్యక్తి అయితే సరదాగా సర్దుకుపోతాడో వాడే అకాల మృత్యువునుండి తప్పించుకోవడమే కాకుండా దీర్ఘజీవిత మాధుర్యాన్ని కూడా 'చవి' చూడగలడు'' అని.

1971 జనాభా లెఖ్ఖల ప్రకారం భారతదేశంలో కూడా 150 సం॥ల కంటె హెచ్చు ఆయుర్దాయమున్న వ్యక్తులు 40 వ్యక్తులని తేలింది. ఆ లెఖ్ఖలలోనే 70 ఏళ్ళు పై బడిన

వారిలో పురుషులుకంటె స్త్రీలే హెచ్చుగా ఉన్నారని తెలిసినది. ఇటువంటి వ్యక్తులు 86 లక్షలుండేవారు. వీరిలో పురుషులు 41,66,000 ఉండగా 44,32,000 మంది స్త్రీలు.

సామాజికపరంగా భారతదేశపు స్త్రీలు వెనుకపడి ఉన్నప్పటికీ వారు హెచ్చుకాలం ఎందుకు జీవించగలుగుతున్నారంటే జీవితములో ఒక క్రమమును పరిపాలిస్తూ రావడం; ఉన్నదాంట్లో సంతోషంగా జీవించడం అత్యధిక ఆశలకు పోకుండా సంతోషంతో ప్రశాంత జీవితం గడపడంవంటివి అతి ముఖ్యమైన కారణాలుగా చెప్పబడుతున్నాయి.

1971 జనాభా లెఖ్ఖల ప్రకారం అమెరికాలో సుమారు 29వేల మంది నూరు సం॥లు వయస్సు చేరుకున్న వారున్నారని తేలింది. సాధారణంగా ప్రతివారూ ఈ ఆయుః పరిస్థితిని చేరుకోలేరుకదా! మరి వీరు ఇంత దీర్ఘకాలమెట్లు జీవించినట్లు? ఇది ముఖ్యమైన ప్రశ్న. ఈ ప్రశ్నకు సమాధానము తెలుసుకోవడము ముఖ్యమే కాక, ఉపయోగకారి కూడా కాగలదు. అందువలన ఈ విషయంలో పరిశోధనలు జరిపి, మహత్వపూర్ణమయిన సమాధానములు మనకు లభింపజేసిరి.

డా. జార్జి గ్యాలప్; మరియు, డా. ఎవిసహిల్ అను శాస్త్రజ్ఞులు విశేష పరిశోధనలు సలిపి, పై నుదహరించిన 29 వేలలో నుండి 65 సం॥లు, అంతకు మించిన వయస్కులను సుమారు 402 మందితో విశేషముగా చర్చలు జరిపి, దీర్ఘజీవనముయొక్క రహస్యము లనేకమును తెలుసుకొనిరి. ఆ 402 మందిలో 152 మంది పురుషులు, 250 మంది స్త్రీలుగను, ఒక కొలమానికగా తీసుకున్నారు. ఎందువలననగా పురుషులుకంటే స్త్రీలే అధిక వయస్కులుగా జీవించుచున్నారు కనుక.

దీర్ఘాయుష్కులతో ముచ్చటించుచున్నప్పుడు డా॥ గ్యాలప్, డా॥ హిల్ గారికి వచ్చిన సమాధానములు అంత ఆశ్చర్యజనకములు కాకున్నను, వారి కుతూహలమును నిజముగా రేకెత్తించినవి. వారు ప్రస్తుత కాలపు పరిశోధకులను సంతోషపెట్టుట కష్టమైన నిష్కర్షలకు వచ్చిరి. ఎందుచేతననగా ఎవరేనా ప్రశ్నించవచ్చును. ఈ నవయుగంలో మూఢవిశ్వాసంవల్ల కూడా దీర్ఘజీవనమునకు ఆధారము కాగలదా? అని......

115 సం॥ల సినేసినోంటీ అనునతడు 'నషా' లేక మత్తు పదార్థములకు దూరముగా యుండెడివాడుట. 65 ఏళ్ల జాన్ రాబర్ట్సుగారికి వండిన పదార్థములు రుచించెడివి కావుట. 99సం॥ల దంతవైద్యులు రహ్వైట్సు అను నాతనికి ఎప్పుడూ ఆనందమేనట. ఆయనతోటి జానపదులుతో పాటలు పాడుకుంటూ ప్రజల్ని ముగ్దుల్ని చెయ్యలేకపోయినా, చాల ఆకట్టుకొనేవారుట.

దీర్ఘజీవుల చరిత్రను తరచి చూస్తే మనకు బోధపడే విషయాలు ముఖ్యంగా వీరిది కల్లకపటములేని జీవితము గడుపుచున్నట్లు; విశ్వాసఘాతకమైన పనులు చేయుటగాని, నిష్ఠూరముగా ఇతరులను పరుష వాక్యములతో మాట్లాడుటగాని చెయ్యకపోవుట అని తెలిసినది. వీరు సజ్జనులుగను, నీతిమంతులుగను, ఉంటూ, వారి జీవితమనెడి పుస్తకమును అందరికీ అందుబాటులో ఉండులాగున రహస్యములు లేక జీవించుచుందురు. "దాచవలసిన విషయములు వారివద్ద ఉండుట" అన్నది అరుదైన మాట. వారు ఎవ్వరిచెడునూ తలపెట్టరు, చెడు చెయ్యరు. దానిఫలితంగా వారు ఎవ్వరికీ శత్రువులుకారు, వారి కెవ్వరూ శత్రువులులేరు. తప్పి తారీ ఏదేనా కోపం వస్తే అది ఏ క్షణంలోనో గాలికి ఎగిరినట్లు ఎగిరిపోతుంది. ఏదేనా అప్రియమైన సంఘటన జరిగినా ఆఘటన మనసులోనే పెట్టుకోరు. అనవసరమయిన విషయములను వారు లెఖ్ఖించక, వారిమనసునందు ఆ విషయము లుంచుకోకుండా ఉండుటవల్ల వారిమనసు ప్రసన్నముగను, నిర్మలముగను, శాంతముగనూ ఉంచుకుంటారు.

దీర్ఘకాలము జీవించుట కొరకు ఉల్లాసముగా ఉండుట మాత్రమే చాలదు. గాఢంగా నిద్రపోవుట చాల అవసరము. గాఢ నిద్రలేనిచో దీర్ఘాయువెట్లు వచ్చును? ఈలాగుననే ఆహార విహారములలో ఎవరు నియమబద్ధముగా నుందురో వారు రోగముల బారి నుండి రక్షించుకొనుటయేకాక, దీర్ఘకాలము వరకూ జీవించుచున్నారు కూడా.

దీర్ఘజీవులయందు అధిక సంఖ్యలో నున్నవారు వారికున్న స్థితిగతులయందు సంతుష్టి చెందినవారే. ముసలితనము అనివార్యమని అందరికీ తెలుసు. మృత్యువు తప్పనిసరియైన సత్యమనీ తెలుసు. అందుచేత వాటివలన భయపడి ప్రయోజనము ఏమున్నది? ఒంట్లో పటుత్వం అప్పుడుంటే ఇప్పుడు మానసోల్లాసముగా ఎందుకు జీవించకూడదు?

దీర్ఘజీవులలో అందరూ ఎల్లప్పుడూ హర్షోల్లాసాలతోనే ఉండేవారని, ఎప్పుడూ ఎవ్వరూ జబ్బుపడలేదని గాని, మందులు పుచ్చుకోలేదని అనుకోవడం పొరపాటు. అవి ఉంటూనే ఉంటాయి. గాని, వారికి మానసికంగా ఎప్పుడూ నిర్మలంగానే జీవించేవారు. వీరిలో ఎంతోమందికి భార్యలు పోయేరు. కొందరికి పిల్లలు చనిపోతే భూస్థాపితం చేసేరు. మరెంతమందికో పిల్లలు కృతఘ్నులుగా తయారయేరు. కాని, ఆ చేదు నిజాల్ని మనసులో పదే పదే జ్ఞాపకం చేసుకుని విచారించేకంటే మిగిలిన జీవితం సాగిస్తూ, సంతోషంతో పాటు దుఃఖాన్ని కూడా దిగమింగి దుఃఖాన్ని మనసుని పట్టనిచ్చేవారు కాదు. కానున్నది కాకమానదు కదా!

పై నుదహరించిన; చర్చించిన పరిశోధనలవలన తేటతెల్లమయిన విషయమేమనగా డాబు, దర్పము లేనిది, సాధారణమైన, సరళమైన, స్వచ్ఛమైన జీవన క్రమమును అనుసరించినయెడల మనము కూడ దీర్ఘకాలము జీవింపగలను. దీర్ఘజీవనము గురించి మనవద్ద ప్రత్యేక సిద్ధాంతములుగాని, సాధన సంపత్తులుగాని, లేకపోవచ్చునుగాక!

**తెలుగు అనువాదం : శ్రీ రుద్రావఝుల రామకృష్ణారావు**

డా. లింగంనేని, బసవశంకరరావు

# వర్ణనాత్మక - చారిత్రాత్మక - తులనాత్మక - వ్యాకరణములు

# (Descriptive - Historical - Comparative - Grammars)

వ్యాకరణము అను శబ్దము వి + ఆ అను ఉపసర్గలతో కూడి 'కృఞ్' అను ధాతువునుండి ఏర్పడినది. ''విశేషేణ ఆక్రియంతే వ్యుత్పాద్యన్తే శబ్దా అనేన'' అని వ్యాకరణ శబ్ద వ్యుత్పత్తిని మనవారు చెప్పుదురు. వ్యాకరించుట అనగా విభజించుట, వివరించుట అని అర్థము. వ్యాకరణమునకు లక్షణము, లక్షణశాస్త్రము, శబ్దలక్షణము, శబ్దశాస్త్రము, అనుశాసనము, శబ్దానుశాసనము మున్నగు నామాంతరములు కలవు. శబ్దానుశాసనమునకు ''అనుశిష్యంతే అసాధు శబ్దేభ్యః వివిచ్య జ్ఞాప్యంతే అనేన ఇతి అను శాసనమ్'' 'శబ్దానామ్ అనుశాసనమ్ శబ్దాను శాసనమ్' అనియు దీనికి అర్థము చెప్పుదురు. వ్యాకరణము అనుపదముకంటె శబ్దాను శాసనమనునది కొంతవరకు సంకుచితార్థ బోధకము అని చెప్పవచ్చును. శబ్దాను శాసనము అని అనుటతోడనే మనకు శబ్ద జ్ఞానమునకు మాత్రము సంబంధించినదనియే స్ఫురించును. వ్యాకరణము అన భాషానిర్మాణము నంతటిని వివరించునదను అర్థము ద్యోతకము—ధ్వని, శబ్దము, సంధి, సమాసము, కారకము, క్రియ, కృదంతము, తద్ధితము, వాక్యము మున్నగు వాని నిర్మాణముల వ్యక్తీకరించునది అని బోధకము.

సర్వసాధారణముగ ఏ భాషలోనైనను ప్రసిద్ధ లక్ష్య గ్రంథములు వెలువడిన పిదపనే లక్షణ గ్రంథములు అనగా వ్యాకరణములు పుట్టును. అందువలననే మనవారు 'ప్రయోగ శరణమ్ వ్యాకరణమ్' అని చెప్పుదురు. మహాకవుల శిష్ట ప్రయోగములే శరణముగా గలది వ్యాకరణమగుచున్నది. ప్రాచీన కాలమున వైయాకరణులకు సకల విద్వాంసులలో ప్రథమ పీఠము ఇచ్చినట్లుగ కూడ మనకు తార్కాణము లభించుచున్నది. అభినవగుప్తుడు 'ప్రథమేహా విద్వాంసో వైయాకరణాః' అని ప్రశంసించుట గమనింపదగినది.

సంపూర్ణ భావమును వ్యక్తీకరించు అఖండ వాక్యములను కొన్నిటిని గ్రహించి వానిని పరస్పరము ఒకదానితో నొకటి పోల్చి చూచి, ఆ వాక్యములలో ఏయే పదములకు ఎంతెంత అర్థము గలదో గుర్తించి ఆయా పదములకు గల సంబంధమును పరిశీలించి నిర్ధారణ చేయుటయే వ్యాకర్త పని. ప్రాచీన వ్యాకర్తలు, భాషా శాస్త్రజ్ఞులు సంపూర్ణార్థ బోధకమగు అఖండ వాక్యమే భాషకు మూలమని భావించిరి. కర్త, కర్మ, క్రియ, ప్రకృతి, ప్రత్యయము, నామము, సర్వనామము, విశేషణము, క్రియా విశేషణము, విభక్తి మున్నగు విభాగములన్నియు కాల్పనికము లనియు వారు విశ్వసించిరి. శతపథ బ్రాహ్మణమున ''వాగ్వై పరాచీ అవ్యాకృతా అవదత్ ... తస్మాదియమ్ వ్యాకృతా వాగుద్యతా.'' అని భాష ఒకప్పుడు అఖండమై, అవ్యాకృతమై యుండెడిదనియు అది కాలక్రమమున వ్యాకృతమైనదనియు నిట సూచింపబడినది.

సర్వ జీవద్వస్తువుల వలెనే భాషయు ఒక్క రీతిగనేయుండక అనవరతము అనేక రకములైన పరిణామములకు లోనగుచు కాలక్రమమున ఎంతయో అభివృద్ధిని పొందును. జీవద్భాషకున్న లక్షణమే అది. నిత్య వ్యవహారమున ప్రజచే నుపయోగింపబడు భాషయే జీవద్భాష. సర్వ సామాన్యముగా ప్రతి భాషలోను శిష్ట వ్యావహారిక భాషయే గ్రంథములందు ప్రయోగింపబడుచుండును. సౌకర్య కాములయిన ప్రజల నోళ్ళలోబడి భాష విభిన్న రీతుల పరిణతి నొందుచుండును. వైరూప్యమును, వైలక్షణ్యమును సంతరించు కొనుచుండును. కాబట్టి భాష ఒక కాలములో ఒక రూపముతోను, మరి కొంతకాలము తర్వాత భిన్న రూపముతో నుండుటయు తటస్థించుచున్నది. భాషా సమగ్ర రూపాన్వయమునకు సంపూర్ణ స్థితిగతుల నెరుంగుటకు బహు విధములైన వ్యాకరణములు ఆవశ్యకములు. ఒక కాలమునందలి భాషను ఉన్నది ఉన్నట్లుగా రమణీయముగా చిత్రించి ప్రదర్శించునది వర్ణనాత్మక వ్యాకరణము. భాషా చరిత్రను కనుగొనుటకు విభిన్న భాషలతోడి ఈ భాషకుగల సంబంధ బాంధవ్యముల నెరుగుటకు ఈ వ్యాకరణము చాలదు — కనుక ఒక భాష పుట్టు పూర్వోత్తరముల తెలిసికొనుటకు చారిత్రక, తులనాత్మక వ్యాకరణములు అవసరములు. వెరసి వ్యాకరణములు మూడు రకములనవచ్చును. ఒకటి వర్ణనాత్మక వ్యాకరణము (Descriptive Grammar) రెండవది చారిత్రాత్మక వ్యాకరణము (Historical Grammar) మూడవది తులనాత్మక వ్యాకరణము Comparative Grammar)

# వర్ణనాత్మక వ్యాకరణము :-

ఒక కాలమునకు చెందిన భాషను గ్రహించి వ్యాకరించి లక్షణముల చెప్పినచో నది వర్ణనాత్మక వ్యాకరణమగును. వర్ణనాత్మక వ్యాకరణమును రచించు వ్యాకర్త అప్పటివరకు రచింపబడిన మహా గ్రంథములను, సమకాలీన గ్రంథములను పరిశీలించి వ్యాకరించవలెను. ఒకప్పుడు తత్పూర్వ వ్యాకరణములకు విరుద్ధములైన మహాకవి ప్రయోగములు తటస్థపడవచ్చును. అప్పుడు "నిరంకుశాః కవయః" అను విషయము జ్ఞప్తి యందుంచుకొని అట్టి విరుద్ధములైన ప్రయోగములకు మార్గము చూపింప వలసిన బాధ్యత ఈ వర్ణనాత్మక వ్యాకరణకారుడు నిర్వహింపవలెను. వర్ణనాత్మక వ్యాకరణమున వర్ణలోప, వర్ణాగమ, వర్ణాదేశ, వర్ణ వ్యత్యయాది మార్పులను క్షుణ్ణముగ తెలుపవలెను. సాధుత్వా సాధుత్వముల కంటె భాషా స్థితిని తెలిపి లక్షణముల నేర్పరుపవలెను. సమగ్ర భాషావగాహనమునకు వర్ణనాత్మక వ్యాకరణములే అత్యంతోపకారులని భాషా శాస్త్రజ్ఞుల మతము. వర్ణనాత్మక వ్యాకరణము లన్నింటిలో పాణిని కృతమైన అష్టాధ్యాయి అత్యద్భుతమైనది. ఇది సమగ్రమైనదని, శాస్త్రీయమైనదని లియోనార్డు బ్లూమ్ ఫీల్డు మున్నగువారు పేర్కొనుట అందరు ఎరిగినదే. బ్లూమ్‌ఫీల్డు ఇది మానవ మేధకే మహత్తర చిహ్నమనెను. ఇట్టి అద్వితీయమైన వ్యాకరణము ఏ భాషలోను ఇంతవరకు వెలువడలేదని వక్కాణించెను చూడుడు — **"This grammar, which dates from some where round 350 to 250 B.C., is one of the greatest monuments of human intelligence. It describes, with the minutest detail, every inflection, derivation, and composition and every syntactic usage of its author's speech. No other language, to this day, has been so perfectly described. (P. 11 Language).**

ఆధునిక భాషా శాస్త్రజ్ఞులకు పాణిని రచన ఒక కనువిప్పు. ఈ రచనలోని శాస్త్రీయత ఆధునిక భాషా శాస్త్రజ్ఞులకు ఆశ్చర్యమును కల్గించుచు వీరిని శిరసావహింప చేయుచున్నదని గ్లీజను భాషా శాస్త్రజ్ఞుడను చున్నాడు — **'And it should a source of humility to modern linguistics to recognize that the most successful and complete description is very probably still the Sanskrit grammar of Panini and his associates–antedating modern descriptive linguiestics by millennia (P. 211. An Interoduction to Descriptive Linguistics.)**

వర్ణనాత్మక వ్యాకర్తకు చారిత్రక, తులనాత్మక వ్యాకరణ పరిజ్ఞాన మున్నయెడల అతడు రచింపబోవు వ్యాకరణము సమగ్రమైన భాషను సూక్ష్మముగను సులభముగను వ్యక్తము చేయును. ముఖ్యముగా ఈ వర్ణనాత్మక వ్యాకర్తలు ఆ గ్రంథములలో నున్న వ్యాకరణ విషయములను ఉన్నవి ఉన్నట్లుగ చెప్పవలయునేగాని తరువాతి కాలములో రాబోవు వారిని అట్లే రచింపవలెనని అనుశాసనము చేయరాదు. ఇట్టి ఆదేశాత్మక వ్యాకరణములు లేక నిర్దేశాత్మక వ్యాకరణములు (**Prescriptive grammars**) భాషాసహజ పరిణామమును అరికట్టును. ఆ జీవద్భాష నిర్దేశాత్మక దృష్టి కారణముగా మృతభాషగా తయారగును. ఆదేశాత్మక వ్యాకరణములను భాషా శాస్త్రజ్ఞులు ఎక్కువమంది నిరసింతురని గ్లీజను మహాశయుడు వక్కాణించుచున్నాడు— **Many linguists have very decidedly rejected prescriptive grammars as pernicious distortious. In many specific instances this is fully justified (P P. 208, 209).** కాబట్టి వ్యాకరణములు నిర్దేశాత్మకములుకారాదు. ఆ కాలములోని శిష్టుల భాషను గ్రహించి వానికి అప్పటి ఆయా వ్యాకరణములలో మార్గము చూపించవలసినదే కాని ఆ ప్రయోగములను పూర్వ వ్యాకరణ విరుద్ధములైనను వదలి పెట్టరాదు. అట్లు చేసిన ఎడల వ్యాకర్తదే తప్పు. అట్టి వ్యాకర్త దండనార్హుడట—'శిష్టానామ్ ఉక్తౌ సూత్రాణామ్ అభావే అనుశాసనకారా ఏవ దండనీయాః' అని చెప్పుట గమనార్హము. తెలుగున వర్ణనాత్మక వ్యాకరణములు పెక్కులు. అందు చిన్నయసూరి కృత బాలవ్యాకరణము కడు ప్రశస్తము. ఆధునిక తెలుగు భాషకు వర్ణనాత్మక వ్యాకరణములు బయలుదేరుచున్నవి. శిష్ట నవ్యాంధ్ర భాషకు సమగ్ర దృష్టితో వర్ణనాత్మక వ్యాకరణము ఇంకను అనగా భాషాశాస్త్రాధ్యయనము ఎంతయో అభివృద్ధి పొందిన తర్వాతకూడ వెలుగులోనికి రాకపోవుట కడుంగడు శోచనీయము.

# చారిత్రాత్మక వ్యాకరణము :-

చారిత్రాత్మక వ్యాకరణమున ఒక భాషకు భిన్నకాలములలో నేర్పడిన అనేకములగు మార్పులను పోల్చి చూచి ఆ పరిణామములకు గల కారణములను గమనించి ఆ భాషయొక్క పరిణామక్రమమును చారిత్రక దృష్టితో నిరూపింపవలయును. వర్ణనాత్మక వ్యాకరణమును రచించునపుడు వింతగాను, విలక్షణముగను కన్పించు కొన్ని రూపములను చారిత్రకముగా పరిశీలించి, వాని తొలిరూపమును కనిపెట్టి, ఏ యే కాలములందు భిన్నపరిణామమును పొందుచు ఆ విశేష రూపమును సంతరించుకొన్నదో నిరూపింపవలయును వర్ణనాత్మక వ్యాకర్త తన వ్యాకరణములో ఒక శబ్దమునకు అప్పటి ప్రయోగముల ననుసరించి లక్షణమును చెప్పనేగాని దానికిగల కారణములను, పరిణామమును ఉగ్గడింపడు. కాని చారిత్రక వ్యాకర్త తన వ్యాకరణమునందు ఒక శబ్దము ఆ కాలమున ఏ రూపమున నున్నదో చూచి ఆ శబ్దమంతకు పూర్వకాలమున నే విధముగ నున్నదో శతాబ్దముల తరబడి వెనుకకుపోయి ఆ శబ్దముయొక్క తొలిరూపమును కనుగొనవలయును. అందువలన ఒక శబ్దము పుట్టువునుండి ఏ విధముగ కాలాంతరమున మార్పులు పొందునో అది యంతయు చారిత్రక వ్యాకర్త నిరూపింపవలెను. వర్ణనాత్మక వ్యాకరణములో ఆగమములుగా చెప్పబడు నుగాగమ రుగాగమాదులను పరిశీలించి చూచిన యెడల అవి శబ్ద సహజములనియు కాలక్రమమున భిన్నములుగా పరిగణింపబడినవనియు చారిత్రక దృష్టితో నిరూపించిన తెలియగలదు.

వర్ణనాత్మక వ్యాకర్త చిన్నయసూరి పుంలింగ ద్యోతక 'డు' వర్ణమును పుంలింగంబయి మహద్వాచకంబయిన నామంబు తుది యత్వంబున కుత్వంబగు (తత్సమ–21) పుంలింగమగు మహద్వాచకమునకు డుజ్జగు (తత్సమ–22); అనియు మరల జిత్తు బిందుపూర్వకం బగు (తత్సమ–19) ననియు సూత్రించునే గాని దాని పరిణామ క్రమమును తెలుపడుగదా! కాని చారిత్రక వ్యాకర్త బహుపూర్వ గ్రంథ పరిశీలన గావించియు, పూర్వశాసన భాషానుశీలనము గావించియు, ఈ 'డు' వర్ణ చరిత్ర నిట్లు నిరూపింపగలడు—

| | |
|---|---|
| 7, 8 శతాబ్దములలో | సత్యాదిత్యన్ఱు |
| 8, 9 శతాబ్దములలో | నిరవద్యుణ్డు |
| 10వ శతాబ్దములో | సమేతుండు |
| ఆ పిమ్మటి కాలములో | వెన్నుఁడు |
| నేటి కాలములో | రాముడు/రావుఁడు |

ఈ పరిణామ క్రమములో 'న్ఱు' నుండి 'డు' వచ్చినదని చెప్పను. భాషాచరిత్ర తోడ్పడినచో మరింత ముందుకుపోయి 'సత్యాదిత్యన్' అను పదములో 'అన్' అనునది పురుష ద్యోతక ప్రత్యయమనియు చెప్పగల్గను. ఈ పురుష ద్యోతక ప్రత్యయమే నిర్దేశార్థక సర్వనామమైన 'అ' తో కలసి అ + అన్=అవన్ + ఉ=అవన్ఱు>వాన్ఱు>వాణ్డు>వాండు>వాఁడు>వాడు>ఆడు అను రీతి నేటికి క్రమపరిణామమును పొందినదని చారిత్రక దృష్టితో నిరూపించును.

చారిత్రక వ్యాకరణము రచింపవలెనన్న కేవలము నాగరక భాషలకే వీలు కలదు. లిపి, శాసనములు, సారస్వతాదులుగల భాషలకే చారిత్రక వ్యాకరణములు కూర్చుట సాధ్యమగును. చారిత్రకాధారము లున్నచో పదముల పరిణామ రీతి, ధ్వని, వర్ణముల పరిణామ రీతి, వాని చరిత్ర తెలిసికొనుట సులభమగును. ఈ చారిత్రక వ్యాకరణము ద్వివిధము -

1. ఏక కాలిక వ్యాకరణము (Synchronic grammar)

2. అనేక కాలిక వ్యాకరణము (Diachronic grammar)

ఒక శతాబ్దమునందలి భాషను గాని, ఒక కవియొక్క భాషను గాని చారిత్రక దృష్టితో నిరూపించు వ్యాకరణము ఏక కాలిక వ్యాకరణము. పెక్కు ఏక కాలిక వ్యాకరణములను ఏకమొనర్చిన అది అనేక కాలిక వ్యాకరణము. ఒక భాషాచరిత్ర సమగ్రావగాహనకు ఈ వ్యాకరణము అత్యంతోపకారి. తెలుగునకు ఇట్టి అనేక కాలిక వ్యాకరణము ఇంకను రచింపబడలేదని చెప్పవచ్చును. ప్రాఙ్నన్నయ కాలములోని శాసనములపైనను, 12, 13, 14 శతాబ్ద శాసనములపైనను వర్ణనాత్మక దృష్టితో పరిశోధన జరిగినది. అట్లే నన్నయ, ఎన్నెచోడ, తిక్కన, శ్రీనాథాదుల కావ్య భాషపై వర్ణనాత్మకదృష్టితో పరిశోధన గావింపబడినది. ఇంకను ఎఱ్ఱన, పోతన, ప్రబంధ యుగము, దక్షిణాంధ్రయుగము భాషలపై పరిశోధన ఇంకను జరుగవలసియున్నది. నన్నయనుండి చిన్నయవరకు గల భాషపై అనేక కాలిక వ్యాకరణము రచింపబడుట ఎంతయు తెలుగు భాషా చరిత్రావగాహనకు అవశ్యము అవసరము.

## తులనాత్మక వ్యాకరణము :-

భిన్న భాషలలో నిత్య వ్యవహారమువనుండు సర్వనామముల, సంఖ్యావాచకముల, సంబంధ బోధక వాచకముల, అవయవ వాచకములను గ్రహించి వానిని పోల్చి చూచి వానికిగల పరస్పర సంబంధమును నిరూపించునది తులనాత్మక వ్యాకరణము. విభిన్న భాషలకు గల సోదర సంబంధము, జన్యజనక భావసంబంధము ఈ వ్యాకరణము కారణముగా నిరూపింపనగును. మరియు ఈ పరిశీలనతో ఆయా సోదర భాషలకు మూలభాషయైన దాని ధాతు నిరూపణకు, భిన్న ధ్వని పరిణామ రీతులను తెలిసికొనవచ్చును. మూలభాషా లక్షణములు ఏ యే భాషలో ఎట్లు ఉన్నది, ఎట్లు పరిణామము నందినది, తెలియవగును. ఏ భాషలో మూల భాషాలక్షణములు ఎక్కువగా నున్నవి, ఏ భాష మూలభాషకు సన్నిహితముగనున్నది కూడ నిరూపింపనగును. సోదర భాషలకు చారిత్రకాధారము లున్నచో భాషా శాస్త్రజ్ఞునకు తులనాత్మక వ్యాకరణ రచన సులభము. మూలభాషకు కూడ చారిత్రకాధారములు లభించుచున్నచో ఈ కార్యము మరింత సుకరము. తులనాత్మక వ్యాకర్త సోదర భాషల పదజాలమును పోల్చి వాని స్వరూప స్వభావములను వ్యక్తీకరింపగలడు. ధ్వని, వర్ణము, పదాంశము, పదము మున్నగు వాని తొలిరూపముల నరయవచ్చును. అవి పొందిన పరిణామములను గమనించి కొన్ని ధ్వని సూత్రములను, భాషాసూత్రములను ఏర్పరుప వచ్చును. ద్రావిడ భాషా తులనాత్మక పరిశీలనకు కాల్డ్వెల్లు పితామహుండు, పెక్కురు పాశ్చాత్యులు, అనేకులు ప్రాచ్యులు ద్రావిడ భాషా పరిశోధన తులనాత్మకముగా చేసిరి. ఈ మధ్య అనాగరక ద్రావిడ భాషలపైనను పరిశీలన అధికమైనది.

తులనాత్మక పరిశోధనతో పునర్నిర్మాణము గావింపబడిన వర్ణముల ఉచ్చారణ స్పష్టముగా కనుగొన సాధ్యముకాదు. మూల భాషలోని మాండలిక భేదముల స్వరూపము, వాని వ్యాప్తిని గూర్చి తులనాత్మక వ్యాకరణము స్పష్టముగా నిరూపింపజాలదు. అందు వలననే ఈ విషయమును గూర్చి బ్లూమ్ ఫీల్డు 'The comparative method can work only on the assumption of a uniform parent language, but the incommensurable forms (such as * [mis] and * [bhis] as instrumental plural case endings in primitive Indo – European) show us that this assumption is not justified. The comparative method presupposes clear-cut splitting off successive branches, but the inconsistent partial similarities show us that later changes may spread across the isoglosses left by earlier changes; .........' (P. 318 Language)

ఒకే భాషాలక్షణమును వర్ణనాత్మక, చారిత్రాత్మక, తులనాత్మక వ్యాకరణము లెట్లు వ్యక్తీకరించి దాని స్వరూప స్వభావములను నిరూపించునో ఈ క్రింది ఉదాహరణములవలన తెలియగలదు.

# 1. ఴ:

## వర్ణనాత్మకము :

ఈ వర్ణము తెలుగు భాషలో నేడు లేదు. ఈ వ్యాకర్తకు కొంచెము చారిత్రకదృష్టి ఉన్నయెడల ఈ విషయమునే చారిత్రకముగా పరిశీలించి దీనిస్థానమున నేడు డకార రేఫము లేర్పడినవనియు చెప్పగలడు.

## చారిత్రాత్మకము :

చారిత్రాత్మకముగ నీ వర్ణమును పరిశీలించినపుడు ఇది ప్రాబ్నన్నయ కాలమున ప్రాకృత సంస్కృత తెలుగు శాసనములలో నున్నట్లు ఆధారములు గలవు — పఴికె రాష్ట్ర, ఴెందలూరు, పుఴోలు, చోఴ మున్నగు పదజాలము. కాలక్రమమున ఈ వర్ణము రెండచ్చుల మధ్యనున్నపుడు డకారముగ మార్పు నొందినది—చోఴ>చోడ, కోఴి>కోడి, ఏఴు>ఏడు మొదలగునవి. అన్యహల్సం యోగమునొందినపుడు వర్ణవ్యత్యయమేర్పడి రేఫగను పరిణతి పొందినది—పుఴోలు>ప్రోలు,పఴిన్త>ప్రాంత, మిఴుంగు>మ్రింగు, ముఴుంగు>మ్రోగు మున్నగునవి. 8, 9, 10 శతాబ్దముల శాసన భాషను పరికించినపుడు తెలియుచున్నది గదా!

## తులనాత్మకము :

ఈ 'ఴ' కారము ప్రాచీన ద్రావిడ భాషలో గలదు. అది తమిళ, మలయాళ భాషలలో నేటికిని నిల్చియున్నది. కన్నడమున 'ళ'కారముగను, తెలుగున అజ్మధ్యస్థమున 'డ' కారముగను, వర్ణవ్యత్యయము పొంది అన్యహల్సం యోగమున రేఫగను పరిణామము చెందినది ప్రాచీన కాలములో. ఆధునిక కన్నడ తెలుగు భాషలలో నీ ధ్వని కానరాదు. ఈ విషయము కనుగొనుటకు ఈ వ్యాకర్త ఈ నాల్గు భాషలలోని పదజాలమును పోల్చనిట్లు -

| త. | మ. | క. | తె. |
|---|---|---|---|
| చోఴ | చోఴ | చోళ | చోడ |
| వాఴై | వాఴై | బాళె | — |
| కోఴి | కోఴి | కోళి | కోడి |

| | | | |
|---|---|---|---|
| ముఱుంగు | ముఱుంగు | మొళంగు | మ్రోగు |
| ముఱింగాల్ | ముఱింగాల్ | మొళకాలు | మ్రోకాలు |

## 2. బు పరము :-

### వర్ణనాత్మకము :

వర్ణనాత్మక వ్యాకర్తయైన చిన్నయసూరి తన వ్యాకరణములో 'అమహ న్నపుంసకముల కదంతములకు ము వర్ణకంబగు' (తత్సమ – 39) అని సూత్రించెను. మరియు 'ము వర్ణకంబునకు మానుడి యేనిం బూర్ణ బిందుపూర్వక బువర్ణంబేని విభాషనగు (తత్సమ–42)ననియు వివరించెను దీనివలన నాగము–నాగమ్ము–నాగంబు అను రూపము లేర్పడును. ఇట్లు చెప్పుటలో చారిత్రక సత్యమిందు లేదు. అర్వాచీన రూపము నుండి ప్రాచీన రూపముల నుత్పన్నము చేయుట జరిగినది.

### చారిత్రాత్మకము

ప్రాఙ్నన్నయ యుగ శాసనముల పరిశీలించి చూచినపుడు 'ము' వర్ణక తొలిరూపము 'బు' వర్ణక మనియు అది కాల క్రమమున బు > మ్బు > ంబు > మ్ము > ముగా రూపాంతరమునొంది నేడు కోస్తాజిల్లా వారి ఉచ్చారణలో 'వ్ఁ'గా కనబడుచున్నదని చెప్పనొప్పును –

| | |
|---|---|
| 3 వ శతాబ్దములో | నాగబు |
| 5, 6 శతాబ్దములలో | ఉత్తరబు, పట్టణంబు |
| 7, 8 శతాబ్దములలో | పట్టణమ్బు, పులొమ్బు |
| 9, 10 శతాబ్దములలో | ఉత్తరమ్ము |
| 11 వ శతాబ్దమునాటికి | ఉత్తరము |

అని 'ము' వర్ణము ప్రాచుర్యము నొందినట్లు నన్నయ కావ్యభాషను పరిశీలించునపుడు తెలియును.

### తులనాత్మకము :

| త. | మ. | క. | తె. |
|---|---|---|---|
| పామ్బు | పామ్బు | హాము/హావు | పాము |
| నోమ్బు | నోమ్బు | నోము | నోము |
| అమ్బు | అమ్బు | అమ్మ | అమ్ము |
| వేమ్బు | | | వేము |

పై రూపములను పరీక్షించినపుడు ఈ 'బు' వర్ణము శబ్ద సహజమైనదనియు అది కాలక్రమమున తత్సమ శబ్దములపై అమహన్నపుంసకా దంతములకు చేరుట తటస్థించినది.

## 3. రుగాగమము :-

వర్ణనాత్మక వ్యాకర్త సూరి దీనిని "పేదాది శబ్దంబుల కాలు శబ్దము పరంబగునపుడు కర్మధారయంబునందు రుగాగమం బగు (సంధి–30) అని చెప్పి బీద+ఆలు=బీదరాలు, పేద+ఆలు=పేదరాలు, కొమ+ఆలు=కొమరాలు అని ఉదాహరించెను. ఇది ఆగమ మని చెప్పెనేగాని శబ్ద సహజమైనదిగా పేర్కొనలేకపోయినాడు. చారిత్రక దృష్టిని పరిశీలించినపుడు అది ఆగమము కాదని తెలియును

### చారిత్రాత్మకము :

చారిత్ర కాధారములతో ఈ విషయమును పరికించినపుడు ఈ 'రు కారము శబ్దగత మైనదనియు నది వ్యక్త ప్రయోగములో తొలగిపోయినదనియు తెలియును. ప్రాచీన సమాసము లందీ 'రు' కారము అట్లే నిలిచియున్నది. కొమరుఁబ్రాయము, పొదరిల్లు మున్నగునవి. ఈ విషయము తులనాత్మకముగా పరిశోధించినపుడు మరింత దృఢము కాగలదు.

### తులనాత్మకము :

పేద, కొమ, అను వ్యస్త పదములను సన్నిహిత సోదర భాషలతో పోల్చి చూచినపుడు ఇవి రేఫాంత శబ్దములని ద్యోతకమగును.

| త. | మ | క. | తె. |
|---|---|---|---|
| పేదయర్ | పేదయర్ | బడవరు | పేద |
| కుమరి | కుమరి | కుమారి | కొమ |
| పుదర్ | పుదర్ | హొదరు | పొద |

పై శబ్దజాలము ననుసరించి తమిళ, మలయాళ, కన్నడ భాషలలో రేఫ నిలిచియుండగా తెలుగుభాషలో మాత్రమీ రేఫ కాలక్రమమున జారిపోయినది. కాని ప్రాచీన తెలుగు సమాసములలో మాత్రమీ రేఫ నేటికిని కనబడుచున్నది. దీనిని సాధించుట కొఱకే వర్ణనాత్మక వ్యాకరణములో రుగాగమము నేర్పరచుచున్నాము.

ఈ విధముగ అనేక రకములైన వ్యాకరణములు అనగా వర్ణనాత్మక, చారిత్రాత్మక, తులనాత్మక వ్యాకరణములు రచించుటవలన భాషా సమగ్ర స్వరూప మెరుంగుటకు మిక్కిలి దోహదకారులగుచున్నవి. సమగ్ర భాషా చరిత్ర నెరుంగ గోరుటలో వర్ణనాత్మక, చారిత్రక, తులనాత్మక వ్యాకరణములు ఉత్తరోత్తరము బలీయములై చక్కగా ఉపకరించును. భాషా విషయక సత్యము కనుగొనుటకు, భాషా పరిశీలకునకు ఈమూడు వ్యాకరణములు అత్యంతావశ్యకములు. ప్రాచీన కాలమున వర్ణనాత్మక పరిశోధన ఎక్కువ. మధ్యకాలమున చారిత్రక దృష్టి పెరిగినది. మరి నేడు చారిత్రక దృష్టితోపాటు తులనాత్మకదృష్టి ప్రపంచ భాషలన్నిటిలోను ప్రబలినది.

# బాలల సంక్షేమం మన ధ్యేయం

**1979** సంవత్సరాన్ని అంతర్జాతీయ బాలల సంవత్సరంగా జరుపుకుంటున్నాం. ఈ సంవత్సరం మన రాష్ట్రంలో బాలల సంక్షేమానికి యింతక్రితమే ప్రవేశపెట్టిన పథకాలను మరింత శ్రద్ధతో అమలు జరపడంతోపాటు, అనేక కొత్త పథకాలనుకూడ చేపడతారు.

అదిలాబాదు, అనంతపురం జిల్లాలలో రెండుబ్లాకులలో బాలల సమగ్రాభివృద్ధి సేవా పథకాన్ని అమలు జరుపుతున్నారు. ఈ పథకం క్రింద పౌష్టికాహారాన్ని సమకూర్చడం, విద్యావకాశాలు కల్పించడం ఆరోగ్యాన్ని మెరుగుపరచడం, వినోద సౌకర్యాలు కల్పించడంవంటి కార్యక్రమాలు అమలుజరుపుతారు.

**1978-79** సంవత్సరంలో తూర్పుగోదావరి, వరంగల్లు కృష్ణా, కర్నూలు జిల్లాలలోని మరో నాలుగు బ్లాకులలో ఈ పథకాన్ని చేపట్టడం జరిగింది. అంతర్జాతీయ బాలల సంవత్సరంలో విశాఖపట్నం, చిత్తూరు, మెదకు జిల్లాలలోని మరో మూడు బ్లాకులలో ఈ పథకాన్ని అమలు జరుపుతారు.

*సమాచార, పౌరసంబంధశాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం హైదరాబాదు*

43/78-79



# జన్మదినం

## "సాంధ్యశ్రీ"

### 1

నమస్కారం
ఇది నాకు పుట్టుకతో సంక్రమించిన
పూర్వజన్మ సంస్కారం ...
ఆడంబరంగా కాకపోయినా
ఉన్నంతలో ఉన్నతంగానే
నేను చేసుకునే పుట్టినరోజువేడుక ...
ఇలానే ప్రతివర్షం నాకు వాడుక ...
ఇనబింబం స్వచ్ఛంగా — స్వేచ్ఛగా
ఉదయించక పూర్వం
నేను గర్భస్థశిశువుగా — నమస్క్రియలో ...
క్షణాల -- గంటల సంకుల సమరంలో
సర్వాంగీకారంగా — ఉద్భవించాను,
సరిగా ఇదేరోజున ... !

చరిత్ర శిఖరంపై
వెల్లువ వేడినుండి
శ్రావణోదయం ...
అహింసావ్రతుల
ఆశయ సిద్ధితో
రిరంసోదయం ...

వర్తమానాభ్యుదయంలో గతాన్ని తలచటం
ఘోర నేరమైనా
తలుచుకోక తప్పటంలేదు,
తప్పుకోవటానికి మనసొప్పటంలేదు ...
ముప్పై ఏళ్ల నిర్భర వయఃపరిపాకంతో
ప్రౌఢగా విలసిల్లే
నా స్వరాజ్యలక్ష్మికి
సరిగా నా ఈడే...!

నేను ఏదిశలో ఎంతవేగంగా పురోగమించానో
నాదేశమే వీక్షి
నాదేశం ఏదిశగా ఎంతవేగంగా పురోగమించిందో
నేనే సాక్షి ...
ఔను ...,
మసక ప్రభాతాన్ని మనోహరంగా చిత్రించిన
ఒక కాంతిచ్ఛట
తూర్పు సూర్యుణ్ణి ప్రజలకు పంచిపెట్టింది ...
కాశ్మీరంలో రాహువు
కన్యాకుమారిలో కేతువు
సహపంక్తిలో కూర్చున్నగురుతు ...
ఇప్పటికీ
ప్రజల్లో కలసినా గురిపెట్టి దేశం గుండెలోనే ...
ఏదోమార్పు
ఏదోశాంతి
ఏదో ఊరట
ఏదో కొత్తఊపిరి ...
ఇది నా బహిర్లోకాలోకనం
ఇక నా అంతర్లోకావలోకనం ... !

### 2

ఇప్పుడు నన్ను నేనే పాలించుకుంటున్నాను ...
నేనే రాజును..., నేనే ప్రజను...
నేనే స్వరాన్ని — నేనే సర్వాన్ని...!
నా గొంతునాది — నా పాట నాది ....
గగన గళం నన్ను తన గందరగోళ వృత్తంలో
బంధించలేదు ... !
పంజరం వీడిన పావురాయిని —
నవయుగ ప్రాచీరేఖమీద
తొలిగా ఉదయించిన సూర్యుని కలికి తురాయిని ...
ఈ ఉషస్సులో —
తొలిస్నానం చేసిన మానవుణ్ణి —
ఈ సమీచీన గానంలో స్వేచ్ఛగాక మరేమిటి ధ్వనిస్తుంది...?
నేను సాదావాడినైనా — కించిత్ భేదం...
కైత కవుగిండ్లు
పాలిండ్లుగా పెరిగాను ...

స్వాతంత్ర్యంతో పుట్టానేమో,
సారస్వత లేఖిని కుచ్ఛాల నలంకరించుకొని
చిత్రవర్ణ వివహంతో చిందులు త్రొక్కుతూ
కావ్య చికీర్షతో చేతికొచ్చింది ... !
మసక మసకగా వెలుతురు కోలాహలం

బహుశా
బాధలోంచి సృష్టి బయలుదేరిన సంకేతంకావచ్చు ...
నేను ద్రష్టనౌతున్న తొలియాగంలో
నాకు సిద్ధించిన దార్శినక అనుభూతికి పూర్వరంగంకావచ్చు...
మూడోకంటికి మాత్రమే కనిపించే
తాత్త్విక స్వరూప సంరంభానికి ఆరంభావేశం కావచ్చు...
విరాట్ రూపానికి ప్రారంభసృష్టి
శుక్లశోణితబిందువు ఒక మాతృగర్భంలోచేసే కవితా
తపస్సు కావచ్చు ...

అనుభూతుల గుంపులోనుంచి
ఆవిర్భవించిన అఖండ సత్యదర్శన మదిగో
సాహితీ ప్రపంచమూలంలో
బ్రాహ్మీమయమూర్తి
నన్ను చేతిలోకి తీసుకొన్న స్పర్శ ...
మసక విడిపోయింది ...
మధ్యందిన మార్తాండుడు ఆవేశించాడు నన్ను ...
తెలిసింది సంస్కృతి–తెలిసింది సంప్రదాయం...
తాత ముత్తాతలనాటి ధనం [1]
జాతికి జీవనాళిక [2]
అకవితా మేఘ సూకరంపై
శతహ్రదావజ్ర నిర్ఘోషపాతం
సారస్వతం పులకించింది, తల్లిసరస్వతిమై మరచిపోయింది...!
ఇన్ని దశాబ్దులు ఆ క్షీరాబ్ధిలోనే మునకలు వేశాను...!

## 3

ఎన్ని మల్లెలు – ఎన్ని మొల్లలు – ఎన్ని కెమీలియాలు –
ఎన్ని లిల్లీలు...?
ఎక్కడిదీ సుమసురభిళం...?
ఎక్కడిదీ పూలజాతర–? అకవిత్వ దుర్వాయువులను
చెదరగొట్టిన
సంజీవి పరిమళం...? ఎక్కడిదీ సుమసురభిళం...?
దృశ్యంగా మాత్రమే వున్నతోటలోకి ఒక కోయిలపాట
ఏ జేబుల్లో ఏ జ్ఞాపకాలు వినిపించేపాట...?
బాధలు ఖాళీ చేసుకొచ్చిన గుండె మళ్లీ బాధల్ని ఆహ్వానించే
గాథ
ఎక్కడో–ఎక్కడెక్కడో–తిరిగిన దేశాలు నా పాదముద్రలు
తిరిగి నాకిచ్చివేసిన వ్యధ
ఇంద్రియాలను జయించి ఇంద్రియాల చేతిలో ఓడిపోయిన
జీవితడే వేదన ...
ఇన్ని ఉపనిషత్తుల సారాన్ని ద్రాక్షామధువుగా త్రాగిన మేధ
హరివిల్లు నుండి– రసరాజ్యాధినేతగా – దిగి
కవితా ఇక్షు కోదండ ధరేంద్రుడుగా–మొగి
ఈ చిన్న చేతిలో–రక్తరేఖ గుర్తుపెట్టిన స్పృహ ...
అప్పుడు వినిపించింది ఈ బృహదారణ్యంలో పక్షులుపాడే
ఋతుఘోష
అజస్ర వసంత భాష ...
ఈ విన్యాసాన్ని తిలకిస్తూ – అంబర వీధిలో అందాల
తారలపై
ఆహ్వాన గీతలు రచిస్తూ–నా జన్మదినం ...

---

1, 2 శ్రీశ్రీగారి వాక్యాలు.



కుమారి కాత్యాయని విద్మహే

# ప్రజల మనిషి నవలా జీవితము

ఫ్యూడల్ పరిపాలనా వ్యవస్థకు వ్యతిరేకంగా తెలంగాణాలో నడచిన ప్రజాఉద్యమాలతోగానీ, ఆ ఉద్యమాలను ప్రతిఫలించే సాహిత్యంతోగానీ పరిచయం ఉన్నవాళ్ళకు వట్టికోట ఆళ్వారుస్వామి పేరు తప్పకుండా తెలిసి ఉంటుంది. వట్టికోట ఆళ్వారుస్వామి ప్రజల మనిషి. సమసమాజముయొక్క అవతరణాన్ని శీఘ్రతరం చేయటానికి కావలసిన ప్రజాచైతన్యాన్ని మేల్కొల్పటానికి అహర్నిశలూ అదేపనిగా ఆలోచిస్తూ అనేక రకాల కార్యక్రమాలను చేపట్టి చిత్తశుద్ధితో అమలుచేసిన అనుష్ఠాన వేదాంతి ఆళ్వారుస్వామి. అందుకే ఆయనను గురించి "ఆళ్వార్ అనేది ఒక మనిషి పేరుకాదు. అదొక జీవిత విధానం. వట్టి జీవిత విధానం మాత్రమేకాదు. సమైక్య జీవిత విధానం" అన్నారు ప్రజాకవి కాళోజి.

ఆళ్వారుస్వామి నల్లగొండ జిల్లాలోగల నకిరకల్లు సమీపంలో ఉన్న మాధవరం అనే మారుమూల గ్రామంలో 1915 నవంబరు 1వ తేదీన జన్మించారు. వారిది శ్రీ వైష్ణవ కుటుంబం. తల్లి సింహాద్రమ్మ. తండ్రి రామచంద్రాచార్యులు. ఇక ఈయన విద్యాభ్యాసం నకిరకల్లు సూర్యాపేటలలో శ్రీ కంచినేపల్లి సీతారామారావు దగ్గర కొంతకాలం సాగింది. తరువాత కందిబండ గ్రామంలోని నారపరాజు రాఘవరావుగారింటికి చేరుకొన్నారు. అక్కడ రాఘవరావుగారి సోదరులైన వెంకటేశ్వరరావుగారు ఆళ్వారుస్వామికి చక్కని దస్తూరి అలవరించారు. నారపరాజు సోదరులు తమ తండ్రి సీతారామారావుగారి పేర కందిబండలో ఏర్పరచిన గ్రంథాలయం ఆళ్వారుస్వామికి పత్రికా పరనాభిలాషను కలిగించింది. 1933 ప్రాంతంలో హైదరాబాదు వచ్చి గోల్కొండ పత్రిక కార్యాలయంలో ప్రూఫ్‌రీడరుగా చేరడం ఆయనకు లోకజ్ఞానం, సాహితీ పిపాస కలగటానికి కారణమైంది. కందిబండ, విజయవాడ, హైదరాబాదు—ఈ మూడింటిమధ్య తిరగడంలో తరువాతి రెండు మూడు సంవత్సరాల కాలంలో ఆళ్వారుస్వామి జీవితం స్థిరత్వాన్ని కనపరచకపోయినా ఆ కాలంలోనే అనేక వచన గ్రంథాలను చదవడం, ఇంగ్లీషును నేర్చుకోవడం, పుస్తకాలను, పత్రికలను కొనడం—ఈ మొదలైన మంచి లక్షణాలు ఆయనలో చోటుచేసుకున్నాయి. ఈ విధమైన జీవిత యాత్రలో ఆయన 'యశోదమ్మ' ను వివాహం చేసుకొని హైదరాబాదులో స్థిరపడడం ఆయన జీవితంలో గొప్ప మలుపుకు కారణమైంది. అప్పటినుండి ఆయన ఒక రాజకీయ చైతన్యం మూర్తి కట్టిన మూర్తి; దాని జాగృతికై విద్యావిజ్ఞాన వ్యాప్తికి నడుము కట్టిన సంకల్పశక్తి.

తెలంగాణా ప్రజాఉద్యమం భారతదేశ స్వాతంత్ర్య ఉద్యమ చరిత్రలో ఒక సువర్ణాధ్యాయం. తెలంగాణాలో నిజాం పాలన బ్రిటిషువారి అండదండలతో నిలబడింది. దానికి సంస్థానంలోని సగభాగాన్ని పంచుకొన్న దేశముఖులు జాగీర్దార్లువంటి ఫ్యూడల్ శక్తులు అండగా ఉన్నాయి. అందువల్ల తెలుగు సంస్కృతికి తెలుగుజాతికి తీరని ద్రోహం జరిగింది. అత్యధిక సంఖ్యాక ప్రజల భాషలైన తెలుగు, కన్నడం, మరాఠీలలో ప్రాథమిక విద్య గరిపే సౌకర్యంకూడా కరువైంది. చివరకు తమ మాతృభాషలో మాట్లాడుకోవడమే తెలుగు వారిని హాస్యాస్పదులనుగా చేసింది. హైదరాబాదులో 1922లో వివేకవర్ధనీ థియేటర్‌లో జరిగిన ఒక హిందూసాంఘిక సభలో ఒక వక్త తెలుగులో మాట్లాడబోగా సభ్యులంతా గేలిచేసి, గోలచేసి ఆయనను మాట్లాడనీయలేదు అయితే ఆ సంఘటన 'ఆంధ్రజనసంఘం' అవతరణకు దారి తీసి ఆంధ్రోద్యమానికి నాందీ వాచకం పలికింది. ఈ ఆంధ్ర జనకేంద్రసంఘం ఆధ్వర్యాన తెలుగు భాషా సంస్కృతుల పునరుజ్జీవనంకోసం ఫ్యూడల్ దురంతాలకు వ్యతిరేకంగా చెదురుమదురుగా సాగుతున్న ఉద్యమాలన్నీ ఏకోన్ముఖమయ్యాయి. 1930లో జోగిపేటలో ప్రథమాంధ్ర మహాసభ జరగడానికి దారితీశాయి. ఆ తరువాత ఆ సభలు ఏడాదికో రెండు మూడేండ్లకో—ఎప్పుడు అనుమతి దొరికితే అప్పుడు—జరుగుతుండేవి. ఈ విధంగా అప్పుడున్న ఆ నిజాం ప్రభుత్వం అవలంభిస్తున్న దుర్భర హింసాత్మక బానిసత్వాన్ని ప్రతిఘటించే ఈ ప్రజాచైతన్యం ప్రజ్వలించటానికి తాను సైతం సమిధ నొక్కటి ఆహుతిచ్చిన వ్యక్తి ఆళ్వారుస్వామి.

ముఖ్యంగా 1937లో మందుముల నరసింగరావుగారి అధ్యక్షతన నిజామాబాదులో జరిగిన ఆరవ ఆంధ్ర మహాసభలో లేవనెత్తబడిన భాషావివాదంలో అభివృద్ధిపక్షం ఆళ్వారుస్వామిని ఆకర్షించింది. తరువాత చిలుకూరులో రావి నారాయణరెడ్డిగారి అధ్యక్షతన జరిగిన ఎనిమిదవ ఆంధ్రమహాసభలో వచ్చిన సంస్కృతుల వివాదంలో కాళోజీ, కోదాటి నారాయణరావులకు అండగా నిలిచారు. ఈవిధంగా ఆంధ్రమహాసభల కార్యకలాపాలలో శ్రద్ధను చూపిస్తున్న ఆళ్వారుస్వామి 1942లో దేశమ తటా చెలరేగిన ఆందోళనలో కాంగ్రెసు వాదిగా సత్యాగ్రహం చేసారు. సికింద్రాబాదులో కారాగారవాసం కూడా చేసారు జైలునుండి వచ్చిన తరువాత ఆంధ్రమహాసభకు ఆర్గనైజరుగా పనిచేసారు. ఆ కాలంలో కమ్యూనిస్టు పార్టీ సభ్యుడుగా చేసింది. 1946లో నిర్బంధింపబడిన కమ్యూనిస్టులలో ఆళ్వారుస్వామి కూడా ఒకరు. సంగారెడ్డి, గుల్బర్గా, హైదరాబాదు, వరంగల్లు జైళ్ళలో డిటెన్యూగా కొంతకాలం ఉన్నారు. జైలు

నుండి విడుదల అయి వచ్చిన తరువాత కలిగిన అభిప్రాయ భేదాల వలన కమ్యూనిస్టు పార్టీకి రాజీనామా యిచ్చారు. కొంతకాలం రాజకీయాల జోలికిపోక రచనా వ్యాసంగంలోనూ, సాహిత్య ఉద్యమాలలోను కాలం గడుపుతూ ఉండి మరలా కమ్యూనిస్టుపార్టీలో చేరారు. 6–2–1961న హటాత్తుగా హృదయచలనం ఆగి మరణించారు. మొత్తానికి రష్యావిప్లవము, తద్వారా సంక్రమించిన కమ్యూనిస్టు పార్టీ భావాలు, జాతీయమైన స్వాతంత్ర్యోద్యమము, ప్రాంతీయమైన ఫ్యూడల్ వ్యవస్థ—ఇవన్నీ కలిసి వట్టికోట ఆళ్వారుస్వామి రాజకీయ వ్యక్తిత్వాన్ని మలచిపెట్టినవి.

ఈవిధమైన రాజకీయ చైతన్యంతో ప్రకాశించిన వట్టికోట ఆళ్వారుస్వామి గొప్ప రచయిత కూడా. జైళ్ళలో డిటెన్యూగా ఉన్న కాలంలో 'జైలు లోపల'అనే కథల సంపుటిని, 'ప్రజల మనిషి'అనే నవలను వ్రాసారు ఆ తరువాత 'గంగు' అనే నవలను కూడా రచించారు రచయితకంటే ముందుగా ఆళ్వారుస్వామిని విద్యావిజ్ఞానముల ప్రచారమును ఉద్యమంగా స్వీకరించిన వ్యక్తిగా చెప్పాలి దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి స్మారక చిహ్నంగా 1938 (బహుధాన్య)లో దేశోద్ధారక గ్రంధమాలను స్థాపించి కథలు, నాటికలు, గేయాలు, వ్యాసాలు, జీవితచరిత్రలు—మొదలైన విషయాలపై ఆంధ్రభాషలో గ్రంథాలను అచ్చువేసి మారుమూల ప్రాంతాలకు సైతం ఆ గ్రంథాలను స్వయంగా తీసుకువెళ్ళి అక్కడి ప్రజలకు వాటిని అందించి తద్వారా విద్యావిజ్ఞాన వ్యాప్తికి కృషిచేసిన వ్యక్తి ఆళ్వారుస్వామి· ఈ గ్రంధమాల రూపమున ఆళ్వారుస్వామిచేసిన ఆంధ్రభాషాసేవను మాడపాటి హనుమంతరావుపంతులు, సురవరం ప్రతాపరెడ్డి, కొండా వెంకటరంగారెడ్డి, మందుముల రామచంద్రారావు, అయ్యదేవర కాళేశ్వరరావు—మొదలైన ప్రముఖులు బహుధా ప్రశంసించారు. ఈ గ్రంధమాల ఏభై వరకు పుస్తకాలను ప్రచురించింది. 'తెలంగాణం', 'ప్రాచీన తెలంగాణం' అనే గ్రంథాలను ప్రచురించి స్వస్థానాభిమానమునకు ప్రేరణనిచ్చిన ఈ గ్రంధమాల 'గ్రంథాలయోద్యమము (సురవరం ప్రతాపరెడ్డి) 'సంస్థాన ప్రజల సమస్యలు' (డా॥భోగరాజు పట్టాభి సీతారామయ్య) మొదలైన గ్రంథాలను ప్రచురించి ప్రజలలో చైతన్యాన్ని పూరించింది.

ఆళ్వారుస్వామి సికింద్రాబాదు కింగ్స్ వే లో ఉన్న ఇమాం బావి వీధిలోని తమ స్వగృహంలో ఈ దేశోద్ధారక గ్రంధమాలతో పాటు ఒక సూచీ గ్రంథాలయాన్ని (రిఫరెన్స్ లైబ్రరీ) అభివృద్ధి చేయడానికి పథకంవేసి చాలా విలువైన పుస్తకాలను, పత్రికలను సంపాదించిపెట్టారు· విశ్వవిద్యాలయాల్లో పరిశోధనచేసే విద్యార్థులకు ఆ గ్రంథాలయం ఆనాడు ఎంతో ఉపయోగకారిగా ఉండేవి.

ఆళ్వారుస్వామి ప్రతి సంవత్సరం దేశోద్ధారక కాశీనాథుని వర్ధంతి జరిపి దేశం నుండి పండితులను విమర్శకులను పిలిపించి వారితో ఉపన్యాసాల నిప్పించి గ్రంధమాల ఉంది కాబట్టి వాటిని అచ్చు వేయించేవారు. అట్లా అచ్చువేసిన పుస్తకాలలో ప్రభాస ఒకటి. వానమామలై వరదాచార్యులుగారి పోతన అచ్చుకావటానికి ఈయన ఎంతగానో తోడ్పడ్డారు.

ఈ విధంగా ఆళ్వారుస్వామి దేశోద్ధారక గ్రంధమాల ద్వారా కొద్దివెలలో ప్రజల కవసరమైన విజ్ఞానమును ప్రసాదించు ఉత్తమ వచన గ్రంథాలను ప్రకటించారు. వట్టికోట ఆళ్వారుస్వామి జీవితంలో ప్రధానమైన భాగాలుగా కలిసిపోయిన ఈ రెండు ఉద్యమ చైతన్యాలు ఆయన 'ప్రజల మనిషి' నవలలో ప్రస్ఫుటమైనాయి.

# II

ఈ 'ప్రజల మనిషి' నవల 1939కి పూర్వం తెలంగాణాలో ఉన్న దుర్భర బానిసత్వాన్ని ప్రతిబింబిస్తూ అక్కడి ప్రజాచైతన్యం మేల్కొన్న క్రమాన్ని వివరిస్తున్నది. దీనిని తెలంగాణా ఉద్యమము యొక్క ప్రాథమిక దశను 'రికార్డు' చేసిన చారిత్రక నవలగా చెప్పవచ్చును.

'దిమ్మగూడెం' కేంద్రంగా అంత వరకు పెంపొందుతూ వస్తున్న ఫ్యూడల్ శక్తులకు ప్రతీకగా ఉన్న దొర 'రామ భూపాల్ రావు' పైన కంఠీరవం, కొమరయ్యలలో ప్రజా చైతన్యం మేల్కొని ప్రతిఘటించిన క్రమాన్ని ఈ నవల చక్కగా ప్రతిపాదిస్తున్నది. నవల గ్రామ దొరల దోపిడీని చిత్రించడంతో మొదలవుతున్నది. దిమ్మగూడెం రైతు కోటయ్య యింటి పాడి ఆవును – ఆవూరిదొర రామభూపాలరావు కూతురికిచ్చి అత్తవారింటికి పంపడం కోసమై — తనకు స్వాధీనం చెయ్యమని కోటయ్యకు ఆజ్ఞ జారీ చేసాడు. కోటయ్యలాంటి బడుగుజీవుల భూస్వాముల ఈ 'అక్రమవసూళ్ళ'కు చేయగలిగిందేమీ లేక, అలవాటు పడ్డారు. అందువలననే ఆ ఆవును గురించి అతడేమీ బాధపడలేదు. ప్రతిఘటిద్దామన్న ఆలోచనకే రాలేదు. కానీ దీనిని గురించిన ఆలోచన, ఆవేదన, ప్రతిఘటనోద్దేశం కోటయ్య కొడుకు కొమరయ్యలో తలెత్తడం మనకు కనిపిస్తుంది. దొరకు పంపడానికి తోటలో కూరలు తెంపుతున్న తండ్రిని చూచి 'మా అయ్యకు పిచ్చి లేశినట్టుంది. అన్నీ దొరకే కావాల్నట' (పు. 5) అని అనుకోవటంలో ఇది ప్రారంభమైంది.

''తెలంగాణాలో నాటి వెట్టిచాకిరి ఎలా ఉండేదో వట్టికోట ఆళ్వారుస్వామి వ్రాసిన 'ప్రజల మనిషి'నవలలో చక్కగా చిత్రితమై వుంది'' అన్నారు రావి నారాయణరెడ్డిగారు. దొర యింటికి చుట్టాలొస్తే విస్తళ్ళు కుట్టి యివ్వాల్సిన వెట్టిచాకిరి ఊళ్ళోని వైష్ణవ కుటుంబానిది. అందుకనే ఆండాళమ్మ ఆకులకోసం కొడుకు కంఠీరవాన్ని పంపించింది అక్కడ అతనికి కొమరయ్య జత అయినాడు. 'వాండ్లింటికి చుట్టాలొస్తే అంతా మనకే వచ్చిందే' (పు. 11) అన్నాడు ఆలోచనా ధోరణిలో కంఠీరవం. అప్పటివరకు కొనసాగుతూ వస్తున్న ఆ వ్యవస్థను గురించిన ప్రతిఘటనా లక్షణం కంఠీరవంలో ఆ విధంగా ప్రారంభమైంది.

ఈ విధంగా ఆళ్వారుస్వామి ఈ నవల ప్రారంభంలో అప్పుడున్న దోపిడి వ్యవస్థను చిత్రించి దానిని గురించిన నిరసన భావం

వెలిబుచ్చే ఆలోచనా ధోరణి, ప్రతిఘటనోద్దేశం — ఇవి పిల్లలలో రావటాన్ని చూపించుటలో అది ఆ పిల్లలతోపాటు పెరిగి పెద్దదయి ఆ వ్యవస్థను సమూలంగా నాశనం చెయ్యకపోదన్న విషయాన్ని సూచిస్తున్నారు.

ఆ రోజుల్లో భూమిమీద హక్కు భుక్తాలన్నీ దొరలవే కావడంచేత వారి నిరంకుశ ధోరణి ప్రజల శ్రమ జీవితాన్ని విపరీతంగా దోచేస్తుండేది. ఇది రఘునాథాచార్యుల ఉదంతంలోను, కొమరయ్య ఉదంతంలోను మనకు స్పష్టంగా గోచరిస్తుంది. తాను ఆహ్వానించిన మోహనాచార్యులను అవమానపరిచాడన్న మిషమీద రఘునాథాచార్యుల భుక్తికి సాధనంగాఉన్న భూమినుండి ఆయనను వెళ్ళగొట్టాడు. ఎప్పుడో ఊరువదిలిన వెంకటేశ్వరరావు పొలాన్ని కౌలు చేసుకొంటున్న కొమరయ్య జీవనాధారాన్ని — వెంకటేశ్వరరావు తనకా పొలం అమ్మినట్లుగా దొంగ కాగితాలను సృష్టించి — డేగలా తన్నుకుపోయినాడు రామభూపాలరావు. ఈవిధమైన దోపిడిని ఎదుర్కొనే ప్రజాచైతన్యం దిమ్మగూడెంలో నెమ్మది నెమ్మదిగా రూపు కట్టుకోవడం కనిపిస్తుంది. కొమరయ్య దొరను ఎదుర్కొనటానికి సంసిద్ధుడైనాడు. అతనిలో నాడు ప్రారంభమైన ఆ చైతన్యమే చివరికి అతనికి ఆ భూమిని స్వంతంచేసి పెట్టినది. ప్రజాచైతన్యం భూమిసమస్యతో ముడిపడిఉంటుందనే సిద్ధాంతాన్ని మనస్ఫూర్తిగా నమ్మిన పరిపూర్ణ కమ్యూనిస్టు ఉద్యమ కార్యకర్త ఆళ్వారుస్వామి ఈవిధంగా నవలలో భూమి సమస్యను సక్రమమైన విధానంలో ఎటువంటి అపోహలకు తావులేకుండా ప్రవేశపెట్టి చూపించారు.

తెలంగాణా ప్రజాఉద్యమంలో స్త్రీలు కూడ యధాశక్తిగా పాల్గొన్నారు. భూమి విషయంలో వాళ్ళు చాలా పట్టుదలగా వ్యవహరించారు. పాలకుర్తిలో చాకలి అయిలమ్మ, మిర్యాలగూడెం తాలూకాలోని ముకుందపురములో భర్త భూమికోసం మరణించినా తాను వెనుకంజ వేయక 'ఈ భూమినాది' అని తనహక్కును నిలబెట్టుకొన్న స్త్రీ—ఈ మొదలైనవారి నందరిని చూచిన వట్టికోట ఆళ్వారుస్వామి దొర—దొంగ కాగితాలను సృష్టించి — కొమరయ్య సాగుచేస్తున్న భూమిలో తాను అరక కట్టబోతే 'శివమెత్తిన దానిలాగా' అరకలను అడ్డంగా తిరిగిన అన్నమ్మ పాత్రను ఉద్రేకపూరితంగా సృష్టించారు. 'ఇక దున్నండి, నా ప్రాణం పోయినా మానె' అంటూ 'చూస్తగదా ఎట్ల దున్నుతరో' (పు. 69) అని సవాల్ చేసిన అన్నమ్మ తెలంగాణా వీరవనితలకు ప్రతిబింబంగా భాసిస్తున్నది.

'విజ్ఞాన వికాసము కలిగి వివేకవంతులైన ప్రజలుండడం ప్రతి ప్రభుత్వము గర్వించుటకును, ఆదేశము ప్రతిష్ట పొందుటకును కారణాలవుతాయి'' (P. 110) అనే అభిప్రాయం కలిగిన కంఠీరవం విజ్ఞాన వికాసాలకు వీలుకలిగించాలన్న ఉద్దేశంతో గ్రంథాలయం స్థాపించి దాని అభివృద్ధికి కృషిచేయడం నవలలో కనిపిస్తుంది. ఆ రోజుల్లో గ్రంథాలయాలు వార్షికోత్సవాలు జరుపుకొనటానికి ప్రభుత్వంనుండి అనుమతి పొందటానికై ఎన్ని అగచాట్లు పడవలసి వచ్చిందో ఈ నవల సమగ్రంగా చిత్రించి చూపింది.

కొమరయ్య కంఠీరవం ఆదేశం ప్రకారం దిమ్మగూడెంలో రాత్రి పాఠశాల, గ్రంథాలయము, భజన మొదలైన కార్యక్రమాలు నడపడానికై పరంధామయ్యను వెంటతీసుకొని వచ్చాడు. (పు.146) దిమ్మగూడెంలో ఆ విధంగా స్థాపించబడిన గ్రంథాలయంలో కార్యకర్తలు, నిరక్షరాస్యులైన, ప్రజలకోసం వార్తాపత్రికలను చదివి వినిపించడంద్వారానూ, ముఖ్యమైన వార్తలను కత్తిరించి అట్టలపైన అతికించి గ్రంథాలయం గోడలకు వేలాడదీయడం (పు.188) ద్వారానూ గ్రామీణులకు ప్రపంచ విజ్ఞానపు ద్వారాలను తెరిచారు.

పోతే 1920 నాటికి దేశవ్యాప్తంగా హరిజనులను క్రైస్తవులుగా మార్చటానికి ఎంత ప్రయత్నమైతే జరిగిందో అంత ప్రయత్నము 1935 నాటికి తెలంగాణాలో హరిజనులను ముస్లిములుగా చేయడానికి జరిగింది. నాటి సమాజంలోని ఈ స్థితిని వట్టికోట ఆళ్వారుస్వామి చక్కగా చిత్రించడంతోపాటు దానిని ప్రతిఘటించటానికి పూనుకొన్న కంఠీరవంవంటి నాయకులను కూడా చిత్రించడం జరిగింది.

తాత్కాలికంగా 'దిమ్మగూడెం'వరకూ ఏవో కొన్ని విజయాలను ప్రజలు సాధించినా అవి శాశ్వత ఫలితాలనిచ్చేవి, సార్వజనీనమైనవీ కావు. శాశ్వత ఫలితాలనిచ్చే విజయాలను పొందడానికి చక్కటి రాజకీయ విప్లవం ఎంతైనా అవసరం. అందుకనే 'కొమరయ్య' సంగతివరకు పరిమితం చేస్తే కంఠీరవం భూమి సమస్యకు సంబంధించిన పరిష్కారం కొంత చేసినట్లు చూపబడినప్పటికి సంపూర్ణ స్వతంత్రమైన దేశంలో ఈ సమస్యా పరిష్కారం చట్టబద్ధమూ, శాశ్వతమూ కాగలదని విశ్వసించడం వలననే 'కంఠీరవం' 'స్టేట్ కాంగ్రెసు' అవతరణను రెండు చేతులా ఆహ్వానించడం జరిగింది. తాను సన్నిహితులతో హైద్రాబాద్ నగరం చేరి సత్యాగ్రహం చేసి నిర్బంధితుడవుతాడు. దానితో నవల ముగుస్తుంది. ఈ ప్రజా విప్లవం ఇంతటితో ఆగేది కాదని, దిమ్మగూడెం సమస్య పరిష్కారం అయితే చాలదని, దేశవ్యాప్తంగా రావాల్సిన చైతన్యం ఉన్నదని గుర్తించి నిరూపించడమే ఈ నవల ఈ విధంగా ముగించబడడంలో గల పరమార్థం.

ఈవిధంగా మన దేశీయమైన సామాజిక పరిణామంలో పుట్టి, రచయితయొక్క ఉద్యమశీల లక్షణాన్ని తనకు జీవగర్రగా నిలుపుకొని అప్పుడప్పుడే రూపు కట్టుకొంటున్న ప్రజాప్రతిఘటనా చైతన్యానికి దర్పణం పట్టిన మంచి నవల వట్టికోట ఆళ్వారుస్వామిగారి 'ప్రజల మనిషి'.



# అసహ్యం

## శ్రీ ఐ. మోహనప్రసాద్

వగరు తీపి మీద మనసయి
ఉక్కలో పక్కన పంకాపెట్టుకొని
స్వాతంత్ర్యానంతర బందీ గీతాలనాలపిస్తూ
అనుకొంటాను కదా
I have become in myself
Part of great disgust
నేనిపుడు ప్రార్థనా పద్యాలు
పెదబాలశిక్ష ఎక్కాలబొక్కు
డానియల్ జోన్స్ శంకరాచార్య
కేట్ మిలెట్ ట్రాన్స్‌ఫర్మేషనల్ గ్రామర్
ఎన్ని చదవాలెన్ని చదవాలి !

* * *

దిగంతాల ఆవల
దిగంతాల బ్లేడుకోసిన
సున్నిసిత సుస్నేహ మధ్యన
ఆకుశాస్త్రజ్ఞుల ఆనందం
ఆర్ణవమై అంబరమై ఉన్నది.

చికాగో ట్యూబ్ రైళ్లలోచేసే ప్రయాణం
టెస్ట్‌ట్యూబ్ శిశుత్వం
వాషింగ్టన్ మాల్‌స్ట్రీట్ పశుత్వం
పశువును శిశువుగా
శిశువును క్రీస్తుగా
చేసే ప్రయత్నంలో పాపం
కవి ఎల్లపుడూ బలి పశువు.

ప్రమాదాన్నుంచి ప్రమోదాన్నిపొందే వాళ్లెపుడూ
యు. ఎస్. ఓ. లో ఒంటేలుకు పోసుకొనే
ప్రత్యేక గదికోసం తారట్లాడుతారు
పక్కనే పొటొమాక్ ప్రవహిస్తున్నా.

పిరమిడ్ల మధ్య
మం తిత పర్వతాలపైన
వీణావాదనం చేస్తున్న వివస్త్ర వాణిలా
విసుగులో విరామంలో
వివస్త్రంలో వైరాగ్యంలో
విమానంలో అవమానంలో
కేవలం కైవల్యంలో
ఎంత విమోహితులైరో
ఎంత అనాసక్తులైరో
దుస్పృహ అసహ్యంలో
దుఃఖ జ్వాలల్లో
కేశ కీలల్లో !
మాధ్యమిక స్థితినుంచి
శంకరుణ్ణించి తన్నుకొని బయటపడటం
స్ఖలనానంతరమే.

మియామీ బీచీనుంచి
మిరాండా మ్యోహోన్నుంచి
మనస్కరించి నమస్కరించి
వేటగాని వలలో రాలిపడిన రెక్కలచాపలా
స్ఖలించి
పునరపి పునరపి
కృష్ణానదీ జల స్తనాల స్నానాలుచేస్తూ
పెరీనియల్ ఫిలాసఫీ అర్ఘ్యాలు వొదుల్తూ
ప్రిమైవల్ పివోటల్ ఫీటల్
రహస్యాంతర్యాల్ని ప్రసవిస్తూ
ఆనందోత్సాహ కీర్తనలు చేస్తూ
పాడుకుంటూ సాగిపోయే
పాడెకవి పయోగమిది
యోగమిది.

* * *

ప్రస్తుతం అప్రస్తుతం
కాలం త్రికాలం
అంతరాల పదఘట్టన నర్తనలో
ఎచటికి పోతా వీ రాత్రి
రాజమహేంద్రవరంలో కుక్కను కరచిన రాత్రి !

పాడు పడిన బావిలో బైరాగి మూలిగే గొంతుక
కూలిపోయిన చర్చిలో కాలిపోయిన బైబిల్ పుస్తకం
గాలికి కొట్టుకపోయిన గానా జానా బజాల
ఖజానాల హవామహల్ కనుమరుగు దృశ్యాలు
అన్నీ ప్రస్తుత మప్రస్తుతవ్వు.

అంతర్యాల పదఘట్టన నృత్యసీమ
మనోంతరితజ్వాల ఊదా నిశి శశి
నిశిరాతిరి కాళ్లాకంకాళ పెల్విక్ గర్డిల్
పురాజన్మల పరా రహస్యాల కీర్తనల
ఆనంద భైరవి వాందోళ రాగాల
మృత్యోర్మా అమృతం గమయ
ఫ్లాండెస్టైన్ గీతాల
బాలగంగాధర తిలక్ భగవద్గీతాల
హోమర్ వర్జిల్ ప్రాచీన గావాల
నగ్నముని వొలిచిన శిశ్న శిఖరాగ్రాన
నిలిచిన ఆఫ్రికన్ దేశ శూన్యాల హైన్యాల
ఏ కృతికి ఏ కృతాగ్ని కీల దహించిందో కంటూ ఉంటాను
గుడ్డి కవుల వ్యామోహ పరవశ దృక్కుల్లోంచి.

*   *   *

ఆకాశ బాతుల కాళ్ళ విరక్కా తప్పదు
రాకాసి చేతులు నరక్కా తప్పదు.

ఫెరన్ హిల్ మీద నుంచున్నపుడు
ఆత్మచేసే చప్పుడు
మనో విహంగం విప్పుడు
వైఫల్యం చప్పుడు.

వైఫల్యాన్నుంచే విప్లవం.
ఆత్మహైన్యలోల్య బూతుల బుంగనుంచి
అధోజగత్ మనో సరోవరాన్నుంచి
ఉన్నతంగా ఉచ్చలా తన్నుకొచ్చిన
స్వేచ్ఛాగాన రుతి
స్వచ్ఛవచన సత్యఫలశ్రుతి ఏమంటే
ఈ సీమ
సుజలామ్మని సుఫలామ్మని మలయజ సీతలామ్మని
అమ్మి
నమ్మకు.

శ్రమ శక్తినీ
జీవ పరిణామాన్ని తెలుసుకో.

సారాబుడ్డి తెచ్చే సూరీడు
గ్లాస్కో లుంగీలో దాగిన గనోరియన్
మడత మంచాల లాడ్జింగ్‌లో ముడిచిన మొగలి మిన్నాగు
సోదర సోదరీ మణుల ఆశ్వాసాంత సిఫ్లిస్‌లు
డేరాలు గుడారాలు మిలిటరీ గుహాంతరాలు
ఏ పతనానికి
ఏ ఆకురాలు కాలానికి
ఏ అననుకూల పవనాలకు చిహ్నాలోకానీ
నేను చింతించి వగచి నిట్టూర్చి
లారీలా ఈడ్చి నెత్తురునాకి బొమికలు విదిల్చి
నేస్తం అంటానుకదా
ఈ అవస్థ వ్యవస్థ సమస్తం
దుస్సహం అసహ్యం.



# క్రియాశక్తి - విద్యారణ్య

[(1) క్రియాశక్తి — విద్యారణ్య. ఒందు కట్టు కథయ సమీక్ష. త. రా. సు. విద్యాశంకర ప్రకాశన, మైసూరు — 8, వెల : రూ. 2. (2) క్రియాశక్తి—విద్యారణ్య విమర్శ — ఆర్. చక్రవర్తి, 6, కాళిదాస రోడ్డు, మైసూరు-2. వెల: రూ. 5.]

విజయనగర సామ్రాజ్యస్థాపక ప్రేరేపకులు విద్యారణ్యులని సర్వజన విదితము. ఈ విద్యారణ్యులు పూర్వాశ్రమమున మాధవులను పేరుతో బుక్కరాయల యొద్ద మంత్రిగా నుండెనని, వీరికి సాయణుడు, భోగనాథుడు అను నిరువురు అన్మదమ్ములు కలరనియు అందు ముఖ్యముగా మాధవ సాయణులు చతుర్వేద భాష్య నిర్మాతలుగా ప్రసిద్ధి నొందిన విషయము కూడ పెద్ద లెరింగినదే.

'మాధవాచార్యుని గ్రంథము లందెచ్చటను విద్యారణ్యుడను నామము తన కున్నటులుగాని, విద్యారణ్యుని గ్రంథము లందెచ్చటను తనకు మాధవాచార్యుఁని నామమున్నటులగాని సూచింపబడి యుండలేదు.'

విద్యారణ్యుల పూర్వాశ్రమ నామము తెలిసినచో విజయ నగర సామ్రాజ్య ప్రేరకులెవరో చెప్పవచ్చును గదా! ఈ అంశముపై తొలుత కూలంకషముగా చర్చించినవారు కన్నడ ప్రసిద్ధవిమర్శకులు డా. ఎ. వెంకట సుబ్బయ్యగారు. ఆయన 1918 లో మిథిక్ సొసైటీ జర్నలులో (సం. VIII) 'రాజగురు క్రియాశక్తి' అను వ్యాసమును ప్రచురించిరి. అందు వారు విజయనగర సామ్రాజ్య స్థాపకుల రాజగురువు క్రియాశక్తియని, "it seems more correct to infer that Kriyasakti was known as Vidyaranya" (క్రియాశక్తే విద్యారణ్యులుగా విఖ్యాతి చెందిరని చెప్పుటయే సమంజసముగా నున్నట్లు సారాంశ) మని చెప్పి ఈ వాదమును లేవనెత్తిరి. అప్పటి నుండియు ఈ వాదము చిలికిచిలికి గాలివానయి నేటి కర్ణాట విద్వాంసులు మధ్య తీవ్ర రూపము దాల్చినది.

1974లో విద్యాభూషణ, విద్యావాచస్పతీత్యాది బిరుదాంకితులు శ్రీ టి ఎన్ మల్లప్పగారు బెంగుళూరు విశ్వవిద్యాలయము పక్షమున 'క్రియాశక్తి—విద్యారణ్య యను గ్రంథమును ప్రకటించి అందు క్రియాశక్తియే విద్యారణ్యులని వాదించిరి. ఆ వెనుక 1975లో ధార్వాడ కర్ణాటక విశ్వవిద్యాలయమువారు శ్రీ శాంతరసర్ అను విద్వాంసులచే 'బళ్ళారి జిల్లెయ శివశరణరు' అను విస్తరణోపన్యాసము నిప్పించి ఆ ఉపన్యాసమును పుస్తక రూపమున ప్రకటించిరి. శ్రీ శాంతరసరుగారు కూడ శ్రీ మల్లప్పగారి వాదమునకు మద్దతు నిచ్చుచు క్రియాశక్తియే విజయనగర సామ్రాజ్య సార్వభౌముల కులగురువు, రాజగురువు, స్థాపన ప్రేరేపకులు అని తమ అభిప్రాయమును వెలిబుచ్చిరి. ఈ రెండు విశ్వవిద్యాలయములవారు కాలాముఖ పాశుపత శైవాచారుడైన కాశీవిలాస క్రియాశక్తియే సామ్రాజ్య స్థాపన ప్రేరేపకుడను వాదమునకు ప్రామాణికతను, ప్రచారము చేకూర్చిరి.

అద్వైతానుయాయులు ఈ వాదమును అంగీకరించక దక్షిణామ్నాయ శృంగేరి శారదా పీఠాధిపతుల గురుపరంపరలోని విద్యారణ్యులే విజయనగర సామ్రాజ్య ప్రేరేపకుడను ప్రాచీన వాదమును సమర్థించుచు గ్రంథములను ప్రకటించిరి. వారిలో ముఖ్యులు శ్రీ ఆర్. చక్రవర్తిగారు. వీరు చిరకాలము మైసూరు ఆర్కియాలజీ ఇలాకాలో అసిస్టెంటుగా పనిచేసి ప్రస్తుతము విశ్రాంతి తీసుకొనుచున్నారు. వీరు "క్రియాశక్తి—విద్యారణ్య విమర్శ" యను గ్రంథమును కన్నడమున రచించి శ్రీ మల్లప్పగారి వాదములను ఖండించి శ్రీ శృంగేరి అద్వైత సిద్ధాంత మహాసంస్థానమునకుచెందిన విద్యారణ్యులు క్రియాశక్తి భిన్నమహాపురుషులని నిర్ణయించిరి. త. రా. సు. అనువారు కూడ ఇదే శీర్షికలో నొక గ్రంథమును ప్రకటించిరి. వీరి గ్రంథమున 19 అధ్యాయములును, 6 అనుబంధములు కలవు. శ్రీ విద్యారణ్యులు ఎవరు? శ్రీ చంద్రమౌళిలింగ, శ్రీ చక్ర, రత్నగర్భ గణపతి విచారము, కంచి, కుంభకోణ మఠ విచారము, సూత సంహిత, ఆంగీరస, భారద్వాజ మాధవుల విషయము, విద్యారణ్యుల శాసనములు, వీరశైవమతము ముఖ్యమైన అధ్యాయములు.

క్రియాశక్తి పాశుపత కాలాముఖుడు.* కాశ్మీర బ్రాహ్మణుడు. అభినవ గుప్తాచార్య సిద్ధాంత ప్రవర్తకుడు. శుద్ధశైవుడు. కాశ్మీర బ్రాహ్మణులు షికారుపుర తాలూకా బళ్లిగావములోని కేదార మఠమును స్థాపించి కర్ణాటమున పాశుపత మతమును విశేష ప్రచార మొనర్చిరి. బసవేశ్వరుడు, అతని అనుచరుల ప్రభావమువలన వీరందరు వీరశైవులలో కలిసిపోయిరి. 13, 14, 15 శతాబ్దములలో వీరి మఠములు కొన్ని నామమాత్రావశేషముగా నిలిచినవి. ఈ శుద్ధశైవులు శంకరుల అద్వైత సిద్ధాన్తానికి విరోధులు.

ఇక అద్వైత సిద్ధాంత ప్రచారార్థము శంకరులు భారత దేశమున నాలుగు దిక్కులలోను నాలుగు మఠములు స్థాపించిరి. అందు దక్షిణమున తుంగా నదీతీరమున శృంగగిరి యొకటి. ఇది యజుర్వేద ప్రధానమైన దక్షిణామ్నాయపీఠము. ఈ పీఠాధిపతులలో 12వ వారిగా విద్యారణ్యులు విలసిల్లిరి. వీరికాలము (1331-1386) ఈ విద్యారణ్యులే విజయనగర సామ్రాజ్య స్థాపకులని పరంపరాయాతముగా వచ్చుచున్న కథనము. దీనిని ఇదమిద్ధమని చెప్ప

* క్రియాశక్తిని గూర్చి డా. నేలటూరు వెంకటరమణయ్యగారు 'వాఙ్మయ వ్యాసమంజరి'లో చంద్రభూషణ క్రియాశక్తి అను వ్యాసమున చర్చించినారు.

టకు సమకాలీన ప్రమాణములు లేవు. కాని ఆ కాలమందలి శాసనములలో విద్యారణ్యుల పేరుకలదు. ఈ విద్యారణ్యులు పూర్వాశ్రమములో నెవరు? అనునదే కీలక సమస్య. బుక్కరాయల మంత్రి మాధవుడే సన్యసించి విద్యారణ్య నామము స్వీకరించెననునది లోక ప్రసిద్ధి. కాని ఆ కాలమున క్రియాశక్తి శిష్యుడొక మాధవుడు కలడు. ఈ ఇద్దరు మాధవులలో విద్యారణ్యు లెవరనునది రెండవ సమస్య. భారద్వాజ గోత్ర మాధవుడు బుక్కరాయల మంత్రి. సాయణ భోగనాథుల అన్న. పశ్చిమతీర ప్రాంతాధికారి సంగముని కొడుకగు మారప్పవద్ద మంత్రిగానున్న మాధవుడు ఆంగీరస గోత్రోద్భవుడు. ఒకరు భారద్వాజ మాధవులు, రెండవవారు ఆంగీరస మాధవులు. భారద్వాజ మాధవుడు జీవావధిని విద్యారణ్యుడని కొందరు చెప్పగా, ఆంగీరస గోత్రోద్భవుడు సూతసంహిత వ్యాఖ్యాన (తాత్పర్య దీపిక) కర్త మాధవుడు విద్యారణ్యుడని కొందరి వాదన. సూత సంహిత వ్యాఖ్యానమున ఆంగీరస మాధవుడు తన గురువైన కాశీవిలాస క్రియాశక్తిని స్తుతించినాడు. ఈ క్రియాశక్తి మధురా విజయ రచయిత్రి గంగాంబకు గురువే.

ఇది ఇట్లుండగా ఈ మాధవుల నిద్దరిని వదలి మరికొందరు క్రియాశక్తియే విద్యారణ్యుడని, ఆతని పేరనే విద్యాశంకర దేవాలయము స్థాపింపబడినదని చెప్పుచున్నారు.

ఈ అభిప్రాయములను ఖండించి శ్రీ చక్రవర్తిగారు విద్యారణ్యులు అద్వైతియని, కాలాముఖ పాశుపతానికి చెందినవాడు కాడని తమ వాదమును స్థాపించిరి. వీరిందు అనేక శాసన ప్రమాణములను జూపిరి. వీరశైవాభిమానములో శ్రీ మల్లప్పగారు క్రియాశక్తియే విద్యారణ్యుడని ప్రతిపాదించిన వాదమును సమూలముగా పెరికివేయుటకే ఈ గ్రంథమును శ్రీ చక్రవర్తిగారు రచించిరి. ఆ విషయమున కృతకృత్యులైరనియే చెప్పవచ్చును.

## విద్యారణ్య సమస్య - తెలుగువారు

విద్యారణ్యుని గూర్చిన చర్చలో కర్ణాటకుల కెంత ప్రమేయము కలదో తెలుగు వారికి కూడ అంత ప్రమేయము, ఉత్సాహము **కలదు.**

1. విద్యారణ్య చరిత్రమును వ్రాసిన ఆధునికులలో మొదటివారు గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారు. వారు దీనిని మంత్రిప్రగడ భుజంగరావుగారి మంజువాణి పత్రికలో ప్రకటించిరి. తరువాతి వారు శ్రీ వావిలాల శివావధానులుగారు. వీరిద్దరు అద్వైతులే కావున విద్యారణ్య సమస్యను అంతగా పట్టించుకొనలేదు.

2. 1908లో కొమర్రాజు వెంకటలక్ష్మణరావుగారు ''మాధవమంత్రి బుక్కరాయని కాలములోఁ బ్రఖ్యాతిఁ జెందిన మంత్రి పుంగవులలోను, దండనాయకులలోను ముఖ్యుఁడని చెప్పవలసి యున్నది. ఇతడును మాధవ విద్యారణ్యులును ఒక్కరేయని ఇదివఱకు వ్రాసిన గ్రంథకారులందఱును భ్రమపడిరి. వారిద్దరు భిన్న పురుషులు. మాధవ విద్యారణ్యులవారి తండ్రిపేరు మాయణుఁడు; గోత్రము భారద్వాజ గోత్రము. మంత్రి మాధవుని తండ్రిపేరు చౌండప్ప; గోత్ర మాంగీరసగోత్రము. మంత్రి మాధవుఁడు గౌడ బ్రాహ్మణుఁడు. మాధవ విద్యారణ్యులు ద్రావిడ బ్రాహ్మణులు... కాశీవిలాసుఁడను గురువుయొక్క బోధచే నితనికి శివభక్తి పట్టువడెను'' అని తమ మహమ్మదీయ మహాయుగమను గ్రంథములో వ్రాసియున్నారు. వీరి అభిప్రాయము ప్రకారము బుక్కరాజు మంత్రి మాధవుడు ఆంగీరస మాధవుడని తెలుచున్నది.

3. 1926 క్రోధన ఫాల్గుణమాస భారతిలో వేదభాష్యమును రచించిన సాయణులు నెల్లూరి జిల్లా కావలి తాలూకా బ్రాహ్మణ క్రాక అగ్రహారికుడని ప్రకటితమైనది. బ్రాహ్మణ క్రాక శాసనమును ఒంగోలు వెంకటరంగయ్యగారు పరిష్కరించిరి.

'యోభాష్య కృద్ధీమాన్ మాయణాచార్య నందనః
అసౌ శ్రీ సాయణాచార్యో భారద్వాజో యజుర్నిధిః
పద వాక్య ప్రమాణానాం ప్రధానం యాజుషాపదం'

అని బ్రాహ్మణ క్రాక శాసనము చెప్పుచున్నది. బహుశః ఇచ్చటనే స్థిమితముగా కూర్చొని వేద భాష్యమును వ్రాసెనేమో! ఏది ఏమయినను సాయణ మాధవుడే విద్యారణ్యుడైనచో నాతడు మన తెలుగు దేశమున నొక అగ్రహారికుడని మాత్రము చెప్పవచ్చును. సాయణుడు తెలుగు బ్రాహ్మణుడు కాడనియు, తెలుగువారిలో బోధాయన సూత్రులు లేరని లక్ష్మణరావుగారు మ. మ. య.లో స్పష్టము చేసి యున్నారు.

4. ఆ పిమ్మట నేలటూరి వెంకటరమణయ్యగారు విద్యానగర స్థాపకులను గురించి ప్రత్యేక గ్రంథమును నాంగ్లభాషలో వ్రాసియున్నారు. కల్లూరి వెంకట నారాయణరావుగారు కూడ విద్యారణ్య చరిత్రమును వ్రాసిరి.

5. తెలుగున విద్యారణ్య చరితమును తొలుత రచించినవారు కృష్ణరాయ విజయకర్త కుమార ధూర్జటి. ఇతడు క్రీ. శ. 1650–60 ప్రాంతమున కృష్ణరాయ విజయమును వ్రాసియందు—

''నరు లజ్ఞాన విమోహితాత్ములగుటన్ రక్షించగా నెంచి శం
కరుడే శంకరుడై విభేదమతముల్ ఖండించి వేదాంత శా
స్త్ర రహస్యస్థితి దెల్పగా నతడె విద్యారణ్యమూర్తిన్ జగ
ద్గురుడై తోచె దదీయ వైభవము లెందున్మెచ్చగా శక్యమే''
(కృ. రా. వి. 2–17)

6. ఈ కథ రాయవాచకమున పెంచి వ్రాయబడినది.

## ఆంగీరసమాధవుడే విద్యారణ్యుడు

క్రీ. శ. 1550 – 1600 మధ్య పట్టమెట్ట సోమనాథ సోమయాజి సూతసంహితను ఆంధ్రీకరించెను. గ్రంథావతారికలో

> "అట్టిదగు సూతసంహిత యాకలించి
> ప్రణుతమతి వేద వేదాంత భాష్యకర్త
> యతిఘనుండు విద్యారణ్య యతి యొనర్చె
> నాది తాత్పర్య దీపిక యనెడు టీక."

యనియు, "ఘనుడు విద్యారణ్యముని యేర్పరించిన తాత్పర్య దీపిక దారి కలిమి" యని సూత సంహితకు సంస్కృతమున 'తాత్పర్య దీపిక' యను వ్యాఖ్య రచించినవాడు విద్యారణ్యుడని చెప్పెను. కావి తాత్పర్యదీపిక వ్రాసినవారు ఆంగీరస మాధవుడు. కాశీవిలాస క్రియా శక్తి శిష్యుడు.

> శ్రీమత్కాశీ విలాసాఖ్య క్రియాశక్తీశ సేవినా
> శ్రీమత్ర్యంబక పాదాబ్జ సేవానిష్ణాత చేతసా।
> వేదశాస్త్ర ప్రతిష్ఠాతు శ్రీమన్మాధవ మంత్రిణా
> తాత్పర్యదీపికా సూత సంహితాయా విధీయతే॥

అని ఆంగీరస మాధవుడు దీనికి కర్తయని చెప్పుచుండగా తెలుగుకవి ఈతనినే విద్యారణ్యునిగా భావించెనో, ఆనాటి వ్రాత ప్రతులందు విద్యారణ్య నామమున్నదో చెప్పజాలము. బెంగుళూరునందు ముద్రిత మైన సూత సంహితలందు విద్యారణ్య నామమున్నదని శ్రీచక్రవర్తి గారు వ్రాసిరి. సూత సంహిత పాశుపతాది వ్రతములను శిరాధిక్య మును తెలుపు గ్రంధము. అద్వైతి విద్యారణ్యు డిట్టి గ్రంధము నకు కర్తయగు టెట్లు?

క్రీ. శ. 14వ శతాబ్దమున బుక్కరాయలచే పెంచుకలదిన్నె అగ్రహారముగా గొన్న

> *నాచన సోమనాధునితోబాటు
> విద్యాభిధాన నగరీ విజయోన్నత శాలినీ
> విద్యారణ్యకృతా తస్యాం రత్న సింహాసనే స్థితః

అని విద్యానగర సామ్రాజ్య ప్రేరకుడు విద్యారణ్యుడుగూడ పేర్కొన బడియున్నాడు.

## సాయణుడే విద్యారణ్యుడా ?

> బ్రాహ్మణ క్రాక శాసనమున
> "యోభాష్య కృద్ధీమాన్ ... ... ...
> ... .... .... .... శ్రీసాయణాచార్య
> పదవాక్య ప్రమాణానాం ప్రధానం యాజుషాం పదం"

అని సాయణుని పదవాక్య ప్రమాణత్వము, వేద భాష్య కర్తృత్వము పేర్కొనబడినవి. అతని తరువాత 50 సంవత్సరములకు చేంరపా చార్యుడు తన ప్రయోగ రత్నమాలలో ఈ పదవాక్య ప్రమాణమును, వేదార్థ విశదీకర్తృత్వమును విద్యారణ్యుల కంటగట్టినాడు. చౌండపాచార్యుడు ఈ విషయమును ఈ క్రింది శ్లోకములో చెప్పి యున్నాడు.

> 'పదవాక్య ప్రమాణానాం పారదృశ్వా మహామతిః
> సాంఖ్యయోగ రహస్యజ్ఞో బ్రహ్మవిద్యా పరాయణః
> వేదార్థ విశదీకర్తా వేద వేదాంగ పారవిత్
> విద్యారణ్యయతిః జ్ఞాత్వా శ్రౌత స్మార్త క్రియాపరః"
>
> (ప్రయోగ రత్నమాల)

బుక్కరాయలు మాధవమంత్రికి వేదభాష్య రచన సూచన చెయ్యగా నా పనిని మాధవుడు సాయణున కప్పగించినటుల, సాయ ణులే ఇతర పండిత సహాయములో నద్దానిని పూర్తిచేయుటయు జరిగినది. ఆనాటి నుండియే వేద భాష్యమునకు సాయణ భాష్య మనియేపేరు మాధవ భాష్యమని యెన్నడును నెవరును పేర్కొన లేదు. పైగా శృంగేరి యజుర్వేద ప్రధాన మఠము. బ్రాహ్మణ క్రాక శాసనములోని 'ప్రధానం యాజుషాం పదం' అను వాక్యము కూడ దీనిని సమర్ధించు చున్నది. ఈ విషయ మింకను బలవత్తర ప్రమాణమును కోరుతున్నది. సాయణుడే విద్యారణ్యుడైనచో సంతటిమహాయుడు తెలుగుదేశ మందొక అగ్రహారకుడై యుండుట తెలుగువారి మహద్భాగ్యము.

---

## నాచన సోమన కాలము :

* పెంచుకలదిన్నె శాసనములో కాలము తప్పుగాపడినది. దానిని సవరించు ప్రయత్నము కంటె బుక్కరాయల కాలములో, విజయనగర సామ్రాజ్యము విద్యారణ్యుని కృపవల్ల స్థాపితమైనదని పై శ్లోకమున స్పష్టముగా చెప్పబడియున్నది. బుక్కరాయలు 1355 నుండి 1377 వరకు రాజ్యపాలన మొనర్చెను. విద్యారణ్యుడు 1331లో సన్యసించి 1386లో సమాధిస్థితి నొందెను. విద్యానగరము 17–5–1336 తేదీన నిర్మితమైనది. కావున నాచన సోమన 1336 – 1377 మధ్యకాలమున బుక్కరాయలచే పెంచుకలదిన్నె గ్రామము గ్రహించెనని చెప్పవచ్చును. ఎర్రా ప్రెగడకు రెడ్డి రాజ్య స్థాపనతోను, నాచన సోమునికి విజయనగర రాజ్య స్థాపనతోను కాకతాళీయముగా సంబంధము కలిగినది. ఎర్రాప్రగడ ముందుగా హరివంశమును నాంధ్రీకరించుటచే సోమన తరువాత అదే గ్రంధమును వ్రాయుటచే దానికి ఉత్తర హరి వంశమని పేరు పెట్టెనేమో!

కళాప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావు

# ఉదయగీతం

## శ్రీ గుడిహాళం రఘునాథం

ఏ స్వప్నాల్లోనో ఈదుతున్న నేను
ఎప్పుడు చిక్కుకున్నానో తెలీదు
ఈ సుడిగుండం గుండెలో .

నిద్రిస్తున్న నా చైతన్యమంతా మేల్కొని
పోరాటం సాగిస్తోంది
బతుక్కోసం.

తన ఒరపిడిలో నలిపేకొద్దీ
ఆ గుండం
నన్ను
మరింత వికసింప జేస్తుంది.
తన తాళ్ళతో
నా అవయవాళ్ళి బంధించేకొద్దీ
నన్ను
మరింత పక్షిగా మారుస్తోంది.

నా ప్రాణాల్ని దిగలాగేకొద్దీ
మరింత జీవింపజేస్తుంది.

అందుకే నే నెప్పుడూ కోరుకుంటా
ఉదయాకాశంలో
కొండచిలువలా నోరుతెరచి
మింగేకొద్దీ
నాకు సమగ్రరూపాన్నిస్తున్న
సూర్యుడి సుడిగుండంలో చిక్కుకోవాలని !



# సమాధి బాధ

## శ్రీ నందిని సిధారెడ్డి

పెరికేసుకుందామని
కత్తి వెతుక్కునే లోపలే
ఆ కళ్లు నా రక్తంలో కణ సంయోగం చెందాయి.

కళ్లు 'స్ట్రా' లుగా సాగి
నన్ను పీల్చేస్తున్నాయో ...
కళ్లు విద్యుద్దంతాలుగా రూపరి
నన్ను పిచ్చివాణ్ని చేస్తున్నాయో ...
కళ్లు వాగులయి దూకి
నన్ను తెంచేస్తున్నాయో ...
తేలటంలేదు కానీ,
ఆ కళ్లు కలిసాక
నా గుండెలో సుడిగుండాలు మాత్రం మొలిచాయి.

ఇప్పుడు సమాధి కావటమంటే ఎంతకష్టం ?
నిర్బంధంలోంచే
స్వేచ్ఛ ఊరుతుంది.

మట్టిలోంచే నీరుపుడుతుంది.
సమాధి మమేకం లోనే
శక్తి బలపడుతుంది.

రోజూ సుఖాల రాపిడిలో ఒడితిరిగిపోయే
'దిండు'
ఇలా- విషాదంతో తడిసిపోవటం;
ఆల్కహాల్ తాగి నునుపెక్కే 'రోడ్డు' కూడా
ఇలా— రక్తంలో గిజగిజా తన్నుకోవటం;
సమాధి స్థితి కివతలే —

సమాధి నయనంలో ...
ఆలోచనేకాదు, అనుభవమేకాదు, దృశ్యమే
ప్రపంచమే కాదు

సర్వమూ సంలీనమయి
ఒకే బల్బుగా వెలుగుతాయి.
నేను కనిపెట్టానెప్పుడో —

బండకింద సమాధి అయిన డైనమైట్
నా భూమిలో ఒడి తిరుగుతున్న జలాల్ని
ఫౌంటెన్లుగా వికసింప జేస్తుంది.

భూతద్దం కింద
సమాధి అయిన 'సూర్యుడు' - అక్కడున్న
ప్రతివస్తువుని మంటగా పుష్పింపజేస్తాడు
మనిషిలో 'జలాలు' ఒడి తిరుగుతుంటాయనీ,
మనిషిలో 'సెగలు' మౌన యాతనపడుతుంటాయనీ,
చెప్పిన —

ఓ డైనమైట్ కన్నూ
ఓ సూర్యుడి కన్నూ
నన్ను సమాధి కానీ ముందు.
పుష్పించటం ఆతరువాత !

[ "వన్ ఫ్లూ ఓవర్ ఆన్ ది కక్కూస్ నెస్ట్" (సినిమా) లో 'నికెల్సన్' కళ్లు చూశాక ]

---

# మాతృ దేవత!

శ్రీ కె. అశోక్‌బాబు

అందరూ
ఆమె నయనాలలో
రుధిరం కురుస్తుంటుందని
ఆమె కరాళ దంష్ట్రయని
కాలనాగు నాలికలాంటి కరవాలం ధరించి
భీషణంగా హుంకరిస్తుంటుందని
పేర్కొంటుంటారు !

అందరూ
ఆమెను మృత్యుదేవతని
తమపాలిటి శనియని ఈసడిస్తుంటారు !

కాని నాకుమాత్రం
ఆమె నయనాలలో
నాకధునీ శీకరాలచెమ్మ

శ్రీ కె. కిశోర్‌బాబు

ఆమె కరాళదంష్ట్ర వదనంలో
స్నిగ్ధ మందస్మితం
గోచరిస్తుంటుంది !
ఆమె చంద్రహాసంలో, పలకరింతలో
నాకు చంద్రహాసమే కనిపిస్తుంటుంది !

ఆమెను మాతృదేవతగా
భావిస్తుంటాను !

వేదనలలో, రోదనలలో
బాధలలో బరువులలో—చిక్కి
సమస్యల సాగరంతో
మునకలేస్తున్న నా జీవితనౌకకు
ఆమె కర్ణధారిణి !

ఆమె హృదయం కర్కశ శిలామయంకాదు
శిరీష కుసుమపేశలం !

---

# కలగూరగంప

## పాకిస్తాన్ అంతులేని విషాదాంత కథానిక

భారతదేశాన్ని మతం పేరిట విభజన జరపాలనే మతోన్మాదుల వాదనను త్రోసిపుచ్చి మతం ఏనాటికిని ఒక రాష్ట్రపునాది కాజాలదని 'పాకిస్థాన్ ఇస్లామిక్ రాష్ట్రం' ఒక మిథ్య అని, ఇప్పటికి కాకుంటే ఎప్పటికైనా, ముస్లిమ్ నాయకులు తమ పొరపాటు గ్రహించగలరని దూరదృష్టిగల జాతీయ నాయకుడు నెహ్రూ ఒకప్పుడు పేర్కొన్నారు. అయితే ముస్లింలీగ్ నాయకులు, ఆంగ్లేయ సామ్రాజ్యవాదుల వలలోపడి, మాతృదేశ విభజనను కాంక్షించారు. (వాస్తవానికి, ఈ రాష్ట్రస్థాపనకు మూలకారకుడైన మహమ్మదాలి జిన్నాకు మతంపట్ల ఏ కోశానూ అభిమానం లేదు. ఇస్లాం విరుద్ధమైన త్రాగుడు, మొదలగునవి అతనికి సర్వసాధారణమైనవి. తన జీవితకాలంలో ఏ ఒక్కమారో, అతను మసీదును దర్శించింది. అతని ముఖ్య అంతరంగ స్నేహితులు ఎవరూ ముస్లిమ్‌లు కారు). ఒకప్పుడు ఈ రాష్ట్ర స్థాపనకు మతవిరోధులైన కమ్యూనిస్టులు ప్రోత్సాహమిచ్చారు. దానికి కారణం వారి అవక తవక అవగాహనే. కమ్యూనిస్టు సిద్ధాంతానికి మూలమైన "విభిన్న జాతులకు స్వయంపరిపాలన" అన్న అంశంక్రింద ఈ సమస్యను వీక్షించారే కానీ, మతోన్మాదులకు, సెక్యూలరిస్టులకు జరుగుతున్న సంఘర్షణలో విప్లవాత్మక దృక్పథంకల వారిని బలపఱచలేదు. దీనికి తగ్గట్టు పూర్వ పాకిస్థాన్‌లో ఈ సమస్య కలవారి లేమివారి ఘర్షణగా పరిణమించింది. (తూర్పు పాకిస్థాన్‌లో జమీన్దారులు హిందువులు. భూమిలేని కూలీలు ముస్లిమ్‌లు. కాబట్టి కమ్యూనిస్టుల అవగాహన కొద్దిగా సరిఅయినదేమో అనవొచ్చు. కానీ పశ్చిమ పాకిస్థాన్ దృశ్యంవేరు. అక్కడ పంజాబీ ముస్లిమ్‌లు భూస్వాములు. భూమిలేని కూలీలు ఎంతోమంది వెనుకబడ్డ హిందువులు. మొత్తానికి, ఈ విషయాన్ని సరిగ్గా అంచనా వేయడంలో కమ్యూనిస్టులు పప్పులో కాలేశారు.)

ఈ రాష్ట్ర నిర్మాణమే, 'భారత్ ద్వేష' అంశంక్రింద తయారైంది. పాశ్చాత్య భావాలలో ఆరితేరినవాడు, ప్రజాస్వామ్య సిద్ధాంతాలలో నమ్మకంవున్న జిన్నా చాలా రోజులు పరిపాలించలేకపోవడం ఆ దేశం మొదటి దురదృష్టం. (అసలు జిన్నాకు కాన్సర్ వుండేదట. ఆ రహస్యం తనకు, తన డాక్టర్‌కు తప్ప మరోరికి తెలీదు. తాను చాలారోజులు బ్రతుకనని, కాబట్టి తన జీవితకాలంలో ఒక రాష్ట్రపు నాయకుడు కావాలని, తనకు మతంపట్ల ప్రత్యేకంగా అభిమానం లేకపోయినా మతాన్ని ఒక ఆయుధంగా చేపట్టి రాజకీయ వ్యూహం పన్నారని కొందరి అభిప్రాయం.)

జిన్నా అనంతరం కేవలం కొద్ది కాలంమాత్రమే 'పార్శ్వ ప్రజాస్వామ్యం' పాకిస్థాన్‌ను పరిపాలించింది. (పార్శ్వ ప్రజాస్వామ్యం ఎందుకంటే, హిందువులకు సరిఅయిన రాజకీయ హక్కులు యివ్వబడలేదు. అసలు రాజ్యాంగం ప్రకారం మహమ్మదీయేతరులకు ఎన్నో పదవులకు ప్రవేశంలేదు. అయినప్పటికిని, ఎన్నికలు మొదలగు అంశాలు వున్నాయి కాబట్టి దాన్ని పార్శ్వ ప్రజాస్వామ్యం అని వ్యవహరించవొచ్చు). ఈ స్వల్పకాలంలోనే పాకిస్థాన్ పౌరులు ప్రజాస్వామ్యాన్ని అనుభవించింది. లియాకత్‌ఖాన్ హత్య తర్వాత వరుసగా మిలటరీ నియంతలు పాకిస్థాన్‌ను పరిపాలించారు. ఇప్పుడే అమెరికా ఆసియాలో కమ్యూనిజంను అంతం చేయాలన్న, ప్రణాళికక్రింద తయారైన మిలటరీ ఒప్పందంక్రింద, భారత ద్వేషంతో, అసూయతో రగులుచున్న క్రోధంలో ముందూ వెనుకా ఆలోచించక, అమెరికా సామ్రాజ్యవాదుల వలలో పడ్డారు. దీని ఫలితంగా పాకిస్థాన్‌కు కొద్దిగా ఆయుధ సాహాయ్యం లభించింది. అయితే పాకిస్థాన్ ఆర్థిక వ్యవస్థ పూర్తిగా చితికిపోయింది. పాకిస్థాన్ ఒక దివాల రాష్ట్రంగా తయారైంది. భారీ పరిశ్రమలు కానీ, వైజ్ఞానిక సాంకేతికాభివృద్ధి కాని జరుగలేదు. పారిశ్రామికీకరణం, వైజ్ఞానిక సాంకేతిక విప్లవం జరిగాలంటే, నాయకులలో ముందుచూపు అవసరం. తమ స్వార్థంకోసం, తమ దేశాన్ని విదేశాలకు తాకట్టు పెట్టిన మిలిటరీ నాయకులలో అటువంటి దృష్టి పూర్తిగా లోపించింది. దీనికి తగ్గట్టు వ్యవస్థలో మతాధికారులు, కేపిటలిస్టులు, అగ్రకులాలవారు పూర్తిగా ఆక్రమించి, తక్కినవారిని అణగద్రొక్కారు. విచక్షణ, వివేకం, తార్కికశక్తిగల విద్యాభివృద్ధికి అవకాశమే లేకపోయింది. పాకిస్థాన్ పౌరులను పశువులక్రింద జమకట్టి, వారికి అబద్ధాలతో కడుపునింపి, పాకిస్థాన్ రెండు నిమిషాలలో హిందూదేశాన్ని నశింపజేసి, ఇస్లామిక్ రాష్ట్ర స్థాపన జరుగగలదని, భారత్‌లోని ముస్లిమ్‌లు, పాకిస్థాన్ సేనలను ఆహ్వానించగలదని, కాకమ్మ కథలతో కాలం వెళ్ళబుచ్చారు. అయితే బాంగ్లాదేశ్ ఆవిర్భవం, పాకిస్థాన్ ఘోరపరాభవం, బలూచిస్థాన్ మరి యితర ప్రదేశాలలో పెరుగుతున్న అసంతృప్తి కొద్ది కొద్దిగా తమ ప్రభావాన్ని చూపుతున్న దక్షిణ పంక్తి శక్తులు పాకిస్థాన్‌లో ఒక రాజకీయ చైతన్యాన్ని రగిల్చింది. అందుకుతగ్గట్టు ప్రథమంగా మిలిటరీ నాయకుల బదులు ప్రజానాయకుడైన భుట్టో పాకిస్థాన్‌ను పరిపాలించసాగారు. ఎక్కడోవున్న అమెరికాకన్నా, దగ్గరలోవున్న భారతదేశమే తనకు సహాయంగా వుంటుందని, ధైర్యంగా మన దేశంతో మిత్రత్వ సంబంధాలు నెలకొల్పి, పాకిస్థాన్‌ను ప్రజాస్వామ్య పంథాలో నడిపించేందుకు యత్నించారు. కానీ, దేశంలోని మిలటరీ శక్తులు, మతోన్మాదశక్తులు మరలా చేతులు కలిపి, భుట్టోను కూలద్రోసి, తిరిగి దేశాన్ని వెనక్కు నడిపించాయి.

ప్రతిపక్షాలను దారుణంగా నలిపివేయడం, ప్రభుత్వ దురాచారాలను ఖండించిన పత్రికా రచయితలను వీధులలో పెట్టి కొరడాలతో బాదటంవంటి అనాగరిక చర్యలతో తాము ఇస్లామిక్ సిద్ధాంతాలను పునరుద్ధరిస్తామని పాకిస్థాన్ పరిపాలకులు చెప్పుతున్నారు.

అసలు లోసుగువేరు. పాకిస్థాన్ ఆర్థికస్థితి, మిలటరీ బలం, 1972 తరువాత పూర్తిగా క్షీణించింది. అటువంటప్పుడు ప్రజలను ఆ సమస్యలనుండి మరల్చడానికి ఈ మతోన్మాదాన్ని పాలకులు వాడుకొంటున్నారు. అసలు సమస్య, పాకిస్థాన్‌లో ప్రజాపరిపాలన లేకపోవడం. మిలటరీవారు ఎంత సమర్థులైనా, ప్రజల సమస్యలను అర్థంచేసుకొనే ఓపిక వారికివుండదు, అటు ప్రజలకు నిర్భయంగా తమ సమస్యలను విన్నవించేందుకు అవకాశమూ వుండదు. నిరంకుశత్వంతో, పరిపాలన సాగుతుంది. ఏ చిన్న విమర్శను కూడా సహించక, దాన్ని దేశద్రోహంక్రింద జమకట్టి పైశాచిక పరివర్తనం జరుపుతారు.

పాపం పాకిస్థానీయులకు ఈ విషాదగాథ అంతంకానట్లు కనపడుతుంది!

*డా మురళీధర*

# 'జగన్నాటకం'

సత్కవులైన ఒక పదిమంది ఆధునిక కవులను మనం ఎంచుకోవలసివస్తే అందులో శ్రీ నార్ల వేంకటేశ్వరరావు తప్పక వుండి తీరాలి. నార్ల వారికి పత్రికా సంపాదకుడిగా ఉన్నంత కీర్తి ఒక సుకవిగా లేకపోవడం తెలుగు గడ్డ దురదృష్టమే తప్ప అది నార్ల వారి దురదృష్టం కానేకాదు. "నార్లవారి మాట", "మావూరు", "జగన్నాటకం" వంటి ఉత్తమ కవితా సంపుటులను వెలువరించిన "మంచికవి" నార్ల. వారి కవితా ప్రాభవానికి నిదర్శనంగా ప్రస్తుతం వారి 'జగన్నాటకం' అనే గేయ సంపుటి మాత్రమే గ్రహింపబడినది.

'జగన్నాటకం' మొదటిసారిగా 1957 సంవత్సరములో ప్రచురింపబడినది. దానిలో నార్లవారు "పరిచయం" లో యిలా అన్నారు —

"కవిగా నన్ను మీకు ఈ గేయ సంపుటి పరిచయం చెయ్యాలి. అట్టి సంపుటిని మీకు పరిచయం చేయడానికి నేనెవరిని ?"

పరిచయమంతా కేవలం ఈ రెండు వాక్యాలే. ఇంతటి సూక్ష్మాతి సూక్ష్మమైన పరిచయం, యింతటి వినయమూ, అందులో ఇంతటి చమత్కారము సాధారణంగా మనకు అన్యుల కావ్యాలలో కనుపించవు. ఇతరుల చేతి పొగడ్తల పీఠికలు వారికి నసేమిరా గిట్టవని కూడా భావించవచ్చు.

నార్ల వారి కవిత్వానికి భాషా సౌందర్యం, భావసౌందర్యం— రెండు కన్నులు. ప్రతి ఖండికలోనూ మనకీ విషయం సుస్పష్టంగా తెలుస్తూనేవుంటుంది.

'మింట మెరిసే కొంటె చుక్కలు
కవులు చెప్పే కన్నెలైతే —

కన్నుగీరుటె తెన్నువాటికి,
వెక్కిరింతలె వెల్లువాటికి."

"నింగి త్రుళ్ళే నీలిమబ్బులు
కవులు చెప్పే కన్నెలైతే —

విరియ బోసిన కురులు వాటికి
వల్లమాలిన వగలు వాటికి."

నక్షత్రాలలోని మెరుపు, నీలి మబ్బులలోని వెలుగు...కన్నెలకు స్వంతమట. నక్షత్రాలు మనకు మినుకు మినుకు మంటున్నట్లు కనిపిస్తాయి. దీన్ని ఆధారంగా కవి నక్షత్రాలు కన్ను కొడుతున్నట్లుగా రమ్యంగా భావించడం జరిగింది. చుక్కల్ని కన్నెలుగా తలచటం కూడా బాగుంటుంది. ఎందుకంటే — 'కన్నె' అనే అర్థంలో కూడా మనం 'చుక్క' అనే పదాన్ని వ్యవహారంలో వుపయోగిస్తూనే వుంటాం. మబ్బులు వల్లగా వుంటాయి. కురులూఅంతే. మబ్బులు, కురులు...రెండూ గాలికి కదులుతున్నప్పుడు వాని అందం ఇనుమడించినట్లు అనిపిస్తుంది.

'శైశవ హృదయం' అనే బాల గేయంలో కవి చుక్కల్ని ఎలా భావించారో గమనార్హం.

"జేబు నిండుగ ఎన్ని చేర్చినా గాని
గోలికాయలు నీకు చాలనే లేద ?" అంటూ అమ్మ తన పిల్లవాణ్ణి ప్రశ్నిస్తే ఆ పిల్లవాడు అమాయకంగా

"చందమామకు—అమ్మ—ఎందుకైతేను
గోలికాయలు అన్ని కొండ నిండుగను" అంటూ తన సందేహంతో కూడిన సమాధానం చెప్తాడు. చుక్కల్ని గోలీలతో పోల్చటమే కాకుండా పసిపిల్లల మానసిక చిత్తవృత్తిని కూడ ఎంతో సహజంగా ఔచిత్యంతో వర్ణించగలిగారు నార్ల.

"వర్షం" గూర్చి ఎంత సుందరంగా చెప్పారో చూద్దాం.

"వర్షం వర్షం
చిట చిట, తట తట,
జోట జోట, ఇట వట
వర్షం, వర్షం

వర్షం వర్షం
గల గల, జల జల
పల పల, నీల నీల
వర్షం వర్షం

వర్షం వర్షం
దడ దడ, బడ బడ
గడ గడ, ఎడ నెడ
వర్షం వర్షం"

ఈ గేయాన్ని చదువుతుంటే వర్షం పడుతున్నట్లే అనిపిస్తుంది. దీన్ని తెలుగురాని వాడిక్కూడా చక్కగా చదివి వినిపిస్తే చదవటం వానపడుతున్నట్లుందని అంటాడని నా నమ్మకం. దీనిలో సందర్భానుసారంగా వుపయోగించిన ధ్వన్యనుకరణశబ్దాలవలన, అనుప్రాసల వలన సమర్థుడైన కవిచేతిలో భాషా సౌందర్యం ఎల్లప్పుడూ భావ సౌందర్యాభివృద్ధికే దోహదం చేస్తుందనే విషయం మనం గ్రహింపవచ్చు. వర్షం మట్టిమీద పడుతున్నపుడు వచ్చేధ్వని, గచ్చు నేల మీద పడేటప్పుడు వచ్చే శబ్దం, కాలువ నీళ్ళపై పడేటప్పుడు వినిపించే సంగీతం, రేకులపై పడ్డప్పుడు మ్రోతలు... ఇలా ఇవన్నీ ఒకటి కావు రకరకాల ధ్వన్యనుకరణాల్నిబట్టి మనకా యా ప్రదేశాలు మదిలో మెదిలి ఆనందాన్ని కల్గిస్తాయి.

నార్లవారి దృష్టిలో ప్రేమాధారం లేని బ్రతుకు భారం. ''అనురాగము కానరాని గృహమే శనిదేవత శయ్యాగారము.'' ఆశయే లోకం. ఆశయే నాకం. మృత్యువు నెరుగని సత్యమునేదో మానవులకివ్వాలని ఆయన ఆరాటం. నవ్వులే సృష్టికి నాందీ వచనమని వారి గట్టి విశ్వాసం. అంతమాత్రాన నవ్వుల తోటలలో తిరిగే నాగ్గులను పసికట్టలేని అజ్ఞాని కారాయన.

''వేణిపై అర
విచ్చినవ్వాడె
సన్నజాజికి
వన్నెలైనా, చిన్నెలైనా!...

పల్లె పల్లెను
చెల్లినవ్వాడె
నాదు పాటకు
మోదమైనా, మూల్యమైనా!''

ప్రజలాదరించేదే కవిత్వము. కొప్పులో పెట్టుకుంటేనే పూలు అందగిస్తాయి కుర్రవాళ్ళు దారినపోతూ మల్లెపూల దుకాణం సువాసనల్ని వెదజల్లుతున్నా ఆ దుకాణంవైపు చూడరు. పావలా మల్లెపూలైనా పడతి కొప్పులో ఉంటే, ఆ వచ్చే సువాసనలు కుర్రవాళ్ళనలా పట్టి నిలిపేస్తాయి. ఇది సహజం. అలాగే కవిత్వం కూడా బండ్లకొలది వ్రాసినంత మాత్రాన దానిని ప్రజలు పట్టించుకుంటారని లేదు. రాసినదెంత మాత్రమైనా ప్రజల హృదయాల కెక్కగలిగినప్పుడే అది మంచి కవిత్వం అవుతుంది.

''అల్ప పదముల ననల్పార్థ రచన'' క్కూడా నార్ల వారి గేయాలు తార్కాణాలు. ''ఆగస్టు – 15'' గూర్చి వ్రాస్తూ ఏమన్నారో చూడండి —

''కాల్వలు తీయక,
కష్టము చేయక
స్వరాజ్యనదియును
సత్ఫల మివ్వదు...''

''స్వరాజ్యనది'' యనే సమాసం అంతులేని భావంతో నిండి వున్నది. స్వరాజ్యం వచ్చిందిగదా అని తింటూ కూర్చుంటే దాని ప్రయోజనం కలకాలం వుండదు. ఆ స్వేచ్ఛను, సమభావాలను వివిధ రంగాలలోని ప్రతి మనిషికి అందుబాటులో వుండేట్లు చూడాలి. అందుకు నిరంతర కృషి జరగాలి. ఒక నది ప్రవహిస్తున్న దనుకుందాం. నది ప్రక్కనేవున్న చేను రైతుకైనా ఆ నీటిని సద్వినియోగం చేసుకొని పొలం పండించుకోవాలన్న ధ్యాస వుండాలి. ఆ తర్వాత...ఆ నది నుండి కాలువలు, పిల్ల కాలువలు తీసుకోవాలి. వరదలకవి గట్టు తెగిపోకుండా చూసుకోవాలి. సకాలంలో పొలమంతటా నీరు అందుబాటులోకి వచ్చేట్లు కృషిజరగాలి. ఈ భావాన్నంతా మనం మన స్వతంత్ర భారతదేశానికి అన్వయించుకొని కృషిచేస్తే ధన్యులం కాగలం. ''స్వరాజ్య నది'' యనే సమాసంలో ఇలా ఎంతో లోతైన భావం ఒదిగి వున్నది. ఆధునికులు కొందరు లోతు నెపంతో ఎవ్వరికీ అర్థంగాని మాయ కవిత్వంవ్రాసే కవులు ఈ విషయం గ్రహిస్తే సంతోషం.

నార్లవారి అనేక ఖండికలలో మనకు అగణిత అభ్యుదయ భావాలు బాగానే కనుపిస్తాయి. ''మాటల దివిటీలే పోటరి యీాటెలుగా దీటులేని నా పోరాటము చీకటిపై'' అని ఎలుగెత్తి చాటిన వారు నార్ల. వారి వూహలెంత సున్నితంగా కొత పెడతాయో మచ్చుకు కొన్ని ఉదాహరణలు చూపుతాను

1 ''కత్తికె కన్నుంటే
నెత్తురు చూడగనే
ఒళ్ళు తిరిగి ఉర్వికి
ఘల్లున పడునేమో!''

2 ''రూకకె నోరుంటే
వ్యాకుల చిత్తముతో
కొంపలు నా పేరిట
కూల్చకు మనునేమో!''

3 ''రొట్టెకె కాళ్ళుంటే
పట్టెడు మెతుకులకే
అల్లాడే దీనుల
ఇల్లు చేరునేమో!''

నార్లవారి ''జగన్నాటకం'' గూర్చి సి. నారాయణరెడ్డిగారు తమ పరిశోధనా గ్రంథంలో ఇలా వ్రాశారు–''నార్ల వెంకటేశ్వరరావు గారి 'జగన్నాటకం' వస్తు వైవిధ్యముగల ఖండ కావ్య సంపుటి. 'వెన్నెల' అన్న గేయములో వీరు వెన్నెలను 'మానవుని మంత్రించు వెన్నెల' యని ఉల్లేఖించిరి ఈ సంపుటిలో గల 'పిచ్చి వూహలు' వంటివి వస్తు నవ్యతగల గేయములు. 'ఇల్లాలు'ను 'మల్లెపూల గోపుర' మనుట సులలితమైన ఊహకు కొలమానముగా తీసికొనవచ్చును.''

నిట్టూర్పుకు, బిట్టూర్పుకు కాసులతో విలువెంతో కట్ట లేము. చిరునవ్వుకు, చెంగల్వకు మార్కెటు ధర చెప్పలేము. అలాగే నార్లవారి కవిత్వానికి కూడా వెలకట్టలే మనేది సత్యం. 'చీకటి గుండెలు చెదరిపోవగా వేకువపెట్టిన వెలుగుకేకలా' నార్లవారి కవిత సహృదయులకు దర్శన మిస్తుంది.

నార్లవారి కవిత్వంమీద **కూడా** చక్కని పరిశోధనను చేయ వచ్చుననే విషయం పరిశోధక మిత్రులకు సూచించటం నావ్యాసానికి ముఖ్యలక్ష్యం.

*శ్రీ రావి రంగారావు*

# శ్రీ కాళహస్తి జ్ఞాన ప్రసూనాంబికా నవరత్న మాలిక

'భారతి' 1978 నవంబరు సంచికలో ప్రకటితమైన "అపర మమ్మట శ్రీ వట్టిపల్లి నరకంఠీరవశాస్త్రి" అన్న శీర్షికతో డాక్టర్ కాశీభట్ట సేతు రామేశ్వరదత్తగారు వ్రాసిన వ్యాసమూ— ఆ వ్యాసంలో శాస్త్రిగారి రచన "శ్రీ జ్ఞానప్రసూనాంబికా నవరత్న మాలికాస్తుతి" గురించి తమకు తెలిసింది కొంత వ్రాయగా (48వ పుట) దాన్ని పురస్కరించుకుని శ్రీ దినకర్‌గారు వ్రాయగా 1978 డిశంబరు భారతి లేఖలలో ప్రకటితమైన "కృతజ్ఞతా ప్రకటన శూన్యం" అనే విమర్శనాలేఖ (70–71 పుటలు) శ్రీ దినకర్ గారి విమర్శాలేఖకు సమాధానంగా తిరిగి అదే శీర్షికతో డాక్టర్ దత్తగారు వ్రాయగా 1979 జనవరి 'భారతి'లో "కలగూర గంప"లో ప్రకటితమైన (69–70 పుటలు) విమర్శను చూచాను. నాకు తెలిసిన కొన్ని వాస్తవ విషయాలను ఈ విషయమై తెలియ జేస్తున్నాను.

డాక్టర్ దత్తగారు తమ విమర్శలలో సరియైన విషయ ములు వ్రాయకపోగా తొందరపాటు మాటలు **కూడా** వ్రాశారు. తమ పన్నెండవ యేటనే శ్రీ న. శాస్త్రిగారి నవరత్నమాలను తమ తండ్రిగారివల్ల కంఠస్తముగా నేర్చుకున్నట్లు వ్రాసి అంతకుముందే "ఒక సంవత్సరముపాటు తిరుపతిలోని గ్రంథాలయము లన్నింటినీ పరిశీలించి, కత్తెరపల్లె (శ్రీ న.శాస్త్రిగారి స్వగ్రామము) నెల్లూరు మొదలగు ప్రదేశములకేగి ఎన్నో **అపూర్వ** విషయములను గ్రంథము లను సేకరించిన నాకీ స్తుతిరత్నములు ఒక లెక్కకు రావుగదా"— అంటూ స్తుతిరత్నములు లెక్కలేకుండా తీసివేయదలచిన డాక్టర్ దత్తగారు తమ తొలి వ్యాసంలో శ్రీ జ్ఞానప్రసూనాంబికా నవరత్న మాలిక స్తుతి గురించి యెందుకు వ్రాశారో వారికే తెలియదేమో! అసలు ఈ స్తుతిరత్నాల గురించి వ్రాసిన వ్యాసభాగములోనే శాస్త్రి గారు "గొప్ప శ్రీవిద్యోపాసకులు" అని పేర్కొన్నారు. ఈ సంద ర్భంలో శ్రీకాళహస్తిలో శ్రీ జ్ఞానప్రసూనాంబికను శ్రీ న. శాస్త్రి గారు దర్శిస్తుండగా వారికొక భక్త్యావేశం కలిగినట్లు తత్ఫలితంగా ఈ శ్లోకాలను ఆసువుగా దైవసన్నిధిలో చెప్పినట్లు ఈ శ్లోకములు అతి ప్రౌఢములై శబ్దాలంకారములతో అలరారుతూ లయబద్ధ ముగా పాడే వారికి భక్తిభావాన్ని ప్రేరేపించి భక్తులకు ఈప్సి తార్థము లొసంగుతున్నట్లుకూడా వ్రాశారు. భక్త్యావేశంతో దైవ సన్నిధిలో భక్తులకు ఈప్సితార్థాలు కలిగించేట్లుగా శ్లోకాలు అవత రించినప్పుడు అవి ఒక లెక్కకురాని శ్లోకాలు ఏవిధంగా అవుతాయో తెలియదు. డాక్టర్ దత్తగారు తమ పన్నెండవ యేటనే ఈ నవరత్న మాలికను తమ తండ్రిగారు కారణంగా కంఠస్థం చేసినట్లు జన వరి 'భారతి'లో ప్రకటించారు. తమకు కంఠస్థాలైన ఈ భక్తి భావ శ్లోకములవల్ల డాక్టర్ దత్తగారి ఈప్సితార్థములు నెరవేరి ఉండవచ్చును. అటువంటి భక్తిభావ శ్లోకములను "ఒక లెక్కకు రావుగదా" అని చిన్నచూపు చూచుట డాక్టర్ దత్తగారికి తగిన పనికాదు. తమ మొదటివ్యాసంలోనే "ఇందు ప్రథమశ్లోకము పరిశీ లితము" అని వ్రాసి ఆ శ్లోకాన్నుదాహరించి యే విధమైన పరిశీ లనా చెయ్యకుండానే "ఇట్లు ప్రతి శ్లోకము శబ్దాడంబరముతోను, క్రమబద్ధమగు లయతోడను నొప్పుచున్నది" అని వ్రాశారు. ఒకవంక భక్త్యావేశంతో దైవ సన్నిధిలో అతిప్రౌఢములై శబ్దాలంకారాలతో అలరారుతూ లయబద్ధంగా పాడే వారికి భక్తి భావాన్ని ప్రేరేపించి భక్తులకు ఈప్సితార్థము లొసగుతున్నాయి అని అత్యంత సార్థకాలై శక్తివంతాలైన శ్లోకాలన్న అభిప్రాయాన్ని వ్యక్తీకరించి — మరొక వంక వెనువెంటనే "ప్రథమ శ్లోకమును పరిశీలితము" అని వ్రాసి యే పరిశీలనా చెయ్యకుండానే ప్రతిశ్లోకము శబ్దాడంబరముతోను క్రమబద్ధమగు లయతోడను ఒప్పుచున్నది అని డా. దత్తగారు వ్రాయడం స్వవచన వ్యాఘాతంగా ఉన్నది. "శబ్దాడంబర" శబ్దార్థం డా. దత్తగారు తెలుసుకుని ప్రయోగించివుంటే బాగుండేది. శ్రీ న. శాస్త్రిగారి శ్రీ జ్ఞానప్రసూనాంబికా నవరత్న శ్లోకములు "శ్రీ శృంగేరి పీఠాధిపతులు శ్రీ అభినవ విద్యాతీర్థస్వామివారి సన్ని ధిలో సమర్పించిన "శ్రీ శారదాంబికా నవరత్నమాలిక"గా శ్రీమాన్ కవిరాజ శిరోమణి—పండిత—దివి నరసింహాచార్యులు, అష్టావధాని రచియించినట్లు 1960 సెప్టెంబరు నెల ఆరాధన మాసపత్రికలో ప్రకటితమైన మాట వాస్తవం. ఆ తరువాత 1961 మార్చి ఆరాధనలో "శ్రీ శారదాంబికా నవరత్నమాలిక" అన్న శీర్షికతో ప్రత్యేకించి బోర్డరు కట్టి 15వ పుటలో — "పై శీర్షికతో 1960 సెప్టెంబరునెల ఆరాధనలో వెలువరించిన తొమ్మిది శ్లోకాలు శ్రీ దివి నరసింహాచార్యులుగారు తమ రచనగా మాకు పంపగా ప్రకటించినాము. ఆ తొమ్మిది శ్లోకములలోను 'కీటం వరాట—స్వర్గాపవర్గ' ఇత్యాదిగాగల శ్లోకద్వయముతప్ప తక్కిన శ్లోకములన్నియు కీర్తిశేషులు పండితకుల సార్వభౌమ, సకవికుల చూడామణి, వట్టిపల్లి నరకంఠీరవ శాస్త్రిగారు రచియించగా 'అభినవ వాసవదత్త' అను గ్రంథములో నలువది సంవత్సరములక్రిందట ముద్రితములైనవి. ఇవి శ్రీకాళహస్తి జ్ఞానప్రసూనాంబికా నవ రత్నమాలికగానే రచియించబడి లోగడ ముద్రితమైనవి. ఇట్టి అప హరణ ప్రక్రియకు లోనైన రచన ఆరాధనలో వెలువరించినందుకు విచారిస్తూ ఇటువంటి పొరపాట్లు జరగకుండా చూచి రచయితలు

మాతో సహకరించ ప్రార్థన''—అని ఎడిటర్‌గారు ప్రకటించారు. శ్రీ వ. శాస్త్రిగారి ''అభినవ వాసవదత్తా'' గ్రంథంలో 1920లో శ్రీకాళహస్తి నామ జ్ఞానప్రసూనాంబికా నవరత్న మాలిక శీర్షికతో ''కీటంవరాట—స్వర్గాపవర్గ'' అన్న శ్లోకాలు రెండు తప్ప మిగిలిన ఏడు శ్లోకాలూ అంటే—''శ్రీనాకనాథ—రాకాశశాంక—శ్రేణీభవత్—హృద్యానవద్య—హేలామదాకలిత — చండాపదానయుత — కంఠారవో ద్యత్''—అన్న శ్లోకాలు ప్రకటితమైనాయి. ఆ తరువాత ఇరవై నాలుగు సంవత్సరాలకు అంటే 1944లో వావిళ్ళవారు ప్రకటించిన శ్రీ బండేపల్లి శేషశాస్త్రిగారి శ్రీ నవరత్నమాలా మంజూషతో శ్రీ వ. శాస్త్రిగారి శ్రీ కాళహస్తి జ్ఞానప్రసూనాంబికా నవరత్న మాలిక మొత్తం తొమ్మిది శ్లోకాలూ అంటే ''కీటంవరాట—స్వర్గాపవర్గ'' అన్న రెండు శ్లోకాలతో సహా ముద్రితాలైనాయి. 1920లో ఏడు శ్లోకాలూ అభినవ వాసవదత్తా గ్రంథంలోనూ—1944లో శ్రీ నవరత్నమాలా మంజూషతో తొమ్మిదిశ్లోకాలూ 24 సంవత్సరాల తేడాతో ప్రకటింపబడడం చూడగా ఈ శ్లోకాలు శ్రీ వ. శాస్త్రిగారు రచించారనడంలో సందేహం కలుగదు గాని భక్త్యావేశంతో శ్రీ కాళహస్తిలో ఆశువుగా చెప్పారనడం సందేహాస్పదంగా కనిపిస్తున్నది. శ్రీ వ. శాస్త్రిగారి గ్రంథాలన్నీ చాలా శ్రమపడి సేకరించినట్లు, పరిశోధించినట్లు డా. దత్తగారు వ్రాశారు. శ్రీ వ.శాస్త్రిగారి రచన అభినవ వాసవదత్తా గ్రంథంలో 1920లో ముద్రితమైన శ్రీ జ్ఞానప్రసూనాంబికా నవరత్న మాలికా స్తుతిని చూడకపోవడం ఆశ్చర్యకరంగా వున్నది. అభినవ వాసవదత్త గురించి డాక్టర్ దత్తగారు నవంబరు 'భారతి'లో మూడవ గ్రంథంగా కొంత విషయం వ్రాశారు. ఆ గ్రంథంలోనే ప్రకటితమైన ఈ శ్లోకాల గురించి తెలియని డా.దత్తగారు 1944లో వావిళ్ళవారు ప్రకటించిన నవరత్నమాలను శ్రీ వట్టిపల్లి మల్లినాథశర్మగారి శంకర శతకం భూమికను చూచి వీటి చరిత్ర గురించి వ్రాసి శ్రీ దినకర్‌గారిని అజ్ఞానాంధకారంలో మునిగి వున్నారనడం హాస్యాస్పదంగా వున్నది. ఈ శ్లోకాల గురించి వావిళ్ళవారి ప్రచురణలవల్ల శంకర శతక భూమికవల్ల డాక్టర్ దత్తగారు తెలుసుకున్నట్లు కనపడుతున్నది గాని అభినవ వాసవదత్తా గ్రంథంతోపాటు 1920లో ఈ శ్లోకాలు ప్రకటితాలైనట్లు శ్రీ దినకర్‌గారివల్ల డా. దత్తగారికి తెలిసినా వారు మఱుగుపరచినట్లు కనపడుతున్నది. 1961 మార్చి ఆరాధన లోని ప్రకటన డా. దత్తగారు చూచి కూడా లేదా ఆ ప్రకటన గురించి శ్రీ దినకర్‌గారిద్వారా తెలుసుకుని కూడా శ్రీకాళహస్తి జ్ఞాన ప్రసూనాంబికా శ్లోకాలు అభినవ వాసవదత్తా గ్రంథంలో 1920లో ముద్రితమైనాయన్న సంగతి డా. దత్తగారు నవంబరు భారతిలో వ్రాయకపోవడం వాస్తవాన్ని మఱుగుపరచడమే కాగలదు

**విజయశ్రీ**

# మరికొన్ని వింతపేళ్ళు

శ్రీ వేదం వేంకటరామశాస్త్రిగారు 1979 ఫిబ్రవరి భారతిలో వ్రాసిన 'తెలుగు వారి వింతపేళ్ళు' అనే వ్యాసం చాలా ఆసక్తిని కలిగించేదిగా ఉంది. అందులో వారు తెలుగువారి చాలా చాలా పేళ్ళ పుట్టుపూర్వోత్తరాలను గుఱించి చక్కగా చర్చించారు. కాని ఎందుకో వింతగా కనిపిస్తూ, ఎంతగా ప్రయత్నించినా సామాన్యుడికి సులభంగా అర్థంకాని కొన్నిపేర్లు వారి వ్యాసంలో చోటు చేసుకోలేకపోయినాయి. అలాంటి కొన్ని వింతపేళ్ళను గుఱించి వివరించడమే ఈ రచన ఉద్దేశం.

మన తెలుగు భాషకు ప్రథమ కవయిత్రి తాళ్ళపాక తిమ్మక్క. సాహితీ సమరాంగణ సార్వభౌముడైన శ్రీకృష్ణదేవరాయలచేత 'అప్పాజీ' అని ఆప్యాయంగా పిలువబడుతున్న అమాత్యశేఖరుని నామధేయం తిమ్మరసు. అష్టదిగ్గజ కవులలో ఒకడై పెద్దనకన్న పూర్వమే ముద్దులు మూటగట్టు పలుకులతో పారిజాతాపహరణ ప్రబంధమును రచించిన మహాకవి ముక్కుతిమ్మన. తిమ్మయ్య, తిమ్మప్ప, తిమ్మారెడ్డి, తిమ్మరాజు మొదలగు పేర్లు తెలుగునాట వేలాది యేళ్ళుగా వెలసినవే. ఈ 'తిమ్మ' రూపాన్ని ప్రస్తుతం ధరించిన పేరి అసలురూపం ఏమై ఉండవచ్చునన్న విషయం ఆలోచిస్తే, ఇదికూడా ఆంధ్రుల ఆపదమొక్కుల దేవుడైన శ్రీ వేంకటేశ్వరునికి సంబంధించిందే అని తేలుతుంది. వేంకటేశ్వరుడు తిరుమలేశుడు. తిరుమల శబ్దము తెలుగువాళ్ళ నోళ్ళలో తిర్మల, తిమ్మల, తిమ్మగా క్రమేపిమారి చివరకు సులభంగా పలుకడానికీ, పిలువడానికీ వీలైన రెండక్షరాల తిమ్మశబ్దంగా నిలిచిపోయి ఉంటుందని అనుకోవచ్చు

తెనుగు కవుల్లో పేరెన్నిక గన్నవాళ్ళలో రావిపాటి త్రిపురాంతకదేవుడు కూడా ఒకడు. ఇతనినే మనం రావిపాటి తిప్పన్న అంటాం. తిప్పన్న శబ్దము త్రిపురాంతక శబ్దమునకు తెలుగు ప్రజలు తయారుచేసిన హ్రస్వరూపం. తిప్పరాజులూ, తిప్పయ్యలూ, తిప్పేస్వాములూ,తిప్పమ్మలూ—బసవేశ్వరుని వీరశైవం మతం వ్యాపించిన ఆంధ్ర కర్ణాటక రాష్ట్రాల్లో అక్కడక్కడ అప్పుడప్పుడు అగుపిస్తూంటారు.

అనంతపుర జిల్లాలో అక్కడక్కడ గుండప్పలూ, గుండాశాస్త్రులూ, గుండారావులూ, గుండాచార్యులూ తటస్థపడుతూ ఉంటారు. 'గుండమ్మ కథ' అనే సినిమా కూడా ఉన్నది. ఒక ఇంటిలో దంపతులకు కలిగిన పిల్లలందరూ వరుసగా చనిపోతూ వుండి, చివరకొకరు కూడా మిగులుతారో లేదో అనే అనుమానం కలిగితే, పుట్టిన బిడ్డ ఆయురారోగ్యాలతో గట్టిగా, ఉక్కుపిండంలా, పెద్ద గుండులా ఉండాలని ఆశిస్తూ, విశ్వసిస్తూ, గుండప్ప, గుండమ్మ, గుండాశాస్త్రి ఇత్యాది పేర్లు పెట్టడం అలవాటు. ఈ పేరు ఏ దేవునికీ సంబంధించినదైనట్లు తోచదు.

కవయిత్రి బండారు అచ్చమాంబ పేరు వినని సాహితీ పరులుండరు. అచ్చయ్యలనూ, అచ్చయ్యశాస్త్రులనూ, అచ్చమ్మలనూ మనం అక్కడక్కడ చూస్తూంటాము. ఈ నామధేయం అసలు రూపం అచ్యుత శబ్దమై ఉండవచ్చు. అచ్యుతయ్య, అచ్యుతమ్మలు కాలక్రమాన అచ్చుతయ్య, అచ్చయ్యలుగానూ, అచ్చుతమ్మ, అచ్చమ్మలుగానూ మారి ఉంటాయి.

శ్రీ శాస్త్రిగారు తమ వ్యాసంలో అక్కన్న మాదన్నల పేళ్ళ పుట్టుకను గురించి చెబుతూ, అక్కన్నకు తొలిరూపం అర్కన్న అనీ, మాదన్నకు తొలిరూపం మాధవన్న అనీ అన్నారు. మాదన్నతొలిరూపం మాధవన్న అనడం అంత సబబుగా లేదని నా మనవి. మన తెనుగు కవులలోని అష్టదిగ్గజములలో ఒకడు మాదయ్యగారి మల్లన్న. మల్లన్న అంటే శ్రీశైల మల్లికార్జునుడని కదా వారన్నది. మాదయ్యగారి మల్లన్న శైవుడు. అతని ఇంటిపేరు కూడా శైవశబ్ద భవమే అయి ఉండవచ్చుకదా. శివుడిని మనం మహాదేవుడంటాం. మహాదేవయ్య అనే పేరు మాదేవయ్యయ్యె, చివరకు మాదయ్యగా స్థిరపడి ఉంటుందని నా యూహ. కర్ణాటక రాష్ట్రములో వీరశైవు లెక్కువ. వాళ్ళలో మాదప్పలూ, మాదయ్యలూ, మాదేశ్వరులూ, మాదవ్వలూ ఎక్కడపడితే అక్కడ కనిపిస్తుంటారు. మనం తెనుగులో మహామంచి అనడాన్ని మామంచి అంటాము. మహాలక్ష్మి అనడాన్ని మాలచ్చిమి అంటాము. 'మహా'కు బదులుగా 'మా' వాడడం మనకు అలవాటే. కాన మహాదేవయ్య మాదేవయ్యగానై క్రమక్రమంగా ముచ్చటగా మూడక్షరాల పేరైన మాదయ్యగా మారి ఉంటుందని నా నమ్మిక.

మా పితామహిని మా పల్లెలో ప్రజలు 'ఎగ్గమ్మ' అని పిలుస్తూ ఉండేవారు. ఆ పేరు నాకు చిన్నతనంలో చాల వింతను సంతరించింది. అది ఏ దేవతపేరై ఉంటుందా అని చాలా దినాలు ఆలోచించాను. తరువాత తరువాత తెలిసింది నాకు ఆ పేరు 'యదుగిరియమ్మ' అను పేరి కుఱుచరూపమని. కర్ణాటకలో మేల్కోట అను వైష్ణవ క్షేత్రమున్నది మేల్కోటయందు తిరునారాయణస్వామి కొండపై వేంచేసి ఉన్నాడు. ఆ కొండను యదుగిరి అంటారు, తిరుపతికొండను తిరుమల, శేషగిరి అన్నట్లు. తిరుమలదేవి, శేషమ్మలలాగే ఏర్పడింది యదుగిరియమ్మ అనేపేరు కూడా. యదుగిరియమ్మ ప్రజల నాల్కలపై యదిగిరమ్మయ్యె తుట్టతుదకు ఎగ్గమ్మగా కుదించబడ్డది.

విజయనగర సామ్రాజ్య స్థాపకులైన హరిహర, బుక్కరాయల పేళ్ళలో హరిహరుని పేరు మామూలుగా అందరికీ అర్థమయ్యేదే కాని బుక్క శబ్ద మెక్కడిదో తెలిసిన పండితులు సెలవిత్తురుగాక.

*శ్రీ శంకరగంటి రంగాచార్యులు*

## విష్ణుకుండులు సుశబ్దము "విష్ణుకుండినులు" అపశబ్దము

'భారతి' ఫిబ్రవరి 1979 సంచికలోని "విష్ణుకుండినులు పుట్టుపూర్వోత్తరములు"అను వ్యాసమునందు "విష్ణుకుండినులు" అనుటకు శ్రీ కె. రామమోహనరావుగారు చేసిన ప్రతిపాదనలు చిత్రములు. చింత్యములు. ఆ ప్రతిపాదన లివి :

1. "నిజానికి విష్ణుకుణ్డిన్అనునది ద్రుతాంతమైనశబ్దము గానే గ్రహించాలి. నకారంబు ద్రుతంబు. ద్రుతమనగా అక్కఱ లేనిచో కరగిపోవునది అని నిర్వచనము."

ఇందు ద్రుత నిర్వచనము సరేగాని, "విష్ణుకుణ్డిన్" అను పది సంస్కృత శబ్దము. ద్రుతము తెనుగు వ్యాకరణ విషయము. సంస్కృత నకారము తెనుగు ద్రుతము కాదు. సంస్కృత భాష యందు ద్రుతము లేదు. ద్రుతము కేవలము ఆంధ్రభాషా విశేషము. కనుక "విష్ణుకుణ్డిన్" అనునది ద్రుతాంతమైన శబ్దముగా గ్రహింపరాదు. నకారాంతమైన శబ్దముగ, లేదా నాంతమైన శబ్దముగ, లేదా హలంతమైన శబ్దముగ గ్రహింపవలయును.

2. భాషా శాస్త్రము (Philology) ధ్వని సూత్రములు (Phonetic laws) ప్రకారం పరిశీలిస్తే ...

శాసనములలో వాడబడిన 'విష్ణుకుణ్డి' వంటి శబ్దముల స్వరూపము తులనాత్మక, చారిత్రక పద్ధతుల (Comparitive and Historical methods) ద్వారా మాత్రమే నిర్ణయించగలము ...

కనుక "విష్ణుకుండి" పదమునకు 'లు' వర్ణమునకు మధ్య "గ్లయిడింగ్ లెటర్" "ను" తప్పనిసరిగా చేరాలి.

ఇందు "విష్ణుకుండి పదమునకు" లు వర్ణమునకు మధ్య "ను" వర్ణము తప్పనిసరిగ చేరవలెననుటకు హేతువులు "ఫిలాలజీ,

ఫొనెటిక్‌లాస్, కంపేరిటివ్ ఎండ్ హిస్టారికల్ మెథడ్స్, గ్లయిడింగ్ లెటర్'' మొదలైన భాషాశాస్త్ర భేషజములు. అట్లు చేరిన అది భాషాశాస్త్ర నిబద్ధమగునేమోగాని, వ్యాకరణశాస్త్ర సంబద్ధము కాదు అంతేకాదు· వ్యవహార విరుద్ధము. తప్పనిసరిగ చేరు గ్లయిడింగ్ లెటర్ ''ను'' వర్ణము కాదు. ''ఉ'' వర్ణము. విష్ణుకుండి + లు → విష్ణుకుండి + ఉ + లు = విష్ణుకుండులు.

3. ''విష్ణుకుండులు అనటం ఎవరూ ఆమోదించరు.''

ఇందు విష్ణుకుండులు అను సలక్షణమైన రూపమును ఆమోదించనివారు ఎవరో? భాషాశాస్త్ర భిషక్కులా! — వ్యాకరణ శాస్త్రవేత్తలు ఆమోదింతురు. హరి + లు = హరులు; కరి + లు = కరులు; గుణి(న్) + లు = గుణులు; విష్ణుకుండి(న్) + లు=విష్ణుకుండులు అని బాలవ్యాకరణ మాత్ర పరిజ్ఞాతలకు బాహాటముగ తెలియు విషయము. భాషాశాస్త్రము ప్రకారము విష్ణుకుండి + లు= విష్ణుకుండినులు అయినచో, హరి + లు = హరినులు; కరి + లు = కరినులు; గుణి(న్) + లు = గుణినులు అగును. ఏవం విధమైన భాషాశాస్త్ర భేషజ వికారములను ఎవరు మాత్రము ఆమోదింతురు?

4. ''నకారాంతమయిన 'విష్ణుకుణ్డిన్' శబ్దము శాసనములలో 'న' కారము లేకుండ 'విష్ణుకుణ్డీనామ్, విష్ణుకుణ్డీకుల, విష్ణుకుణ్డి—కుల, విష్ణుకుణ్డినామ్, విష్ణుకుణ్డి—వాకాటక వంశ, విష్ణుకుణ్డి గోత్రోత్పభవస్య' అని వ్రాయడం జరిగి ఉండవచ్చు. అదీగాక 'విష్ణుకుణ్డీ' అని ఏకవచనంలో వాడబడినట్లు కనబడు తున్నది.''

ఇందు విష్ణుకుండిన్ శబ్దమును నకారము లేకుండ ''విష్ణుకుణ్డీకుల'' అని వ్రాయుట ఎట్లు జరిగియుండెనో? నకారము ఉన్నచో ''విష్ణుకుణ్డికుల, విష్ణుకుణ్డి వాకాటక వంశ, విష్ణుకుణ్డి గోత్రోత్పభవస్య'' అని కాక, ఎట్లు వ్రాయుదురో?—విష్ణుకుండి శబ్దము నకారాంతమైనను, ఇకారాంతమైనను ''విష్ణుకుణ్డికుల'' అను సమాసము సుసంగతము. నకారము ఉన్నను, లేకున్నను ''విష్ణుకుణ్డీకుల'' అను సమాసము అసంగతము. విష్ణుకుండి శబ్దము నకారాంతమైనను, ఇకారాంతమైనను విష్ణుకుండి వాకాటక వంశ, విష్ణుకుణ్డి గోత్రోత్పభవస్య అను సమాసములు సుసంగతములు. ఇకారాంతమైన ''విష్ణుకుణ్డినామ్'' అను రూపము నిష్పన్నము కాదు. నకారము లేకుండ ''విష్ణుకుణ్డినామ్'' అను రూపము నిష్పన్నము కాదు. ఇకారాంతమైన ''విష్ణుకుణ్డీనామ్'' అను రూపము, నకారాంతమైన 'విష్ణుకుణ్డినామ్' అను రూపము నిష్పన్నమగును. విష్ణుకుండి శబ్దము నకారాంతము కానిచో, ''విష్ణుకుణ్డీ''అను ఏకవచన రూపము ఏర్పడదు. కనుక నకారాంతమైన విష్ణుకుండి శబ్దము శాసనములలో నకారము లేకుండ వ్రాయుట జరిగియుండునను ఊహ అవిచార మూలము.

5. 'తెలుగులో విష్ణుకుండినులు అయితే ఆంగ్లంలో 'విష్ణుకుండిన్స్' అవుతుంది ... డాక్టర్ హాల్ట్జె, సూవెల్, డూబ్రియల్, కె. వి. లక్ష్మణరావు, గోపాలాచారి, వెంకటరమణయ్య మొదలయిన చరిత్రకారులు, పరిశోధకులు 'విష్ణుకుండిన్స్' (విష్ణుకుండిములు) అని అనడంలో తప్పు చేయలేదనే విషయం స్పష్టము.''

ఇందు తెలుగులో ''విష్ణుకుండినులు''అయిన, ఆంగ్లభాషలో ''విష్ణుకుండిన్స్'' అగునని కలదు· కాని ఆంగ్లభాషలోని ''విష్ణుకుండిన్స్'' ఆంధ్ర భాషలో ''విష్ణుకుండినులు'' అయినట్లు అవగాహకము. హాల్ట్జె, సూవెల్, డూబ్రియల్, గోపాలాచారి ప్రభృతులు తెలుగు భాషలోని ''విష్ణుకుండినులు'' అను వ్యవహారమును చూచి, ఆంగ్ల భాషలో ''విష్ణుకుండిన్స్'' అనుట కేవలము అసంభవము· కె.వి. లక్ష్మణరావు, వెంకటరమణయ్య మొదలైన తెలుగు చరిత్రకారులు, పరిశోధకులు ఆంగ్ల భాషలోని ''విష్ణుకుండిన్స్'' అను వ్యవహారమును చూచి, ఆంధ్ర భాషలో ''విష్ణుకుండినులు' అనుట సుసంభవము. అంతేకాదు. తెలుగు చరిత్రకారులు, పరిశోధకులు మాత్రమేగాక, పరమ ప్రామాణికులైన మల్లంపల్లి సోమశేఖర శర్మగారు 'విష్ణుకుండి వంశము, విష్ణుకుండి వంశజులు, విష్ణుకుండిరాజులు, విష్ణుకుండి రాజ్యకాల నిర్ణయము, విష్ణుకుండి మాధవవర్మ'' అనియే పేర్కొనుట అతిప్రసిద్ధము. (విజ్ఞాన సర్వస్వము మూడవ సంపుటము—పుటలు 115-120). వారు ''విష్ణుకుండినులు'' అయిన ''విష్ణుకుండిన వంశము, విష్ణుకుండిన వంశజులు, విష్ణుకుండిన రాజులు, విష్ణుకుండిన రాజ్యకాల నిర్ణయము, విష్ణుకుండిన మాధవవర్మ'' అని పేర్కొనవలయును. అట్లు పేర్కొనలేదు కనుక వారు ''విష్ణుకుండినులు'' కాక, ''విష్ణుకుండులని అర్థము. ''విష్ణుకుండిములు'' అనుకొన్న చిలుకూరి వీరభద్రరావుగారు ''విష్ణుకుండివవంశము, విష్ణుకుండిన మహారాజు'' అని పేర్కొనుట జరిగినది. (ఆంధ్రుల చరిత్రము—పూర్వయుగము-పుటలు 360–363) అది ప్రామాదికము.

అయిన విష్ణుకుండి శబ్దము నకారాంతమా? ఇకారాంతమా? అన్నది సమస్య.

గోవిందవర్మ తుమ్మలగూడెము శాసనములోని ''విష్ణుకుణ్డీనామ్'', విక్రమేంద్రవర్మ తుమ్మలగూడెము శాసనములోని ''విష్ణుకుణ్డీనామ్'' అను రూపములనుబట్టి విష్ణుకుండి శబ్దము ఇకారాంతము. విక్రమేంద్రవర్మ చిక్కుళ్ల శాసనములోని ''విష్ణుకుణ్డినామ్'', తుండి శాసనములోని ''విష్ణుకుణ్డినామ్' అను రూపములనుబట్టి విష్ణుకుండి శబ్దము నకారాంతము. ఇకారాంతముగ ''విష్ణుకుణ్డీనామ్''అను రూపములు గద్యరచనమున కలవు. విష్ణుకుండుల శాసనములందు హ్రస్వాక్షరములను దీర్ఘాక్షరములుగ చెక్కిన సందర్భములు కలవు. తుండి శాసనమున ''విష్ణుకుణ్డ్యన్వయ''—అని కలదు. విష్ణుకుండి + అన్వయ—అని పదచ్ఛేదము. అన్వయశబ్దము వినా ఆన్వయ శబ్దములేదు కనుక 'విష్ణుకుణ్డ్యన్వయ'' అను సుష్ఠురూపమునకు ''విష్ణుకుణ్డ్యాన్వయ''—అను శాసనరూపము లేఖకదోషము. హ్రస్వాక్షరము దీర్ఘాక్షరముగ చెక్క

బడినది. ఈ పూరు శాసనమున ''విష్ణుకు[ణ్ద్యధిరాజ]''– అని కలదు. విష్ణుకుణ్డి+అధిరాజ–అని పదచ్ఛేదము. అధిరాజశబ్దము వినా ఆధిరాజ శబ్దములేదు. కనుక''విష్ణుకు[ణ్ద్యధిరాజ]''–అను సుష్ఠురూపమునకు ''విష్ణుకు [ణ్ద్యధిరాజ]'' – అను శాసన రూపము లేఖక దోషము. హ్రస్వాక్షరము దీర్ఘాక్షరముగ చెక్కఁబడి నది. అంతేకాదు. తుమ్మలగూడెము శాసనమున ''విష్ణుకుణ్డి కుల'' - అని కలదు. విష్ణుకుండిశబ్దము నకారాంతమ్మైనను, ఇకారాంతమ్మైనను ఈ రూపము నిష్పన్నముకాదు. ''విష్ణుకుణ్డి కుల'' – అను రూపము నిష్పన్నమగును ఇతర శాసనములందు ''విష్ణుకుణ్డికుల''– అనియే కలదు. కనుక ''విష్ణుకుణ్డికుల''– అను సుష్ఠురూపమునకు ''విష్ణుకుణ్డికుల'' అను శాసనరూపము లేఖకదోషము. హ్రస్వాక్షరము దీర్ఘాక్షరముగ చెక్కఁబడినది. ఇట్టి లేఖకదోషములు శాసనములందు బహుళము. కాఁబట్టి ''విష్ణుకుణ్డినామ్'' అను శాసన రూపము లేఖక దోషముకావచ్చును. అయిన ''విష్ణుకుణ్డినామ్'' అను పాఠము సుష్ఠురూపము. కనుక విష్ణుకుండి శబ్దము నకారాంతము.

విష్ణుకుండిశబ్దము నకారాంతమ్మైనను, ఇకారాంతమ్మైనను ప్రాతిపదికము విష్ణుకుండి మాత్రమే. ''హలంతంబు ప్రథమైక వచనాంత తుల్యం బిందు నామంబగు'', ''ఇగ్నొరాయుగంతంబుల ప్రథమైక వచనంబునకు లోపంబగు'', అను బాలవ్యాకరణసూత్రములు అను సంధేయము. విష్ణుకుండి శబ్దము ఇకారాంతమ్మైన తెలుగు ప్రథమైక వచనరూపము విష్ణుకుండి. నకారాంతమ్మైనను విష్ణుకుండియే. గుణి, యశస్వి, కరి ఇత్యాదులవలె కనుక బహువచనరూపము విష్ణుకుండులు. కాఁబట్టి ''విష్ణుకుండినులు'' అను రూపము అపశబ్దమని, విష్ణుకుండులు అనురూపము సుశబ్దమని సుస్పష్టము.

*డా. కొర్లపాటి శ్రీరామమూర్తి*

# ఎవరు ప్రజాకవి!

ఏప్రిల్ 1979 భారతి కలగూరగంపలో శ్రీ ముడార్‌వేణు వ్రాసిన 'ప్రజాకవి ఎవరు?' చదివాను.

వారు వ్రాసినదాన్నిబట్టి ఆంధ్రజాతికి తెలిసిన కొత్త సంగతులు ఇవి.

1. వ్యవసాయం చేసుకుంటూ, ప్రజలమధ్య తిరుగుతూ, వాళ్ళ కష్టనష్టాలను గూర్చి కవిత చెప్పిన సుబ్బదాసుగారు ప్రజాకవి కాదు

సన్యసించి, లోకంలో దిగంబరంగా సంచరిస్తూ, ఆడవాళ్లని గదుల్లోపెట్టి బంధించమని చెప్పిన వేమన ప్రజాకవి.

జమీందారుల ఆశ్రయంలో బ్రతుకుతూ ఇంగ్లీషువాళ్లను పొగుడుతూ, ఊటీలో సంచరిస్తూ ఆంగ్లంలో వ్రాస్తూ, జమీందారు ఆదేశాన్ని అనుసరించి రచనలు చేసిన గురజాడ ప్రజాకవి.

2. దైవం ఉనికిని నమ్మేవాడు అజ్ఞాని. కాబట్టి సుబ్బదాసుగారు అజ్ఞాని.

వేలకొలది పద్యాల్లో భక్తిరీతిని గూర్చి భగవత్ స్వరూపాన్ని గూర్చి చెప్పిన వేమన అజ్ఞాని.

ఆస్తికుడైన గురజాడ అజ్ఞాని.

మొన్న ఈమధ్య జయప్రకాశ్ వ్యాధి నయం కావాలని అన్ని మతాలకు చెందినవాళ్ళూ ప్రార్థన చేశారు. వాళ్లంతా బుద్ధిలేని వాళ్ళు.

శంకరాచార్యుడు, ఏసుక్రీస్తు, మహమ్మదు, వివేకానందుడు, గాంధీ...అంతా బుద్ధి హీనులే.

ఏ ముడార్ వేణుగారు లాంటివాళ్లో మహాజ్ఞానులు.

3. అంటువ్యాధులు ప్రబలినప్పుడు ధైర్యం చెప్పడం తప్పు. మన దేశంలో, అందులో పల్నాడులో, వందసంవత్సరాలక్రిందట జీవించిన ఒక సామాన్యకవి అంటువ్యాధులు వచ్చిన వెంటనే ఫారిన్ పోయి వాక్సిన్ తెప్పించి టీకాలు వేయాలిగాని దైవప్రార్థన చెయ్యగూడదు; ధైర్యం చెప్పగూడదు.

4. కవి పని ఏమిటంటే ''ఒకడు ధనికుడు కావడానికి మరొకడు పేదవాడుగా మిగిలిపోవడానికి సామాజిక కారణాలు శాస్త్రీయంగా ప్రజలకు వివరించాలి''.

అంతేగాని కవిత్వంతో పనిలేదు.

5. వేణుగారి అభిప్రాయాలకు వ్యతిరేకంగా అభిప్రాయాలు ఎవరికైనా ఉంటే వాళ్లు అమాయకులు. వాళ్లని చూస్తే వారికి ఒకేసారి నవ్వూ, కోపమూ కలుగుతూ ఉంటాయి.

నవ్వూ కోపమూ కలిగి వారు ఏం చేయాలో తెలియక చాలా చిక్కుల్లో పడుతూవున్నట్లున్నారు. ఈ బాధకు విరుగుడు అల్లోపతీలోనూ, ఆయుర్వేదంలోనూ కూడా ఉన్నాయి. కానీ అంతకంటే సులభంగా ఈ మానసిక వైకల్యం పోవడానికి వేమన పద్యాలూ, గురజాడ రచనలూ పూర్తిగా చదవడం మేలైన మార్గం. అప్పుడు ''రాళ్లు దేవుళ్లయిన రాసులు మింగాలా'' అని తాము వ్రాసిన వాక్యంలో తప్పేమిటో వేణుగారికి తెలుస్తుంది; ప్రజాకవి అంటే ఏమిటో తెలుస్తుంది.

*శ్రీ పులిచెర్ల సాంబశివరావు*

# లేఖలు

## ''తెలుగు సామెత - సంస్కృతీకరణ''

'భారతి' – మార్చి 79 – భ్రాతృలేఖ :– గ్రంథవిమర్శలు, ''అంగీరస''గారు పేర్కొన్న సామెతపై నా సూచన :–

''కోళ్లను తిన్నవారుపోయి గొర్రెలను తినేవారు వచ్చా''రనే సామెత.

దానికి ''అజాశనాః పరం యాతా ఆగతా మహిషాశనాః'' అనేది బదులుగా వాడబడింది. అని ''ఆంగీరస''గారు విమర్శించారు. తెలుగు సామెత ఒక విధంగాఉంటే దానికి బదులుగా మరొక విధంగా ఆ సామెత సంస్కృతంలో చెప్పబడిందని విమర్శకుల అభిప్రాయ మైనట్లు తోస్తున్నది. ఇది రచయితయొక్క లోపంగా పేర్కొనబడి నట్లు అవుతున్నది.

తెలుగు సామెతను ''ఆంగీరస'' గారు తప్పుగా చూపించారని నా అభిప్రాయం. ''గొర్రెల్ని దినేవాడు బోతే బర్రెల్ని దినేవాడు వస్తాడు'' అనేది వాడుకలో ఉన్న సామెత. ఈ సామెత ప్రకారమే సంస్కృతీకరణ జరిగిందని నా సూచన. వాహినీవారి పెద్దమనుషులు సినిమాలో 'నందామయాగురుడ...'అనే పాటలో ఈ సామెత ఇట్లా వాడబడింది : ''గొర్రెల్ని దినువాడు గోవింద గొడతాడు—బర్రెల్ని దినువాడు వస్తాడయా —''

అయితే సంస్కృతంలో మేషి — మహిషి — అనే మాటలకు బదులు అజ — మహిష — శబ్దాలు వాడబడ్డాయి. అవేమంతగా పట్టించుకోదగ్గవి కావనుకొంటాము. తెలుగు సామెతలలో వచ్చే యతి ప్రాసల కూర్పు, ఇతర భాషలలోకి అనువదించేటప్పుడు రావాలంటే సామాన్యంగా కుదరదు.

*శ్రీ బండి నాగరాజు*

# ఇంతే సంగతులు - ఒకమాట

'భారతి' మార్చి 1979 సంచిక 'కలగూర గంప' లో శ్రీ ఆర్వియస్ సుందరంగారి లేఖకు శ్రీ నిడుదవోలు వేంక రావుగా రిచ్చిన సమాధానం 'అహమహమిక'తో యిచ్చినదే. శ్రీ సుందరం లేఖకు సాహిత్యంలో స్థానం లేదన్న వీరి లేఖ 'పరిశోధనా పరమేశ్వ రుల' స్థాయిలో లేదని చెప్పడానికి చింతిస్తున్నాము. శ్రీ సుందరం లేవనెత్తిన అంశాలకు సమాధానాలివ్వకుండా దాటవేయడం, లేఖలను 'పోస్టల్ ట్యూషన్'గా అభివర్ణించడం, వేంకటరావుగారికే చెల్లింది. ఈ పోస్టల్ ట్యూషన్ ''కలగూర గంప'కు కొత్తది కాదని శ్రీరావు గారికి బాగా తెలుసు. 'అన్నిటికీ ఒకటే జవాబు వ్రాస్తున్నాను' అన్నారు. ఏదా జవాబు. దాటవేయడమా? మౌనం అర్ధాంగీ కార మని ఒక లోకోక్తి. 'అంగీకరించినట్లనుకునే ప్రమాదం ఉందని' శ్రీ సుందరం అనడంలో తప్పేమీలేదు. చిత్రమేమిటంటే అభి ప్రాయ భేదా లేర్పడినంత మాత్రాన ఈ పండితుల దృష్టిలో శ్రీ సుందరం తెలుగువాడు కాకపోవడం. శ్రీ రావుగారి మాటలు చూడండి. 'భయపడకండి నేననుకోను మా తెలుగుదేశంలో ఎవరూ అనుకోరు.' నిన్న మొన్న తెలిసిడి తలుపులు తెరచుకున్న తెలుగువాడు కూడా ఫక్కున నవ్వుతాడి లేఖ చదివి. శ్రీ సుందరం తెలుగువాడు కాకుంటే వారణాసిలో ఉద్యోగిస్తున్న శ్రీ బయ్యా సూర్యనారాయణ గారు కూడా శ్రీ రావుగారి దృష్టిలో తెలుగువాడు కాడేమో! తమ అభిప్రాయాన్ని తెలుగు దేశానికి అంటగట్టడం శ్రీ నిడుదవోలు వారికి సమంజసము కాదు. సాహితీ విమర్శలో తలపండిన జ్ఞాన వృద్ధులే ఇంత సంకుచిత స్థాయికి దిగజారితే సాహిత్య సంస్కారానికి అర్థం ఏమిటి ?

*శ్రీ లింగంపల్లి రామచంద్ర*

# అరవ పదాలు

మార్చినెల భారతి 'గ్రంథ విమర్శలు' లో 'పరిష్కారం' కథల సంపుటిని విమర్శిస్తూ శ్రీ ఫాలాక్షుడు కడపటగా ఒకమాట వ్రాశారు. ''రచయితకు తమిళం వచ్చినంత మాత్రాన్ననేమో అడ మాన పత్రం (తనఖా పత్రం) కట్టుబడి (గిట్టుబాటు) అనే అరవ పదాలు దొర్లాలని లేదు.''

అడమాన పత్రం, కట్టుబడి అనే అరవ పదాలను రచయిత తమిళం వచ్చినట్లు తెలియజేయడానికి వాడాలని వాడినట్లు అర్థం వచ్చేటట్లుగా శ్రీ ఫాలాక్షుడు పేర్కొన్నారు. నిజానికి అవి ఈ ప్రాంతపు వాడుక పదాలు. వాయల్పాడు తాలూకాలో కూడా 'అడ మానం' వ్యావహారికంలోనిదే. ''ఇల్లు (లేక చేనో 'మడో'[మాగాణి]) అడమానంపెట్టి 'దుడ్డు' తెచ్చి 'పబ్బం' గడుపుకున్నాడు'' అం టూంటారు.

'తనఖా' పరభాషా పదం కాదా? 'తనఖా బ్యాంకుల' వల్ల దానికీనాడు ప్రాచుర్యం వచ్చింది కానీ పల్లె ప్రాంతాలలో వయసు మళ్ళిన వాళ్ళెందరు వాడుతున్నారా పదాన్ని?

దక్షిణాది భాషలకు మూల భాష ఒకటే వుండేదని భాషా శాస్త్రవేత్తలు, చరిత్రకారులు పేర్కొంటున్నారు. ఈ భాషల్లో ఎన్నో పదాలు ఒకదానిలో కొకటి మిళితమై ఉన్నాయి. ఇక సరి హద్దు ప్రాంతాలలో ఒక భాష ప్రభావం మరొక భాషపై అధికం గానే వుంటుంది.

ఈనాడు ఎందరో రచయితలు వారి వారి మాండలికాలను తమ రచనల్లో వాడుతున్నారు. మాండలిక పద ప్రయోగాలవల్ల ఒక ప్రాంతం వారి వ్యావహారికం మరొక ప్రాంతంవారు గ్రహించే వీలవుతుంది; భాషాశాస్త్రవేత్తల, చరిత్రకారుల దృష్టిలోపడ్డప్పుడు కొన్ని పదాలు — వ్యుత్పత్తి దృష్ట్యా కాని ప్రాచీనత దృష్ట్యాకాని విలువయినవయి వుండవచ్చు.

ఈమధ్య 'భారతి'లో మాండలిక పద ప్రయోగాల గురించి తర్జన భర్జనలు జరిగాయి కదా! వానిని ఉపయోగించకూడదా — ఒక ప్రాంతం వారికే పరిమితం అనే నిబంధన పెట్టుకుంటే 'మరీ పూరు' విమర్శలకు దిగజారిపోవడం కాదా! ఇటువంటివి విమర్శించే టప్పుడు ఆ ప్రాంతపు వ్యావహారికం అవునో కాదో నిర్దిష్టంగా గ్రహించి విమర్శించాలి కాని 'ఏమో' అనుకుంటూ ఔనో కాదో పూర్తిగా తెలియకుండా విమర్శించకపోతేనేమో!

మరొక విషయం. అసలు విమర్శకుడు వ్రాసిన ఆ వాక్య నిర్మాణము సరిగా లేదు. "తమిళం వచ్చినంత మాత్రాన్నవేమో... పదాలు దొర్లాలని లేదు." 'న'కు ఒత్తు ఇవ్వడం అచ్చుతప్పు అనుకున్నా 'ఏమో' అని ఎందుకు వాడినట్టో!

**శ్రీ అల్లీ రామకృష్ణ**

## ఎల్లయ్య - మరో అర్థం

ఫిబ్రవరి, 1979 'భారతి' లోని వేదం వేంకటరాయశాస్త్రి గారి "తెలుగు వారి వింత పేళ్ళు" అనే వ్యాసం ఆలోచనాత్మకంగా ఉంది. ఆ వ్యాసంలో వారు "ఎల్లమ్మ, ఎల్లయ్య...గ్రామదేవతలను బట్టి వచ్చియుండును" అని నిరూపించి "ఎల్ల = పొలిమేర" అనే అర్థం కూడ ఇచ్చారు. (పు. 42). బాగుంది! దీనికే మరో అర్థం చూడండి! ఎల్ల = అంతటికి; అయ్య; అమ్మ! సమస్తానికి అయ్య; అమ్మ! దేవుడు, దేవత అనే అర్థం వస్తుంది. తెలుగులో 'దేవుడు' అనే అర్థాన్ని బోధించే పదాల్లో ఇంత మంచి పదంలేదు.

**శ్రీ చేరెడ్డి మస్తాన్ రెడ్డి**

## అమ్మా, మా

ఫిబ్రవరి 1979 భారతిలో శ్రీ హెచ్. ఎస్. బ్రహ్మానంద గారు "మా" నుండి "అమ్మా" వచ్చి వుండవచ్చుననే నా నిగమనాన్ని రెండు దృష్టుల్లో త్రోసివేయడానికి ప్రయత్నించినారు.

ఆ రెండు దృష్టులివి :

(1) "అమ్మ" "అంబ"నుండి ఏర్పడి వుండవచ్చుననడంలో **తాత్త్వికదృష్టి.**

(2) "అమ్మ" "మా"నుండి ఏర్పడలేదనడానికి భాషాశాస్త్ర పరంగా సామంజస్యం.

శ్రీ బ్రహ్మానందగారు తాత్త్విక దృష్టితో సాధించ తల పెట్టిన అవగాహన ప్రమాద బాధితమనీ, "అమ్మ" శబ్దాన్ని సాధించడానికి ప్రత్యామ్నాయ మార్గాలు (alternatives) వున్నాయని సూచించడమే ఈ వ్యాసోద్దేశం.

'సర్వం జనయతీతి అంబా" అని వారుదాహరించిన వ్యుత్పత్తిని తీసికొందాం "అంబ" పార్వతికాదట "అంబ వాగ్రూపయైన భగవతి" అనే అర్థంలో గ్రహించాలని వారన్నారు. ప్రమాణం ఏది? అభినవగుప్తుని ద్వ్యాలోక వ్యాఖ్యానంలోని మంగళశ్లోకం! 'అంబ" సరస్వతి అనేగా వివాదం? ఒప్పుకున్నాం. ఇదేమీ కొత్త కాదు. ఎర్రాప్రెగడ, "అంబనవాంబుజోజ్జ్వల" అనే పద్యంలో భారతిని "అంబ" అని సంబోధిస్తాడు. పోతన సరస్వతిని భగవతీ అని సంబోధిస్తాడు.

వారి ప్రకారం "అంబ" **మొదట** "సరస్వతి" తర్వాత, ప్రత్యభిజ్ఞ, కాశ్మీర శైవ సిద్ధాంతాలానుసారం "దేవి". ఆతర్వాత పోతన్నగారి "చాల పెద్దమ్మ". ఆ పిమ్మట వేదాంతుల ప్రకారం వాక్కు బ్రహ్మపదార్థం, నిర్గుణం, నిర్లింగం. ఇక్కడ "దేవి" లేదు. చార్వాక మతాన్ననుసరించి అసలా పదార్థమేలేదు. ఇదీ శ్రీ బహ్మానందగారి వాదాభ్యుదయం. "మతి యంతటను వట్టి బయలసూచు" అనే పద్యం జ్ఞప్తికి వస్తుంది. తర్వాత అమర సింహుణ్ణి "క్వోటు" చేస్తారు. "లోకానాం మాతాలోకమాతా." అమరసింహుడే చెప్పిన "లోక మాతా, మా, రమా, మంగళ దేవతా" ను ఉటంకించరు. ఇందు అన్నీ "అమ్మా"లే (ఆ "మా" = అమ్మా; ఆనాతి అన్నాతి, అమాను అమ్మాను అయినట్లు) లక్ష్మీపర్యాయ పదాలు జ్ఞప్తికి రాగా కాబోలు లక్ష్మిని కూడా లోకమాతా అంటున్నారే అని ఆశ్చర్యం ప్రకటిస్తారు. కవికుల గురువు మాతామరకత శ్యామా అని అంబను పిలుస్తూ వాడుతాడంటారు. వ్రతాల్లో సరస్వతిని కూడా జగన్మాతేనమః అని ప్రార్థిస్తూ వుంటారుకదా అని తృప్తిపడతారు. మొత్తానికి వారేమి చెప్పినట్లుయిందట! అందరూ అమ్మలే అని. నేను చెబుతూ వుండేదీ అదేకాదా. అందరు స్త్రీలూ అమ్మలే. ఒకానొక కర్మలో భార్యకూడ అమ్మే. పతికి అన్నం పెట్టేటప్పుడు ధర్మపత్నికూడ మాత అవుతుంది. "భుక్తేషు మాతా" ఇతి. కాబట్టే, కన్నయమ్మ (అంబ)కంటే ఓనమాలు, మాటలు నేర్పిన పంతులమ్మ (సరస్వతి) కంటె, అన్నం పెట్టిపోసే అన్నమ్మ (లక్ష్మి) నిజమైన అమ్మ అని నేను అంటూండేది. సామగ్రి సంబారాలూ, ఉగ్రాణం గది తాళం చెవులు (ధన, ధాన్య ఐశ్వర్యలక్ష్మి) కల యజమానురాలు "మా"యే అమ్మ. శ్రీకృష్ణునికీ, కర్ణునికీ తమ తమ కనిన అమ్మలమీదకంటె సాకి పోషించిన యమ్మలమీదే ప్రేమ ఎక్కువయని తెలిసిన విషయం. వాగర్థాలు పార్వతీ పరమేశ్వరులని కాళిదాసు **భావన** అని శ్రీ బ్రహ్మానందగారు **అంటారు.** అంతకుముందు అంబ పార్వతికాదు అని, ఇప్పుడు మాత విషయంలో పార్వతినితెస్తున్నారు వారు. పార్వతీ పరమేశ్వరులను పార్వతీ, పరమేశ్వరులని (శివకేశవులు) విడుచుకోండి అని నా సూచన. అప్పుడు శ్రీ బ్రహ్మానందగారి "అంబ"— "దేవి" సిద్ధాంతం పేకమేడవలె కూలుతుంది.

"అంబ"నుండి "అమ్మ" వచ్చి వుండవచ్చుననేది అందరూ అనుకొనేదే. గవేషణకోసమైనా ప్రత్యామ్నాయాలు ఆలోచించుదాం. ఛామ్‌స్కీ వైయ్యాకరణుడే కాని దార్శనికుడు కాడు. "The invisible God created the visible world" అనే ఆయన వాక్యం శ్రీ బ్రహ్మానందగారి వాదాన్నెట్లు బలపరుస్తుంది? ఆ వాక్యంలో దార్శనిక సత్యంగా డాలేదు "అంబ" ధాతువును పేర్కొనినట్లు శ్రీ బ్రహ్మానందగారు, ఏ అరవిందులను ప్రామాణికంగా తీసికొన్నారో, ఆ యరవిందులే, అలీపూరు బాంబుకేసులో జైలులో వున్నప్పుడు, ఒకానొక దివ్యముహూర్తంలో యోగేశ్వరుడు వాసుదేవ కృష్ణుడు తనకు కన్పించి తన జీవితధ్యేయాన్ని మార్చివేసినాడని వ్రాసినారు. ఛామ్‌స్కీ అనే వైయాకరణుడికి కనబడనీ

దేవుడు, నైరుక్తకుడు, యోగి అయిన అరవిందులకు కన్పడినాడు. రామకృష్ణపరమహంస, రమణమహర్షులు నిత్యం దేవునితో మాట్లాడుతూ (Communicating and conversing with God) వుండినవారే. భగవంతుని మీద నమ్మకంవుండేవారి దృష్టిలో ఇదంతా వ్రాస్తున్నాను. భాషాశాస్త్ర చర్చకు ఇది పద్ధతి కాదని కూడా వ్రాస్తున్నాను. Noam Chomsky ని ఆసరాగా తీసికోతలస్తే, శ్రీ బ్రహ్మానందగారు, ఆయన (ఛామ్‌స్కీ) ప్రతిపాదించిన సుప్రసిద్ధమైన Innateness Hypothesis ను తీసికోవలసివుండేది. ఈ hypothesis (నిగమనం) ఏమంటుంది అంటే పసిపిల్లలకు, క్లిష్ట వ్యాకరణ సూత్రాలకు సరిపోయే వాక్యాలను నిర్మించుకొనే శక్తిస్వతస్సిద్ధంగా, నైజంగా వుంది అని అంటుంది. అటువంటప్పుడు ''మా'' అనే శబ్దంను ''అమ్మా''గా మార్చుకొనే (Transformation) శక్తి, నైజం పిల్లలకు వుండవా? శబ్దం, తత్వాలబట్టి పుట్టదు. తత్వాలే శబ్దం నుండి పుట్టుతాయి. వాగర్థ సంబంధ శాస్త్రానికీ (Semantics), శబ్దోత్పత్తికీ లంకె లేదు. ప్రతి శబ్దం ఒక ధాతువునుండి పుట్టినట్లు చెప్పట సంస్కృత భాషకు చెల్లుతుంది. మన దేశీ భాషలకు సరిపోదు. ''అంబ''కూ, ''మా''కూ ధాతు మూలం వుండవచ్చు. వాటినుండి వచ్చిన దేశీ భాషాపదం ''అమ్మ'' కు ధాతుమూలం లేదని నా ఊహ. ఒక వస్తువుకు, ఒక శబ్దం ప్రతీక. కాలిన పెన్నం నుండి పేలాలు ఎగిరిపడ్డట్లు, మనిషి నోటి నుంచి శబ్దాలు పేలి బయటపడతాయి ఒక శబ్దం నుండి ఇతర శబ్దాలు అనేక విధాల్లో తయారవుతాయి. సమీచీనత, సంపర్కం ఉచ్చారణాభేదం, అనుకరణ, కర్ణ, నాసిక, స్వరపేటిక, జిహ్వా దంతముల నిర్మాణ వైవిధ్య లోపములు, వలన వివిధ శబ్దాలు రూపొందుతాయి. నిరుక్తం యితర కారణాలూ, ప్రక్రియలూ ఇస్తుంది. ''గో'' అనే శబ్దం ఎన్ని వింత రూపాల్ని దాల్చింది.

రాజశేఖరుని ''కావ్య మీమాంస''లో చూడవచ్చు. తల్లిని ఒకరు ''మా'' అని నారు. అది సరిగా వినని వాడు ''అమా'' అని నాడు. ''అమ్మా'' శబ్దం ''అంబ''కు పర్యాయమైన ''ఉమా'' నుండీ వచ్చి వుండవచ్చు. కాకతీయుల ఆడబడుచు ఉమ్మక్క ఉంది. ఉమ్మక్క అమ్మక్క కావచ్చు. ముక్కు మూసికొనో, లేదా ముక్కు డిబ్బ వేసుకొన్నప్పుడో ''అంబ'' అనే శబ్దాన్ని ఉచ్చరించి చూడండి (వినండి!). అది ''అబ్బ'' అవుతుంది. ''అబ్బ'' అటులనే పుట్టి వుండి వుంటుంది. ఇది ఛలోక్తిగా వ్రాసింది కాదు సుమండీ. వివిధ భాషల్లోని Cognate words ఇట్టి ప్రక్రియా సంవిధానాల మూలమున పుట్టివుంటాయి అని నా మనవి.

శ్రీ బ్రహ్మానందగారి తాత్విక దృష్టిలో ''మా'' నుండి ''అమ్మా'' ఎందుకు ఏర్పడలేదో చెప్పకపోవడమేకాక, ఏర్పడి వుండ వచ్చుననే నా యుక్తిని బలపరచుచున్నది.

''రంగం'' ''అరంగం'' అయినట్లు, ''మా'' ''అమా'' కాజాలదు అంటే, ''రమా'' శబ్దం ''అరమా'' → ''అర్మా'' → ''అమ్మా''గా రూపొంది యుండవచ్చునంటాను.

ఇక పితర్థకమగు ''అప్ప'' రూపం ''అబ్బ'' గా సెమెటిక్ భాషల్లో వుండటాన్ని గురించి శ్రీ బ్రహ్మానందగారేమి చెబుతారో వినాల్సి వుంది.

శ్రీ సర్దేశాయి తిరుమలరావు

## 'ప్రాంతీయ భాగములు - సంఖ్యలు' - వివరణ

శ్రీమతి ఆర్. జగదీశ్వరిగారు 1978 డిసెంబరు భారతిలో 'ప్రాంతీయ భాగములు—సంఖ్యలు' గూర్చి వివరించుచు అవి కుటుంబ సంఖ్యలుగా నిర్ణయం చేసినారు. అందుకు కొన్ని ఉదాహరణలు గూడ చూపించినారు. కాని ఆయా భాగముల—సంఖ్యలు కాలాను గతముగా మారుతూ ఉండటం శాసనాధారమువలన గమనించవచ్చు. ఉదాహరణకి ముల్కి—500—ముర్కెనాడ—300 — ముల్కినాడు ముల్కినాంటి దేశముగా మారుతూ ఉండటం జరిగింది. ముల్కి—500 మొదటిసారిగా క్రీ. శ. 926 (A. R. Ep; 1938 No.B. 235)లో కనిపిస్తోంది. ఆ తరువాత అది ముర్కెనాడు—300గా పరిచితమయి, నాడుగాను, దేశముగాను అభివృద్ధి చెందింది. మరి వారు చెప్పినట్లు కుటుంబ సంఖ్యలుగా తీసుకుంటే, మిగిలిన పై ప్రాంతీయ భాగములలో గూడ సంఖ్యను చూపించ వలయును కదా. కాని పైన చెప్పిన సంఖ్యలలో మొదట 500, తరువాత 300గా వున్నవి. అంటే కుటుంబ సంఖ్యలు తగ్గిపోయినవని అర్థమా. సహజముగా జనసంఖ్య పెరుగుతూ ఉంటుంది గాని తగ్గుతూ ఉండదుకదా. కాబట్టి వారు చెప్పినమార్పు అసంభవము. ఈ భాగములు—సంఖ్యలు కేవలము రాజ్యపాలనా సౌకర్యార్థము, భాగములుగ విభజించటం జరిగింది. ఒక్కొక్కసారి గ్రామసంఖ్యను, ఇంకొకసారి విస్తీర్ణము (ప్రాంతీయ భాగములు పెద్దవి అయినచో) తీసుకోవటం జరిగి ఉంటుంది. అలాగే రట్టపాడి — ఏడులక్షలు అంటే వారి ప్రకారము ఏడులక్షలమంది కుటుంబాలు ఉండాలని అర్థమా. ఇంకొక ఉదాహరణ, అయెజి—300. ఈ భాగము క్రీ. శ. 1061లో మొదలయి క్రీ. శ. 1091తో అంతమవుతోంది ఆ తరువాత అయెజినాడుగా కనిపిస్తోంది. రాజ్యపాలనా సౌకర్యార్థము జరిగినది. వేంగి 1000–16000 విస్తీర్ణత తెలియచేస్తు ఉండవచ్చు.

శ్రీ సి. ఎ. పి శాస్త్రి

# గ్రంథ విమర్శలు

## శ్రీ కాళహస్తి మాహాత్మ్యము

[సమగ్ర పరిశీలన, రచయిత : విద్వాన్ శ్రీ సెట్టివారి ఈశ్వరప్ప, ఎం ఏ., డెమ్మీ. 175 పేజీలు — మంచి కాగితము, వెల : రూ. 10 లు, ప్రతులకు . శ్రీమతి ఎన్. లక్ష్మీదేవి, c/o. శ్రీ పి. రామకృష్ణ, పి. డబ్ల్యు. డి. అండ్ ఆర్. అండ్ ఎన్. కంట్రాక్టర్, కదిరి, అనంతపురం జిల్లా.]

ప్రబంధయుగంలో వెలువడిన గ్రంథాలలో పంచ కావ్యాల తరువాత చెప్పుకోదగిన గ్రంథం శ్రీ కాళహస్తి మాహాత్మ్యం. గత శతాబ్దిలోనే దీని ప్రాశస్త్యాన్ని గ్రహించిన బ్రౌను పండితుడు దీనికి ప్రతులను వ్రాయించి, పాఠాంతరాలను కూడా సూచించియున్నాడు. అముద్రితంగా ఉండిన ఈ ప్రబంధం గత శతాబ్దిలోనే ముద్రించబడింది. ఈ శతాబ్దిలో కూడా దీని ముద్రణలు వచ్చాయి.

మనుచరిత్ర, వసుచరిత్ర మొదలైన గ్రంథాలపైని ప్రత్యేక విమర్శ గ్రంథాలు వెలువడినట్లు దీనిపైని విపులమైన విమర్శ వెలువడినట్లు లేదు. ఉన్నత పట్టాని కోసం దీనిపైని సిద్ధాంత వ్యాసం రచింపబడినట్లు కనబడదు. సంస్కృతాంధ్రాలలో విద్వత్పట్టాన్ని పొంది, ఆంగ్లంలో ఎం.ఏ. బిరుదు సంపాదించిన ఈశ్వరప్ప గారు ఈ ప్రబంధాన్ని సమగ్రంగా పరిశీలించి ఈ విమర్శ గ్రంథాన్ని రచింపబూనుకోవడం సంతోషించ దగింది.

దీని విషయ సూచికలో అనుబంధంకాక చిన్నవీ, పెద్దవీ ఇరవై అయిదు శీర్షికలున్నవి. అవి — ధూర్జటి కవి వంశాదికం, కాలం, అతని శృంగార ప్రియత్వం, ప్రబంధ స్వరూపాదికం, నామౌచిత్యం, మూలాన్ని గురించిన చర్చ—పోలికలు, క్షేత్ర మహిమ, కథా సంగ్రహం, కథలలోని వ్యత్యాసాలు, నత్కీరపద చర్చ, శంఖ ఫలక చర్చ, నత్కీరుని యాత్రా మార్గం, వర్ణనలు, అలంకారములు, వివిధ శాస్త్ర పాండిత్యం, సంప్రదాయాలు, జాతీయములు, పాత్ర పరిశీలన, ప్రబంధ విశిష్టత, అనుకరణాలు, అనుసరణాలు, ఛందో విషయం, ప్రయోగ విశేషాలు, భాషాంతర పదములు, ముద్రితాముద్రిత ప్రతులు — శ్రీ కాళహస్తీశ్వర శతకం అనునవి అనుబంధంలో ఆధార గ్రంథాలు, పాఠాంతరాలు, ముఖ్యమైన దేశ్యక్రియలు చూపబడినవి.

పయి శీర్షికనుబట్టి రచయిత ఈ ప్రబంధం విషయమై ఎట్టి పరిశీలన చేసినది తెలుస్తున్నది.

ఏ ప్రబంధాని కయినా విమర్శనను వ్రాసేవారు కొన్ని విషయాలనే మనస్సులో ఉంచుకొని వాటని గురించే చర్చించడం సాధారణంగా కానవస్తుంది. తాము చూపే సారాంశం తక్కువైనా పుటలు మాత్రం పెరిగిపోతాయి. కొందరు రచనా వైశిష్ట్యాన్ని, కొందరు భాషా విషయాన్ని, కవి కాలాదులని విపులంగా విమర్శిస్తారు. ఆ గ్రంథాన్ని పాఠకుడు తప్పక చదివి ఉంటాడనే అభిప్రాయంతోనో ఏమో, కథాంశాన్నిచెప్పక ఇతర విషయాలనే ప్రధానంగా తీసుకుంటారు. ఆ గ్రంథంలోని విషయం తెలియనివారు కేవలం అట్టి సమీక్షా గ్రంథాన్ని చదివితే ప్రయోజనం తగినంత ఉంటుందని అనుకోను. ఈ పరిశీలన గ్రంథంలో కథా సంగ్రహం కూడా ఇవ్వబడినందున, దానిని చదివిన పాఠకులకు యితర విషయాలు కూడా సులభంగా అవగాహన అవుతాయి. ఇందులో ధూర్జటి మహాకవి వ్యక్తిత్వ పరిశీలన, కవితా పరిశీలన, భాషా పరిశీలన, ఔచితీచర్చ కూడా ఉండుటవల్ల సమగ్రత ఏర్పడినట్లు కావవస్తున్నది. దీనిపైని అభిప్రాయం యిచ్చిన తిరుపతి, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యకళాశాలలోని ఆంధ్రోపన్యాసకులు డి. నాగసిద్దారెడ్డి గారు "నా యెరుకలో యింతవరకు ధూర్జటి రచనమీద యిలాంటి ఉత్తమ విమర్శకగ్రంథం రాలేదు. చిన్న చిన్న వాక్యాల విన్యాసం, లలితములైన పదాల కూర్పు, శరత్కాల నదీమ తల్లిలా చల్లగా సాగిపోయే గమనవైఖరి, సామాన్యునికి సైతం అందుబాటులో వుండేటట్లు విషయ వివేచనం, కవిపండిత విమర్శ లోకాన్ని తల యూపింపజేసే పరిశోధనాపటిమ, ఎవరినీ నొప్పించని నుతిమెత్తని విమర్శనా పాటవం వగైరా వగైరాలతో యీ గ్రంథం మిక్కిలి మనోజ్ఞంగా రూపుదిద్దుకొనింది" అంటున్నారు. వీరి మాటల్లో కొంత సత్యం లేకపోలేదు ఆంగ్లంలో సంగ్రహంగా పీఠిక వ్రాసిన మదరాసు విశ్వవిద్యాలయ తెలుగు శాఖాధ్యక్షులు ప్రొఫెసర్—డాక్టర్ జి. అప్పారావుగారు, యిందులోని విషయం అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్లున్నదనీ, కవిహృదయాన్ని చక్కగా వ్యక్తం చేస్తున్నదనీ అన్నారు.

అనుబంధంలో ఇయ్యబడిన పాఠాంతరాలు, శుద్ధపాఠ, ఇతర పాఠాల వ్యత్యాసం తెలుపుతూ, రచయిత మూలాన్ని అర్థం చేసుకొనడంలో చూపిన ఔచిత్యాన్ని వెల్లడిచేస్తున్నవి. అకారాదిక్రమంలో ఇయ్యబడిన దేశ్యక్రియల పట్టిక ఆ కాలంలో వాడబడుతున్న దేశ్య క్రియల స్వరూపాన్ని తెలుపుతూ, భాషా పరిశోధకులకు సహాయకారిగా ఉంటున్నది.

తొలుత ఈ పరిశోధనా గ్రంథాన్ని పఠించి తర్వాత ధూర్జటి గ్రంథాన్ని చదివితే అది చాలా సులభంగా అర్థం చేసుకొనటకు సాధ్యమవుతుంది.

ఈ రచయిత మరికొన్ని ప్రబంధాలను కూడా—ఈవిధంగా పరిశోధించి పరిశీలన గ్రంథాలను వెలువరిస్తే భాషా వాఙ్మయాలకు ఎంతో ప్రయోజనం ఉంటుంది

ఈ పరిశీలనగ్రంథం విద్వద్విమర్శకుల ఆదరాన్ని పొందగలదని భావిస్తున్నాను.

"అంగీరస"

# వెన్నెలలో కోనసీమ

[(సోమసుందర్ కవితా సమాహారం) ప్రతులకు : కళాకేళీ ప్రచురణలు, పిఠాపురం—533450. ప్రచురణ 1977 మే రు. 5 లు].

1964 నుంచి 1976 దాకా అప్పుడప్పుడూ రాసి పత్రికల్లో ప్రకటించిన 42 గేయఖండికల సంపుటి వెన్నెలలో కోనసీమ. కవి సోమసుందర్.

వజ్రాయుధం, రక్తాక్షి, కాహళివంటి కావ్యనామాలతో సుపరిచితుడైన సోమసుందర్ అనుభూతి ప్రధానంగా 'వెన్నెలలో కోనసీమ' అనే పేరు ఎన్నుకున్నారు.

ఈ సంపుటిలో మొదటిగేయం పేరే వెన్నెలలో కోనసీమ. వెన్నెల, కోనసీమ అనే రెండు పదాలూ సౌందర్య వాసనను మనలో రేకెత్తించేవే.

ఈ సంపుటిలోని పెక్కు కవితలలో ప్రకృతి చిత్రణ కనిపిస్తుంది. వెన్నెల కవి మనస్సుకీ అందులో కోనసీమ ప్రకృతికీ ప్రతీకలు.

''కోనసీమలో వెన్నెల కోటికాంతులై విరియగ గుండెలున్న నరునికి కొసకోరిక బుసవినిపించును'' ''నారికేళీ హృదయమె నారికేళమ్మైనదేమొ'' మొదలైన పంక్తుల్లో సోమసుందర్ కాల్పనిక దృష్టి పట్టుబడుతుంది.

ఈ సంపుటిలోని అన్ని ఖండికలూ కాల్పనికంగానే లేవు. వాస్తవ దర్శనానికి ఉదాహరణలెన్నో ఉన్నాయి.

కాశ్మీర్‌లోని ప్రకృతి సౌందర్యాన్ని బీభత్సంపాలు చేస్తున్న మానవుణ్ని చూసి బాధపడతాడు కవి. ''కుంకుమపువు శోభించే కుందనంపులోయలు నరరక్త స్రవంతులై ఎరుపులుమిసి మెరయునా?'' అని 'శాంతి'ని సంబోధిస్తాడు.

''చెంగలువ కొనగోటి పారాణి జీరాడ కోనేటికొక మెరుపు తళుకొత్తి పారాడ దెసల మొగసాలలకు కుంకుమలు చెరగినటు మసలివది ఎలరేక తలిరాకు జొంపాల''—వంటి గేయాలలో భావ కవిత్వంనాటి పదజాలం వినిపిస్తుంది.

ప్రకృతిలోనే సామ్యవాద సిద్ధాంతాలను చూస్తాడి కవి. పచ్చిక బయళ్లను సముద్రంగా, పువ్వులను వంతెనలుగా మానవుల కోసం తాను మారుస్తానంటా డొకచోట.

భావాన్ని (పదార్థి) మాత్రాబద్ధం చేయడంలో ఈ కవి కొంత గ్రాంధికాన్నీ కొంత వ్యావహారికాన్నీ అవలంబిస్తారు. ఉదాహరణకి—''పచ్చికబయల్ కడలి క్రొవ్విరులు వంతెనలు కూర్చాను మీ కొరకు సాగిరండో పైకి వీచికల నిచ్చెనలు వేశాను మీ కొరకు ఎగ్రబాకిరండి ఎత్తయిన శిఖరముపైకి''. ఈ విధంగా ఈయన శైలిలో పాతకొత్తలు కలిసిపోతూ ఉంటాయి.

వజ్రాయుధం మొదలైన కావ్యాలకన్నా వెన్నెలలో కోనసీమ భిన్నమైన ధోరణికి చెందిన కవితా సంపుటి ప్రకృతికి సంబంధించిన పదజాలం ఈ కవితా సంపుటినిండా ఉంది. కొండలు, లోయలు, సేతువులు, కలువ, సెలయేరు, తేటి, మబ్బు, సముద్రం, మల్లెలు, వెన్నెల, మలయానిలం, చుక్కలు—ఇలా ఎన్నో ఉన్నాయి.

''ఎలజవ్వని చిరునవ్వుల నయనకాంతి వసంతము, నడిమంత్రపు సిరివంటిది వేసవి మధ్యాహ్నము'' మొదలైన భావ చిత్రాలు 'ఆర్తవగీతి' అనే ఖండికలో మనల్ని మురిపిస్తాయి.

కొన్నిచోట్ల పదజాలం పాండితీస్ఫోరకంగా ఉంటుంది. ఉదాహరణకు ''శ్రావణ యామినుల కనులు వారిదముల తెరల కదలు'' మొదలైనవి. అయితే ఇక్కడ 'వారిదం'అనే పదం తీసివేస్తే అందం పోయే ప్రమాదం ఉంది.

'సిందూరరేఖ' మొదలైన ఖండికల్లో (సోమసుందర్‌కు సహజమైన) సింహగర్జనలు కొన్ని వినిపిస్తాయి. ఉదాహరణకు—కులబలాల పశుశక్తికి అధికారోన్నతి కూర్చే దుద్దుక్కర నిశానీల పద్దులు తొలగేదెప్పుడు? ధనస్వామి సుఖాలకై శ్రమజీవులు ఇంధనమా? మొదలైన పంక్తులు.

కొన్ని ఖండికల్లో రీతిప్రియత్వం విస్పష్టమవుతుంది. ''నవగీతుల నవరీతుల నవచైత్రారంభశ్రుతుల నవపికగళ కాహళముల జనయిత్రీ జయగీతుల'' అనే పాదాలలోని నవశబ్దపునరుక్తి ఊపుని కలిగించింది.

అప్రస్తుతంద్వారా ప్రస్తుతాన్ని ధ్వనింపజేయడంలో సోమసుందర్ కృతార్థులయ్యారు. ఇది ప్రతిభావంతుడి లక్షణం. ఉదాహరణకు—''కంటకములు కీటకములు సర్వత్రా పరచె ధరణి నృగాలాలు వృకాసురులు సుందరవసుమతి వసించె'' ఎండుటాకు ప్రోవులలో ప్రమాదాలు బుసగొట్టును బాటలలో నిండిన పెనుబాములు తలలాడించును'' మొదలైనవి.

సమకాలీన రాజకీయ సమస్యలు కూడా ఈ కవికి ముడి సరుకయింది. వియత్నాం నరహత్యలు, మనదేశపు మతకల్లోలాలు, మేడే ఉద్యమం, మార్టిన్ లూథర్ హత్య మొదలైనవి ఈ గీతాల్లో కనిపిస్తాయి. వలస విధానం, సామ్రాజ్యవాదం, ఫాసిజం మొదలైన వాటిమీద తిరుగుబాటు ప్రకటిస్తాడీ కవి.

కాలాన్ని కవితా వస్తువుగా వాడుకోవడం ఈ సంపుటిలో కొన్ని ఖండికల ప్రత్యేకత. అంతర్వేది, సుమరథ్య, మొదలైన ఖండికలు ప్రత్యేకం పరిశీలించదగినవి.

సామ్యవాద సమాజంలోని మానవుణ్ని గురించి కలలుకంటూ సోమసుందర్ కొన్ని ఖండికలు రాశారు. దివ్వెలేని ప్రమిదలు, మృత్యుంజయ నృత్యాంజలి, సనాతనమనస్వి, మొదలైన ఖండికల్లో మానవతా దృక్పథం చక్కగా గోచరిస్తుంది.

సోమసుందర్ కవితలలో కొటేషన్లు బాగానే దొరుకుతాయి. ''ఆలోచన కొనదేరని అంతరంగమడవి, సద్భావం ఉరకలిడని స్వాంతము పెనుకడలి''—

భావాన్ని అభివ్యంజించడం శబ్దంయొక్క పరమ విశిష్టమైన ధర్మం. అందరూ ఈ శిల్పాన్ని అందుకోలేరు. కొన్నిచోట్ల సోమసుందర్ శిల్పంవిశిష్టంగా ఉంది. ఒక్క ఉదాహరణ—''పిన్న రాత్రి విన్నానొక స్వర్గలోక సౌధాంతర ప్రసవత్ చలత్ లసత్‌గాన తంత్రీ స్వరమధురలహరిని'' ఇందులో తకారపుపొల్లు ముమ్మారు పవ్యవధానంగా రావడంవల్ల తంత్రీస్వరం ధ్వనిస్తోందికదా! అయితే ఇది చాలా ప్రౌఢమైన ప్రయోగం అని ఒప్పుకోక తప్పదు.

''వెన్నెలలో కోనసీమ'' కవితా సంపుటిలో సోమసుందర్ గేయాలను మాత్రమే చేర్చారు. అవన్నీ త్రిశ్ర, చతురశ్ర, మిశ్ర గతుల్లో సాగే పాటలే.

ప్రకృతి, సమాజం, కాలం, మానవుడూ — ఈ నాలుగూ ప్రధానమైన కవితా వస్తువుగా కనిపిస్తాయి ఈ సంపుటిలో.

కాల్పనిక భావావేశానికీ వాస్తవిక దృక్పథానికీ పొత్తు కలిపి రచించిన గేయాల పరంపరే ''వెన్నెలలో కోనసీమ''.

*డాక్టర్ మిరియాల రామకృష్ణ*

# శ్రీమద్భాగవత ప్రకాశము

## [ప్రథమ స్కంధము-ప్రథమ భాగము]

[వివరణకర్త: కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య, ది వరల్డు టీచర్ ట్రస్ట్ ప్రచురణ, ప్రాప్తిస్థానము: కరస్పాండెంట్, ది వరల్డు టీచర్ ట్రస్ట్, వాణీ ప్రింటర్స్ 30–14–1/1, డాబా గార్డెన్స్, విశాఖపట్నం—4. సాధారణ ప్రతి రూ. 15/– మేలు ప్రతి రూ. 20/–]

ఇందులో బమ్మెర పోతనామాత్యుల శ్రీ మదాంధ్ర భాగవత ప్రథమ స్కంధంలో 257 వ వచనం వరకు 'రహస్య ప్రకాశము' ఉన్నది.

''సులభమైన భాషలో కావ్యము హృదయముతోపాటు ప్రతి పద్యమందలి ఆధ్యాత్మిక రహస్యములను, శతాబ్దముల మడతలలో నిమిడియున్న భాగవతోత్తముల సాధనల పోకడలను మాటాడుకొను మాటలలో వివరించెదను. సంకేత పదములతో ప్రజలను విసిగించకుండ గ్రంథము సిద్ధపరచి యిచ్చెదను'' అని పరిచయంలో కృష్ణమాచార్యగారు అన్నారు; అన్నమాట నిలబెట్టుకున్నారు.

పరిచయము, కవులయొక్క అనువాదకుల యొక్క కావ్యము యొక్క పరిచయము, రహస్య ప్రకాశము, పోతనచే రచింపబడిన గ్రంథ భాగము, అందలి ప్రతి పద్య గద్యమునకును టీకా తాత్పర్య వివరణములు, గ్రంథ మందలి సంకేత పదములు మున్నగు వానికి సంప్రదాయముల యొక్కయు దేశ కాలాదుల యొక్కయు వివరణములు — ఈ వరుస క్రమంలో రచయిత ఈ సంపుటిని వెలువరించారు.

ఈ పుస్తకంలో రచన చక్కని గ్రాంధిక భాషలో సాగింది. 'మాటాడుకొను మాటలలో వివరించెదను' అని రచయిత వ్రాశాడు గదా అని కొందరు సందేహించవచ్చు! చాలమంది వ్రాసే వ్యావహారికం కంటే ఆచార్యులవారి గ్రాంథికం సరళంగా సాగిందనడంలో సందేహం లేదు. ఉపోద్ఘాతంలో పోతన జీవితాన్ని సంక్షిప్తంగా వ్రాశారు. తరువాత భాగవత గ్రంథ ప్రాశస్త్యాన్నిగూర్చి చెబుతూ విష్ణూపాసనము, వాసుదేవోపాసనము, నారాయణోపాసనము అనే భాగవతోపాసనా సోపానములను వివరించారు. అనుభూతి ప్రధానమైన ఆంధ్ర భాగవతాన్ని వ్యాసుని రచనతో పోల్చి చెప్పారు.

''అవతరించు స్థితిలోనున్న దేవుడు 'హరి' అను సంకేత పదమున చెప్పబడును. అతడు గర్భస్థుడై మొదటి మాసమున తన అంతర్యామి ప్రజ్ఞను మాటు పరచి జీవ ప్రజ్ఞను పొందుట 'భగవంతుని నిర్యాణము' అనబడును. దీని ననుసరించి ప్రథమ స్కంధమున శ్రీ కృష్ణ నిర్యాణమున్నది. పదియవ మాసమున జీవుడు సర్వాంగ పరిపుష్టి పొంది దిగివచ్చుట అవతరణము. దీని ననుసరించి దశమ స్కంధమున శ్రీ కృష్ణుని జనన మున్నది..'' ఇలా ఆసక్తిదాయకమైన భాగవతాంతర్గత రహస్యాల నెన్నిటినో రచయిత వివరించి 'రహస్య ప్రకాశము' అనే తమ గ్రంథ నామాన్ని సార్ధకం చేశారు.

ద్రౌపది అశ్వత్థామను చూచి సంభాషించిన విధం, ఉత్తర కృష్ణుని శరణు వేడిన పద్ధతి, కుంతీదేవి చేసిన స్తుతి, భీష్ముడు ధర్మరాజునకు చేసిన ఉపదేశము, అవసానంలో చేసిన కృష్ణ స్తుతీ, ధృతరాష్ట్ర వైరాగ్యం మొదలైన ఘట్టాల్లో నిబిడీకృతమైన రహస్యాలను రచయిత సరళ సుందరంగా వివరించారు. ఇవన్నీ నిత్య జీవితంలో భాగవత ధర్మాన్ని పాటించే విధానాన్ని ఉపదేశించు క్రమంలో సమకూర్చబడ్డాయని సోదాహరణంగా వర్ణించారు.

నిజంగా కవిత్రయం వారు భారతాంధ్రీకరణకూ, పోతన ఆంధ్ర భాగవత రచనకూ భువిపై అవతరించిన కారణజన్ములుగా గోచరిస్తారు ''దీనిని తెనిగించుటకు తగిన వానిచేత దానిని భగవంతుడు చేయించును'' అనే రచయిత వాక్యంతో ఆస్తికులంతా ఏకీభవిస్తారు.

ఆంధ్ర భాగవతంలో ఏయే పద్యాల్లో ఏయే భావాలు నిబిడీకృతమై యున్నాయో, ఏయే వచనాల్లో ఏయే రహస్యాలు దాగివున్నాయో 120పుటల్లో మనోహరంగా తెలుపబడ్డాయి. గాయత్రి ప్రశంస, నైమిశారణ్య వర్ణనము, సత్త్రములు మొదలగువాని ప్రసక్తిని గూర్చి రహస్య ప్రకాశంలో సమగ్ర వివరణ ఉంది. త్రిమూర్తి తత్త్వాన్ని గూర్చి, భగవంతుని లీలావతరణను గూర్చి రచయిత సంపూర్ణంగా చర్చించారు. పోతన భాగవత రచనలోని రహస్యాలను ప్రథమ స్కంధంలో ప్రారంభం నుండి 257 వచనం వరకు ఇలా

వెలుగులోకి తేబడ్డాయి. ఆ తరువాత ప్రథమ స్కంధంలో 257 పద్యాలవరకూ మూలమునిచ్చి, వరుసగా వాటికి అన్వయ క్రమసహిత మైన టీకా తాత్పర్యాలను ఇచ్చారు. 'పరిశిష్టం'లో కాలవిభజనను గూర్చి విజ్ఞానదాయకమైన వివరణను ఇచ్చారు.

ఇది ఉత్తమ గ్రంథం. ఆస్తికులందరూ తప్పక చదవ వల సిన గ్రంథం. భాగవత రహస్యాలను వెలుగులోకి తెస్తున్న శ్రీఎక్కిరాల కృష్ణమాచార్య అభినందనీయులు.

*శ్రీ పులిచెర్ల సాంబశివరావు*

## "మేనటికం" (కథా సంపుటి)

[పైడిపాటి సుబ్బరామశాస్త్రి, దేవీ పబ్లికేషన్స్, విజయ వాడ. పది రూపాయలు.]

మేనటికం కథాసంపుటిలో మొత్తం పన్నెండు కథలున్నాయి. కథలన్నీ బాగున్నాయి. "తీరని కోరిక" చాలాబాగున్నది. పెళ్ళయిన భాస్కరం తానొకనాడు ప్రేమించిన పంకజాన్ని మరచిపోలేకపోతాడు. ఆమె మాటమీది గౌరవంతో తన భార్యను ప్రేమగా చూడనారంభి స్తాడు. పంకజం కూడా తనలాగే తననింకా ప్రేమిస్తోందా అనే అనుమానం కలిగి, భర్తతో వేరేవూరు వెళ్ళిపోతూన్న పంకజంతో ఈ విషయం చెప్పి, తన సంతృప్తికోసం నిజం చెప్పమంటాడు రైలు కదులుతూండగా "మావూరు వోసారి రాభాస్కరం! నిజంగా రావాలి. నిజం చెపుతున్నాను. నిజం నిజం" అంటుంది. ఈ కథ ముగింపు కూడా బాగున్నది.

ఈ పుస్తకంలో రచయిత మరో రచన "మగ దిక్కు" నవల ప్రశంసా లేఖలు పొందు పరుచబడ్డాయి. ఈ పన్నెండు కథలనూ "పాత కొత్తల మేలు కలయిక"గా పురాణం సుబ్రహ్మణ్యశర్మగారు వర్ణించి, "ఈ కథలు చదివేవారు ఇందులో లేనివాటి కొరకై వెదు కక, ఉన్నవాటిని అర్థం చేసుకుని ఆనందించాల"న్నారు.

విజయవాడ దేవీ పబ్లికేషన్స్ వారు ప్రచురించిన ఈ "మేనటికం" పది రూపాయలు. వెల కాస్త ఎక్కువే.

*'ఫా లా క్షు డు'*

## 1. మాని బందోపాధ్యాయ

[ఆంగ్లమూలం:-సరోజ్ మోహన్‌మిత్ర, తెనుగుసేత:- జంధ్యాల జయకృష్ణ బాపూజీ].

## 2 ఈశ్వరచంద్ర విద్యాసాగర్

[ఆంగ్లమూలం:-హిరణ్మయి బెనర్జీ, తెనుగుసేత:-పోలా ప్రగడ సత్యనారాయణమూర్తి]

## 3. బి. యం. శ్రీకంఠయ్య

[ఆంగ్లమూలం:- ఎ. ఎన్. మూర్తిరావు, తెనుగుసేత:- పొరంకి దక్షిణామూర్తి.]

## 4. ఫకీర్ మోహన్ సేనాపతి

[ఆంగ్లమూలం:-మాయాధరీమాన్‌సింహ, తెనుగుసేత:- సి. ఆనందారామం. ఒక్కొక్క ప్రతివెల:-రు. 2-50లు. ప్రతు లకు:-సాహిత్య అకాడెమీ, రబీంద్రభవన్, న్యూఢిల్లీ-1]

వంగసాహిత్య చరిత్రలో ఒక ప్రత్యేక స్థానాన్ని పొందిన రచ యిత మానిక్‌బందోపాధ్యాయ. అనేక నవలలు, కథలు, కథానికలు వ్రాసి వంగ సాహిత్యానికి పుష్టిని, వంగసాహిత్యానికి పురోగతిని కలి గించిన అభ్యుదయ రచయిత బందోపాధ్యాయ. తన కాలంనాటి వంగ దేశ సామాజిక పరిస్థితులను, పీడిత జనుల గాథలను మానవ మన స్తత్వ పరిశీలనను సూక్ష్మాంశాలతో తన రచనలలో వివరించాడు మానిక్. 'సముద్రార్ స్వాద్' (సముద్రపు ఉప్పు) కథాసంకలనానికి మానిక్ వ్రాసిన పరిచయం అతని రచనా పరమార్థాన్ని అర్థం చేసు కునేందుకు ఉపకరిస్తుంది. "ఈ సంకలనంలోని స్త్రీ పురుషుల కథలు మధ్యతరగతి సమాజానికి సంబంధించినవి. చౌకబారు భావా లతో నిండి, వాటిమీదే ఎక్కువ ఆసక్తి చూపుతూఉండే వ్యక్తు లుగా వీరిని నేను గమనించాను...నా కథలు చదివిన పిమ్మట ప్రజలు మేల్కొని పరిస్థితుల వాస్తవికతలను గ్రహించి వాటిని సరిదిద్దు కుంటారని భావించాను. కాని నేననుకొన్నది తప్పనీ, పరిస్థితులు చాలాదూరం పోయాయని గ్రహించాను. మన మధ్యతరగతి సమాజం నిరర్థకమైంది...అన్ని రంగాలలో పతనమే ఉన్నప్పుడు దాని పునర్వి కాసానికి పోరాడటం నిష్ప్రయోజనం ... ఈ తరగతి తన ఉనికిని కోల్పోయి ప్రపంచంలోని వర్గరహిత సమాజంలో కలిసిపోవడం చాలా యోగ్యమైన పని" అంటాడు మానిక్. అతని రచనా పరి ణామ దశల్లో ఇది ఒక హద్దు. ఆ పిమ్మట రచనలు మార్క్స్ సిద్ధాంత స్వీకారంతో జరిగాయి. మార్క్స్ సిద్ధాంతాన్ని గురించి అతని వ్యాసాల్లో ఇట్లా అంటాడు. 'భూత వర్తమానాలకు సక్ర మమైన అర్థాన్ని ఇవ్వగలిగేది మార్క్స్ సిద్ధాంతం ఒక్కటే. మానవజాతి భవితవ్యానికి సరైన సమాధానం ఇందులోనే ఉంది.' సాహిత్య ప్రయోజనాన్ని గురించి కూడా అతనికి ఒక స్థిరమైన అవగాహన ఉంది. 'ఎప్పటికీ మానవజాతిని అనాగరకస్థాయికి దిగ జార్చే పారంపర్యమైన చిరకాలపు వ్యామోహపు దుర్మార్గానికి సాహిత్యం ఉద్దేశింపబడలేదు. ఉత్తమ ప్రపంచంకోసం నాగరికతను అమిత వేగంతో నడిపించడం ఒక్కటే రచయితల ముందుండ వలసిన ప్రధాన సమస్య. మానిక్‌బందోపాధ్యాయని ఉత్తమ రచయి తగా ఋజువు చేసే గ్రంథం ఇది.

ఈశ్వరచంద్ర విద్యాసాగర్ వంగదేశంలోని సంఘ సంస్కర్త లలో అగ్రశ్రేణిలో నిలబడినవాడు. అతని జీవితాన్ని, సంఘసంస్కర

ణను, విద్యాసంస్కరణను, రచనలను ఈ గ్రంథంలో పరిశీలించడం జరిగింది. విద్యాసాగర్ వ్యక్తిత్వాన్ని తెలుసుకునేందుకు ఈ గ్రంథం బాగా ఉపయోగపడుతుంది. వితంతు వివాహాలకోసం అతను పడిన శ్రమ, సతీసహగమన దురాచారంపై అతను జరిపిన పోరాటం ఈ గ్రంథంలో సమగ్రంగా చిత్రించబడ్డాయి. పరాయి పాలనలో ప్రభువులకోసం తన నిర్ణయాలను మార్చుకొనని విశిష్ట వ్యక్తిత్వం విద్యాసాగర్‌ది. సంస్కృత పార్య గ్రంథాలేకాక బెంగాల్ ఇతిహాస్, భేతాళ పంచవింశతి, జీవన్ చరిత, విధవా వివాహ, మహాభారత మొదలగు సాహిత్య సాంస్కృతిక రచనలు విద్యాసాగర్ చేశాడు. ఈశ్వరచంద్ర విద్యాసాగర్ సాంస్కృతిక పునరుజ్జీవనానికి మూల కారకులైన సాహితీ మూర్తులలో ఒకడు.

ఫకీర్ మోహన్ సేనాపతి ఒరియా సాహిత్యంలో చెప్పుకో తగ్గవాడు. క్రమమైన విద్యాభ్యాసం లేకుండానే స్వశక్తితో అనేక పదవుల నధిరోహించి అటు సమాజంలోను, ఇటు సాహిత్యంలోను ఒక ప్రముఖస్థానాన్ని పొందిన విశిష్టవ్యక్తి. కూలిపిల్లవాడుగా జీవితాన్ని ప్రారంభించి స్కూలు ఉపాధ్యాయుడుగా జీవితాన్ని సాగించి జమీందారీలపై మేనేజరుగా అత్యున్నతస్థాయికి ఎగ్రబాకిన జీవితం ఫకీర్ మోహన్ సేనాపతిది. ఈశ్వరచంద్ర విద్యాసాగర్ బెంగాలీ 'జీవన చరిత్ర'ను ఒరియాలోకి అనువదించాడు. భారతదేశ చరిత్రను వ్రాశాడు. రామాయణాన్ని, భారతాన్ని సులభమైన భాషలో ఒరియాలోకి అనువదించాడు. 'ఉత్కల భ్రమణం' అతని స్వతంత్ర రచన. 'స్వర్గద్వారం ముందున్న ఆత్మలు' మంచి కవిత. 'తిరిగి ఎలుకవైపో' కథ ఆనాటి ఒరియాదేశంలోని మనుషుల ఆలోచనా విధానానికి తిరుగులేని ప్రతీక. వాడుక భాషలో ఫకీర్ మోహన్ సేనాపతి నవలలు కథలు వ్రాశాడు. ఒరియా సాహిత్య పునర్వికాసానికి మూల పురుషుడుగా ఫకీర్ మోహన్ సేనాపతి పేరు చెబుతారు.

బి. యం. శ్రీకంఠయ్య కన్నడ సాహిత్య ప్రముఖులలో ఒకడు. ఆంగ్లభాషను అమితంగా ప్రేమించినా కన్నడ భాషాభివృద్ధి కోసం, కన్నడుగులంతా ఒకే పాలనక్రింద ఉండటంకోసం జీవితాంతం కృషి చేసిన మహనీయుడు బి. యం. శ్రీకంఠయ్య. గదా యుద్ధం, అశ్వత్థామన్ నాటకాలు—గ్రీకు విషాదాంత నాటకాలను ఆధారంగా చేసుకొని వ్రాసినవి. కన్నడ సాహిత్య చరిత్రను శ్రీకంఠయ్యగారు వ్రాశారు. 'ఇస్లామ్ సంస్కృతి' వారి అనువాద గ్రంథం. శ్రీకంఠయ్యగారు ఆధునిక దృక్పథం కలిగిన ప్రొఫెసర్. ''పురాణాలకూ, మతపరమైన కవిత్వానికి సంబంధించిన మహాయుగం చాలాకాలంకిందటే అంతరించింది...యతిప్రాసలు, ద్వంద్వార్థాలు, కుకవినింద, స్వోత్కర్ష, అష్టాదశ వర్ణనలు ఇవన్నీ మనకు సమృద్ధిగా ఉన్నాయి...అటువంటి కవిత్వం నిజంగా పండితులకోసం పండితులు వ్రాసిందేకాని సామాన్య జనంకోసం వ్రాసిందికాదు. వాళ్ళు వ్రాసింది కన్నడంలోనేనని చెప్పడం కూడా ఒక్కొక్కప్పుడు కష్టమవుతుంది. నాలుగు పాదాలున్న ఒక పద్యంలో ఒకేఒక కన్నడ పదం ఉంది. తక్కినదంతా సంస్కృతం; అందులోనూ ఇనుప గుగ్గిళ్ళలాంటిది'' అన్న శ్రీకంఠయ్యగారి వాక్యాలను పరిశీలిస్తే ఆనాటి కన్నడ సాహిత్యంపై ఆయనకున్న దృక్పథం అర్థం అవుతుంది. కన్నడ సాహిత్యానికి సృజనాత్మకమైన సేవచేసిన భాషా సేవకుడు బి. యం. శ్రీకంఠయ్య.

ఈ నాలుగు గ్రంథాలను ఆంగ్లంనుండి తెనుగున కనువదించటంలో శైలీసారళ్యాన్ని సాధించారు రచయి(త్రు)తలు అకాడెమీ చేస్తున్న ఇలాంటి కృషిని సాహిత్యాభిమానులు తప్పక ప్రశంసిస్తారు తేలిక ధరలో తెలుగు పాఠకులకు ఈ గ్రంథాలు లభించటం అదృష్టమనే చెప్పాలి.

*శ్రీ టి ఎల్. నా. తారావు*

# పలనాడు వెలలేని మాగాణిరా

[ప్రచురణ : పులుపుల వెంకట శివయ్య స్మారక కమిటీ, ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం గుంటూరు జిల్లా శాఖ. వెల : పది రూపాయలు.]

మార్క్సిజమ్ కొన్ని సిద్ధాంతాల సముచ్చయం మాత్రమే కాదు. అందువల్ల ఇక చర్చ జరపడానికి వీలులేని సిద్ధాంతాల సంకలనం అసలు కానేకాదు. మానవాభ్యున్నతికి కృషి చేసేవారికి మార్క్సిజమ్ ఉద్దీపనం. సాంఘిక శ్రేయస్సుకు కృషి చేయదలచేవారికి మార్క్సిజమ్ ఒక కార్యక్రమాన్ని అందజేస్తుంది. కనుకనే జాతీయ వాదులుగా రాజకీయాలలో తొలుత ప్రవేశించినవారిలో పెక్కుమంది మార్క్సిస్టులుగా మారడం ఒక్క భారతదేశంలోనే కాక ఇతర దేశాలలో కూడా జరిగింది. దేశ స్వాతంత్ర్యానికీ, దేశాభ్యున్నతికీ కృషి చేసే వారికి ఒక సిద్ధాంతం — తాత్విక సిద్ధాంతం అవసరం అని తెలుగుదేశంలోనే కాదు భారతదేశంలోనే తొలుదొల్త ప్రచారం చేసిన వారు కమ్యూనిస్టులని అనడం అతిశయోక్తి కాదు.

ఇలాంటి జిజ్ఞాసాపరులలో కీర్తిశేషులు పులుపుల శివయ్య ఒకరు. ఆయనది ప్రాయికంగా జిజ్ఞాసా దృష్టి. మార్క్సిజాన్ని ఆయన మనసారా నమ్మాడు. హృదయపూర్వకంగా ఆచరించాడు. అయితే కమ్యూనిస్టులలో తొలి రోజులలో అధికంగా ద్యోతకమయిన అసహనం ఆయనలో లేశం కనిపించేది కాదు.

పూలదండల నుంచి, మంత్రి పదవిదాకా ఏదో ఒకదాన్ని అపేక్షించి రాజకీయాలలో శివయ్య ప్రవేశించలేదు. సంపాదించిన ఎస్. ఎస్‌సి. డిగ్రీని తాకట్టు పెట్టి వుంటే మంచి ఉద్యోగమే ఆయనకు వచ్చి వుండేది. కాని, అలాంటి వ్యక్తి కాదు శివయ్య. తనకుతెలిసిన విషయాలను ఇతరులకు చెప్పాలనే కోరిక, తనస్థాయికి వీలయితే తనకంటే మిన్నగా తన సహచరులు ఎదగాలని అపేక్షించి, తదనుగుణంగా కృషిచేసిన వ్యక్తి శివయ్య. ఆయన స్మారకార్థం గుంటూరు జిల్లా అభ్యుదయ రచయితల సంఘం ఒక సంచికను వెలువరించడం ఎంతో సముంజసంగా ఉన్నది.

831 పుటలున్న ఈ సంచికలో శివయ్య కలం నుంచి వ్యాసావళి, చెరగని గీతలు — శివయ్య గీతాలు, శివయ్య కవితలపై పరామర్శ, ఆత్మీయులస్మృతిపథంలో, సందేశాలు అనే శీర్షికలున్నయ్.

ఇవన్నీ అభిమానులు సంతరించినవి, లేదా అభిమానులు వ్రాసినవి.

గాంధీజీ హత్య గురించి శివయ్య వ్రాసిన వ్యాసం బాగున్నది.

''రాజమండ్రిలో పంతులుగారు'', 'గిడుగు గ్రాంథిక భాషా వాదుల పాలిటి పిడుగు''అనే శీర్షికలతో శివయ్య వ్రాసిన వ్యాసాలూ; ''పలనాడు వెలలేని మాగాణిరా''. ''మాకొద్దీ నల్లదొరతనము'' అనే గేయాలూ తప్పక చదవవలసినట్టివి.

ఇక శివయ్యను గురించిన వ్యాసాలలో ''కరదీపిక క్రాంతిరేఖ మా శివయ్య'' అనే శీర్షికన వేములపల్లి శ్రీకృష్ణ, ''సిద్ధాంతవేత్త కామ్రేడ్ శివయ్య'' అనే శీర్షికన కంభంపాటి సత్యనారాయణ (సీనియర్) వ్రాసిన వ్యాసాలు ప్రత్యేకంగా పేర్కొనదగినవి.

పులుపుల వెంకట శివయ్య మార్క్సిస్ట్ మేధావి అయిన మాట నిజమే. గుంటూరు జిల్లాలో ఆయన ప్రబోధాలు ఆనాటి యువకులలో చాలా మందిని ప్రభావితులను చేసిన మాట కూడా నిజమే. వీటన్నింటి కంటే ముఖ్యమయిన విషయం శివయ్య కవి, రచయిత అన్నది. ఆయన వ్రాసిన గేయాలలో కొన్ని జనామోదం పొందాయి. మరికొన్ని గేయాలు ఈనాడు కూడా కొందరి నోటి నుంచి వినిపించుతూంటాయి.

పోతే 51 వ పుటలో 'రాయిస్టు పెడధోరణిపై పోరాటం' అనే ఉప శీర్షిక కింద ''యం. ఎన్. రాయ్ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యవర్గంలోనూ, చైనాలో కమ్యూనిస్టు పార్టీకి సహాయకుడుగా 1937 — 38 లో నిర్వహించిన పాత్రను గురించీ, ఆయన డికొలనైజేషన్ సిద్ధాంతాన్ని గురించి కాడరులో అనుమానాలు ప్రచారం చేయసాగాడు'' అని శివయ్యగారు వ్రాసినట్టు ఉటంకించారు ఆరోజులలో రాయ్‌ని గురించి ఈ దేశంలోని కమ్యూనిస్టులు ఇలా అనుమానపడిన మాట నిజమేగాని, ఈ సమీక్షకునికి తెలిసినంతవరకూ భారత కమ్యూనిస్టు అగ్రనాయకు లెవరూ బహిరంగంగా తమ ఆరోపణలను రుజువు చేయలేదు పయిగా ఆనాడు ఎమ్. న్. రాయ్ మీద వేసిన అభాండాలను మార్క్సిస్ట్ మేధావులలో కొందరు ఈనాడు సరిదిద్దుకొంటున్నారు కూడా.

ఇదే విధంగా 55వ పుటలో కూడా ' రాయిస్టు పెడ ధోరణిని గురించి కొన్ని సిద్ధాంత వివరణలు యిచ్చి'' అని ఉన్నది. రాయిస్టు పెడధోరణి యేమిటో ఆనాడు శివయ్యగారుగానీ, ఈనాడు ఆయన అనుయాయులం అని చెప్పుకుంటున్న వారుగాని ఇంతవరకూ ఎక్కడా వివరించి వుండలేదు

కేవలం ప్రస్తావనగా, ఆనాడు జరిగిన విషయాలను జరిగినట్టు శివయ్యగారు వ్రాసివున్నట్లయితే, ఆయా అంశాలు ప్రస్తుత చారిత్రక పరిణామాల దృష్ట్యా అసంగతం అని ఈ పుస్తకం సంపాదకులు భావించితే వాటిని తొలగించి వుండాల్సింది అలాకాక పైన ఉటంకించిన వాక్యాలలో సత్యం కలదని సంపాదకులు భావించివుంటే అవి ఎలా సరయిన విషయాలో వివరించి వుంటే సామాన్యులకు ప్రయోజనకరంగా వుండేది.

రాయ్ విశ్లేషణను సమర్ధించడం ఈ ప్రస్తావన లక్ష్యం కానేకాదు. ఇలాంటి వాక్యాలవల్ల ఈనాడు మనమధ్య లేనట్టి ఇరువురు వ్యక్తులకు ఎంత అపచారం జరుగుతుందో గమనించవలసినదిగా విజ్ఞులను కోరడం అసందర్భం కాదనుకుంటాను.

ఇలాంటి చిన్న చిన్న విషయాలు ఎలావున్నా (సిద్ధాంత) మార్క్సిస్ట్ మేధావులలో ఒకరయిన శ్రీ శివయ్య జీవితం, రచనలు, కార్యకలాపాలను గురించి ఈనాటి యువకులు పరిచయం కలిగించుకొనడానికి, ఈ పుస్తకం ఉపయోగపడుతుంది.

ఏనాటి ఫ్రెండ్స్‌హోమ్? ఇలాంటివిషయాలు చదువుతూంటే వలభయ్ నాలుగు సంవత్సరాలకు ముందు జరిగిన సంఘటనలన్నీ గుర్తొస్తున్నాయి.

అదొక ఉత్సాహం! అదొక ఆవేశం! గతితార్కిక భౌతికవాదం దృష్టిలో చేసే విశ్లేషణకు అందవు ఆనాటి సంఘటనలు. ఒకవేళ అందినా వాటిలో ఏది తప్పో? మరేది ఒప్పో గ్రహించగలిగితే ఈ సంచిక ప్రకటన లక్ష్యం నెరవేరినట్టే.

*శ్రీ వి. ఎస్. అవధాని*

## 1. నాకు భూమి కావాలి

[కవిత. రావు వెంకటరావు, డెమ్మీ— 1/8—40 పేజీలు; వెల: రు. 2/—ప్రతులకు—ఆంధ్రసారస్వత పరిషత్—తిలక్‌రోడ్ — హైదరాబాదు-1]

ఈ పుస్తకం పేరే నవ్యగ్రామీణ జీవనానికి పునరుజ్జీవనం కల్పిస్తున్నది. పెరిగి పెరిగి విసుగు వెగటు పుట్టించిన పట్టణ కృత్రిమ జీవనాన్ని వదలి, గ్రామ స్వచ్ఛ స్వతంత్ర వాయువులను పీల్చను ఈ కవి కుతూహలపడుతున్నాడు. ఇది మెచ్చదగిన కోరిక. ఈయన కోరేది సాగుకు పనికివచ్చే సేద్యపు నేల; అంటే చెమటూడ్చి బ్రతకాలనే గాని పరభాగ్యోపజీవి కారాదని ఎచ్చరిస్తున్నాడు ఈ ఆదర్శవాది అయిన కవి.

ప్రతి ఖండికకు తానే ఇంగ్లీషు అనువాదం ఇచ్చి ఉన్నాడు. ఈ ప్రయత్నం ప్రశంసనీయం. మన తెలుగు పూదోటలో వికసించి పరిమళించిన భావసుమాలను అన్యభాషా తాలకు అందజేయవలసిన అగత్యం ఎంతగానో ఉన్నది. క్రమేణా ఇంగ్లీషుకు దాని జాతీయత వలవడితే రాణించగల రచన. తెలుగు శైలి ఇంకా పదనెక్కవలసి

ఉన్నది. అనుభవించి వ్రాయగలిగిన వ్రాతకాడైనందున రచనలో భావబంధురత భాషలో మార్దవం ఏర్పడి ఉన్నది.

## 2. (కొండవీటి) రెడ్డిరాజ్య మహోదయము

[చారిత్రక కావ్యము—మహాకవి బెళ్లూరి శ్రీనివాసమూర్తి, డెమ్మి—1/8. 200 పుటలు; వెల: రు. 10/–; ప్రతులకు—గ్రంథకర్త, కుంటిమద్ది పోస్టు; ధర్మవరం తాలూకా, అనంతపురం జిల్లా.]

"పంటకాపు బ్రతుకుపాటలో శ్రుతిజేర్చి పాడలేని తెనుగు పదములేల? కాపురెడ్ల వీరగాథామృతము కొంత చిలుకకున్న కవుల కలములేల?" అన్నదీక్షతో వ్రాసిన రసవత్తర ప్రబంధమిది చరిత్ర సంఘటనలు అస్థిపంజరాలుకావు, ఒకజాతి జాగృతి సంస్కారాల స్వరూపమైన సజీవమూర్తులు అని నిలబెట్టను చరిత్రను కావ్యంగా వ్రాసిన రసమయ మధుర కృతి యిది! కులాభిమానం తప్పుకాదు గాని, దురభిమానం మాత్రం తప్పుగా గర్హింపదగినది. గుణ పక్షపాతి అయిన ఒక సహృదయుడు వ్రాసిన ఈ గ్రంథం చదువుతుంటే ప్రతి ఆంధ్రునికీ పారవశ్యం నిలువెల్లా పారిపోతున్నది. ఇక నేను ఒక పంటరెడ్డిగా చకితుడనైనానంటే మానవ హృదయ దౌర్బల్యాన్ని మన్నింతురుగాక.

ప్రౌఢరచన, మధుర పదబంధ సౌరభము, మురిపించే నడక ఈ కవి పాండిత్యానికి బంగారు నీరు బోస్తున్నవి. వవరసాలు ఈ కవి వ్రేళ్ల కొనలపై నాట్యమాడి, ఆ మనోజ్ఞ విన్యాసాలను కాగితంమీద దీప్తాక్షరాలతో ముద్రిస్తున్నవి అందులో, అభిమానం పొంగిపొరలే రచన ప్రాణం పోసుకోక ఊరుకుంటుందా?

కొండవీటి రెడ్డిరాజుల చరిత్రలోని వివిధ ఘట్టాలను, వివిధ గుణాలను రసస్ఫూర్తితో వర్ణించినాడు. కృషీవలపర్వం (భారతానికి వలెనే దీనికి 18 పర్వాలు) కర్షక వృత్తిని పొగడి, గ్రామజీవన అకళంక సౌభాగ్యాన్ని ఆనందం వెల్లివిరిసేటట్లు చెప్పినాడు. సంగ్రామపర్వం చరిత్రను రాజుల విజయ సంగ్రామాలను ఉగ్గడించి, ఆంధ్రాభిమానాన్ని రేగగొట్టి పులకలెత్తిస్తున్నది. తిక్కనవలెనే ఈ కవికి సంగ్రామం ఒక కళ. "విక్రమ కళారేఖలతో—కొండవీడు వీరరసాన్ని పిండి త్రాగించినది" అంటాడు. "కృపాణంబు లుజ్జ్వల కాంతిన్ ప్రసరించి యుక్కపొడిని రాల్చినది" అంటాడు.

ఈ పన్నెనిమిది గణువుల (పర్వం) చెరుకుగడలో సాహిత్య పర్వం తేనెపాక. 'కృతికర్తలు కృతిభర్తలు కృతిజీవనులగుచు, నాంధ్ర కిరువైపుల సన్మతి వింజామరవైచిన కృతకృత్యులు పూజ్యులెందు రెడ్డివరేణ్యుల్' అని లరెడ్ల రచనా వైదుష్యాన్ని కవి పండిత పోషక ఔదార్యాన్ని ఆనంద విహ్వలులయ్యేటట్లు చెప్పినాడు—సిద్ధహస్తుడైన ఈ రాయలసీమకవి. శ్రీనాథుని వర్ణించేపట్టున సీసపద్యాలు ఆ కవి సార్వభౌముని ఫక్కిని జ్ఞప్తికి దెస్తున్నవి. కావ్యమంతా రమ్యకవితావేశంతో శిల్పరసాన్ని ఊరిస్తున్నది. మోటుపల్లి వర్ణన ఆంధ్ర వాణిజ్య సామ్రాజ్య చిహ్నంగా చెప్పబడి ఉన్నది.

ఈ కవి నుడికారంలో, అక్షర అక్షరానికి కవితాశిల్ప వికాసము భావసౌభాగ్యము వసంతోదయ రుచులు అల్బిఉన్నవి. అందులో, సహాధ్యాయుడుగానుండి, ఇళ్లూరు వదలి ఇంద్రప్రస్థ రాజ్యపీఠ మెక్కిన నీలం సంజీవరెడ్డిగారికి సమర్పణం ఈ కృతి. బాల్య స్నేహపు తీరుతియ్యాలు ఇట్టివిగదా!

ఈ రచనలో కొన్ని పాల్కోవా బిళ్లలు :— కొండవీటి ప్రాగద్రి శిఖరిపై విరులజల్లె తరణి కిరణ వితతి; శ్రమనోడ్చిన స్వేదబిందు సుందరమణిహారముల్ పుడమి తానయి కోరిధరించు కొన్నగల్; మనసులో మాటలో చిఱుమల్లెతావి, స్రమవర్తనలో ప్రాచ్య నాగరకత; ఆమె చిఱునవ్వు దొంతర నణగి మణగి రాజ్ఞి సౌందర్యరేఖ తారాడు నచట; జనకుని పదముల ప్రణామ సుమమాల వైచి సజ్జనిలువ; కూరిమి నీడలో బ్రదుకగోరెద; అమర భారతితో నైక్యమలవరించి, తెలుగు భాషావధూటి కుత్తేజమిచ్చి, అక్కసెల్లెండ్ర నృత్యకళాభినయము సృజన మొనరించి రలరెడ్డి నృపతి వరులు; తతవిజయ ఘంటికా నినాదములు మొరయ కదలియూరేగు సాహితీ మదగజంబు; అందమెగబోసెనాడు ముత్యాలశాల. ముత్యాలశాల వర్ణనలో గౌడడిండిమభట్టు కంచుఢక్క పగిలిన శబ్దాలు వినబడుతున్నవి; శ్రీనాథుని దీనాలాపం గుండెను ఒత్తివేస్తున్నది. లకుమవర్ణనము నాట్యము మనసును అలరింప జేస్తున్నవి. అరవైఏండ్లనాడు, పినాకినీ తీరాన రాయప్రోలు సుబ్బారావు అన్నాడు—చావలేదు చావలేదు ఆంధ్రుల మహోజ్జ్వల చరిత్ర, హృదయములు చీల్చిచదువుడో సదయులారా—అని. ఇట్లా గ్రంథమంతా చదివేదానికి చవులూరిస్తున్నది.

## 3. భర్తృహరి నిర్వేదము

(హరిహరకవి శాంతరసనాటకము.)

[ఆంధ్రానువాదం—చర్ల నారాయణశాస్త్రి. డెమ్మి 1/8-42 పుటలు; ధర రు. 1/–; ప్రతులకు — చర్ల గణపతిశాస్త్రి, 24, పిఠాపూర్ బీచ్ క్వార్టర్స్, ఆంధ్రాయూనివర్సిటీ, వాల్తేరు.]

సంస్కృత నాటకాల లక్షణాలు సంప్రదాయాలు అన్నీ సంక్షేపంగా పొందుపఱపబడిన ఐదు అంకాల చిన్న నాటకం ఇది. రాజు—భర్తృహరి, వేళాకోళానికిగా వేటలో పులిచేత తాను చంపబడినట్లుగా రాణికి చెప్పి పంపగా, ఆమె గుండె పగిలి చనిపోయినది. రాజు శాంతరసానికి భాజ్యంగా ఆక్రందించి ఒక యోగిచే ఓదార్పబడి తత్త్వోపదేశం పొంది ఎరుక కలిమిం పొందుతాడు. ఈయోగి

తన భిక్షాపాత్రిక పగిలిపోయిన దానికి ఏడ్చినట్లు నటించి, రాజాచే ఓదార్చబడుతాడు. ఉపదేశం తర్వాత యోగి రాణిని బ్రతికిస్తాడు. దుఃఖాంతం కాకూడదు గదా సంస్కృత నాటకం!

కథలో సహజత లేకున్నా విషయం బాగున్నది. తెనుగుసేత సంస్కృత గాంభీర్యాన్ని ధరించినది గాని, అక్కడక్కడ స్పష్టత లోపించినది. చాలా పద్యాలు శాశ్వత సత్యాలను చెప్పే చాటువులుగా నిలిచిపోతవి. సంస్కృత నాటక శ్లోకాల ఉద్దేశ్యమే ఇది గదా!

తెనుగు వచనం సాంప్రదాయిక వాసనలతో బిగువుగా నడిచినది.

## 4. జ న న ం

[కవిత బి. నరసింగరావు. డెమ్మి 1/8–110 పేజీలు ధర–రు. 2–50; దొరకుచోటు: దేశి బుక్ హౌస్, నారాయణ గూడా–హైదరాబాదు–500029.]

మానవ జాతికి కలుగనున్న నూతన జన్మను సూచించడం కాబోలు ఈ గ్రంథ శీర్షిక. నేటి అభ్యుదయ రచయితలు కాక్షించే శ్రామిక జీవుల కల్యాణానికీ ఈ కవిత స్వాగతమిస్తున్నది. దోపిడీల ధిక్కారం కసి లావారూపంలో పారడం, మొదలైన మామూలు వస్తువే ఈ గ్రంథంలో వ్యక్తం చేయబడుతున్నది. ఇది ఋతు ధర్మంగా ఉన్నట్లున్నది. కవి పడిన ఆవేదన పాఠకుని మనసుకెక్కే టట్లు రచనకు పొందిక అమరి ఉన్నది. కవి చెప్పే విధానంలో రీతిలోనే గదా కవితకు ప్రాణమబ్బి నవ్యతను గూర్చేది! ఈ గుణం ఈ కవితలో అక్కడక్కడా గుబాళిస్తున్నది.

పేదరికం ప్రతి తలుపు తట్టి ప్రవేశిస్తోంది; ఈ గ్రామా లలో ప్రజల కది తోబుట్టువైంది. (ఈ కోవ వ్రాతగాండ్ర రచ నలో ఈ వస్తోంది అన్నది వర్తమానమో భవిష్యత్తో ప్రస్ఫుటంగా తోచదు.) కథ – కాకి నోట మాంసం ముక్కను కుక్క లాక్కొని పొయ్యే కథకు (ఈసపు కతలో నక్క) నోరున్నవాడిదే కాలంగా నూతన వ్యాఖ్యానాన్ని చెపుతున్నాడు.

నేను కన్నకలలు అలలు అలలుగా కదులుతూ, రంగురంగులు చిమ్ముతూ – చెట్లన్నీ పొగమంచులో స్నానం చేస్తున్నాయి (మంచి ప్రకృతి వర్ణన) – పుట్టినప్పుడు అందరిలాగే పుట్టి ఇప్పుడు మురికి వాళ్ళెలా అయ్యారు. (నిరుత్తరులుగా చేసేవాదం!) మెడపై గానుగ నొగలే మన నగలు – కమ్మని పలకరింపుల పెదవి కదిలింది. ఇట్లా వ్యక్తీకరణంలో భాషకు సొంపు ఉన్నది.

## 5. శై వ లి ని

(చైతన్య వ్రతుల కవితా సంకలనం)

[డెమ్మి 1/8–50 పేజీలు; ధర: రు. 2/-; ప్రతులకు: టి. లక్ష్మయ్య, అధ్యక్షులు : జిల్లా రచయితల సంఘం; ఆదిలా బాదు–504002]

జిల్లా రచయితల సంఘాలు తమ సభ్యుల రచనలను ప్రచు రించి ప్రోత్సహించడం, యువకవుల సాధనానురక్తిని పెంపొందించడం అవుతుంది. ఇది ఆచరణ యోగ్యమైన విధానం. వీరిలో ఎందరో మున్ముందు ఆరితేరగలరు. ఇప్పుడు కొందరిలో భావాంకురాలు భాషా కోరకాలు గోచరిస్తున్నవి. స్వాగతం చెప్పిన – ఆచార్య డాక్టర్ సి. నారాయణరెడ్డి వలెనే – వీరు సొంత గొంతులు ఏర్పరచుకొని కొత్త పాటలు పాడమని కోరుతున్నా విషయం పాతబడి వెగటుపుట్టిస్తు న్నది. (ప్రబంధకవుల స్త్రీ వర్ణనలువలె) ఇక, ఉన్న కవితా గుణాన్ని పెంచుకోవడమే వీరి కర్తవ్యం. కొన్ని ఇంపైన నుడికారాలున్నవి.

పెద్దలు – వానమామలై వరదాచార్యుల సూక్తిసుధ కొన్ని సామెతలను సృష్టిస్తున్నది:– మత్సరమ్ముకంటె మదిగాల్చు నిప్పేది – వల్లివోలె నెపుడు నక్కియుండు ఖలుడు. "నీళ్లలో" వివిధ బిందువుల ఐక్యత ఉన్నదని రమ్యంగా చెప్పబడిఉన్నది. "ఇక నేనెలా గాసేది"–అమృతాంశుని సుధావృష్టిలో తడిసి బరువెక్కి కదలలేక నిలిచిన వేళ. "రాజకీయ వర్ణ చిత్రం" మంచి అవహేళన ఎత్తి పొడుపులతో నిండి ఉన్నది. "నిరుద్యోగ పర్వం" ఆవేదనపూర్ణంగా రచనా పాటవాన్ని చూపుతున్నది. "పూలు" పేశల భావాన్వితంగా ఉన్నది. మిగత గీతాలలో గూడ అభివృద్ధి సూచనలున్నవి.

*–శ్రీ మరుపూరు కోదండరామరెడ్డి*

## "మా పి ఠా పు ర ం"

[మా పిఠాపురం గ్రంథకర్త కురుమెళ్ల వేంకటరావు. ప్రాప్తిస్థానము కురుమెళ్ల వేంకటరావు, మంగయ్యమ్మారావుపేట, పిఠాపురం – పుటలు 150. వెల : 8–00.]

ఆంధ్రదేశమున ప్రసిద్ధి కెక్కిన సంస్థానములలో నొకటి యైన పిఠాపురము చరిత్ర ఈ గ్రంథము. గ్రంథకర్తలు కురు మెళ్ల వేంకటరావు. ఇందు ఆముఖము పురుహూతికా శక్తి పీఠాం బిక, ఏలాశక్తి పంచారామాలు, త్రిగయలు, పాదగయ, ఏవేరు, కుక్కుటేశ్వరుడు, ఏకాంతసేవా విలాసము, కుక్కుటేశ్వరాష్టకము హుంకారిణి రాజరాజేశ్వరి, నందీశ్వరుడు, కుంతీమాధవస్వామి, పాత మసీదు, కుమారస్వామి, వేంకటేశ్వరుడు, గోపాలస్వామి, గ్రామ దేవతలు, మాఘమహోత్సవాలు, శివరాత్రి, ప్రాచీన చరిత్ర, పద్మ నాయకులు నేనెరిగిన పిఠాపురము; పండిత పరిషత్తు వేద పరిషత్తు – వడలి లక్ష్మీనారాయణశాస్త్రి, దెందుకూరి నరసింహశాస్త్రి, శ్రీపాద లక్ష్మీనరసింహశాస్త్రి, వేదుల సూర్యనారాయణశాస్త్రి – పండిత రంగాచార్యులు నందిగామ వెంకయ్య – సంగమేశ్వరశాస్త్రి పాఠశాలు హైస్కూలు,కూచి నరసింహము,అదవూడి సోమనాథరావు నండూరి రంగాచార్యులు గ్రంథాలయాలు, శ్రీ సూర్యరాయ విద్యానంద,సోములు బాబుగారు, రంగనాయకులు, ఆంధ్రపరిశోధక మహామండలి నాటకాలు, ఆంధ్రభాషాభివర్ధని, సంగీతము.

## కవి సమ్మేళనము

రామకృష్ణ కవులు, పానుగంటి లక్ష్మీనరసింహారావు, ఆంధ్ర సాహిత్య పరిషత్తు, సూర్యరాయాంధ్ర నిఘంటు, జయంతిరామయ్య పంతులు, కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి, చర్ల నారాయణశాస్త్రి, తంజానగరం తేవప్పెరుమాళయ్య ఇతర పండితులు, పిశుపాటి చిదంబర శాస్త్రి, నిడుదవోలు వేంకటరావు, మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి, కవిరాజ హంసలు పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి, మొక్కపాటి నరసింహశాస్త్రి, ఉమర్ ఆలీషా, ఘోషా స్కూలు కవయిత్రులు, దాసరి లక్ష్మణస్వామి, కృష్ణశాస్త్రి, బ్రహ్మర్షి.

అస్పృశ్యతా నివారణ స్వాతంత్ర్యోద్యమము, ఖద్దరు, అనుపత్రులు, పశు సంపద, ఆట పోటీలు, మల్లవిద్య, రాజకుటుంబము అను శీర్షికలున్నవి* ఈ గ్రంథమునకు 'కీర్తి పతాక' అన్నపేరుతో డాక్టరు వేదుల రామచంద్ర కీర్తి వ్రాసిన ప్రశంస 4 పుటలు యున్నది. గ్రంథము పిఠాపురం రాజా శ్రీ రాజారావు వేంకట కుమార గంగాధర రామారావు బహద్దరు వారికి అంకితము.

గ్రంథకర్త వేంకటరావు — చక్కని, సరళమైన వ్యవహారిక భాషా శైలిలో రచించినారు. కన్నులకు కట్టినట్లుగాను మనస్సునకు హత్తుకుపోవు రీతిని రచితములైనది.

గ్రంథకర్తయగు వేంకటరావుగారికి విషయములు సుపరిచితము లగుటచేత అవి నిర్దుష్టములై యున్నవి.

అయినను ఎట్టి గ్రంథానికైనను చేర్చదగిన అంశములుండనే యుండను. వాని విందు చేర్చిన నిది యింకను విరాజిల్లును.

### 1. మొక్కపాటి సుబ్బారాయుడు

ఈయన తొలుత పిఠాపురము మహారాజా సూర్యారావు బహద్దరు వారికి, ఉపాధ్యాయులు — ఆ వెనుక అంతరంగిక కార్యదర్శులు ఆ పైని పిఠాపురము సంస్థానము దివాను. వీరు మంచి రచయితలు — కవితా విమర్శకులు "భాషాభిమాని" అన్న పేరుతో దేవులపల్లి సుబ్బరాయశాస్త్రిగారి మహేంద్ర విజయమునకు ప్రశస్తమైన పీఠిక రచించినారు. అది చదివిన వీరి ఆంధ్ర భాషా వైదుష్యము సువ్యక్తమగును. వీరు నడి వయస్సులో కీర్తిశేషులైరి.

### 2 దేవగుప సన్యాసిరాజు

ఈయన పిఠాపురమున చాలాకాలము తపాలాఫీసు వ్యవహర్తగా నుండేవారు వీరు సిద్ధహస్తులైన కవులు. వీరి కవిత్వమును పానుగంటి వారే మెచ్చుకొనేవారన్నచో వేరు విధముగా దాని విశిష్టతను గూర్చి చెప్పనవసినది లేదు. పానుగంటివారు పరిషద్వార్షికోధ్యక్షోపన్యాసములో వీరిని గూర్చి ప్రత్యేకముగా పేర్కొన్నారు. వీరి భగవద్గీత పద్య కావ్యము విశిష్టమైనది. దీనిని మహారాజావారు ముద్రించినారు.

అభినవ కృష్ణరాయలని ఆంధ్రులు మెచ్చగా పీఠికాపురిం
ప్రభగను రావు వేంకట కుమార మహీపతి వీవు సూర్యరా
ట్ప్రభులును వారిమంత్రులయి ప్రస్తుతి కెక్కిన మొక్కపాటి వం
శభవులు సుబ్బరాయ బుధసత్తములీ కృతి దప్పి రచ్చునన్.

### 3 పిఠాపురము మహారాజావారి షష్ఠిపూర్తి మహోత్సవము

ఇది 1945లో పిఠాపురము కోటలోనే జరిగినది. తెలుగు దేశము నుండి పండితులు, శాస్త్రవేత్తలు నవరసులుతో బోడ్కిశాలువలతో సత్కరింపబడినారు. వారిలో నేనొకడను.

## విద్వాంసులు

ఈ క్రింది వారిందు లేరు.

### 1. పేరి పేరయ్యశాస్త్రి

ఈయన గొప్ప సంస్కృత విద్వాంసుడు. అనేక మంది శిష్యులకు సంస్కృత కావ్య పంచకము చెప్పి సాహిత్యవేత్తలుగా దిద్ది తీర్చినారు.

### 2. శొంఠి భద్రాద్రి రామశాస్త్రి

ఈయన గొప్ప సంస్కృతాంధ్ర విద్వాంసుడు. పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి గురువు.

---

* హరికథా పితామహుడు ఆదిభట్ల నారాయణదాసు సంస్కృతము, పారసీ, ఇంగ్లీషు, అచ్చ తెనుగు భాషలలో పిఠాపురము పై చెప్పిన సీస పద్యముతో నీ గ్రంథము ముగియుట ముదావహము.

## 3 శ్రీపాద పాపయ్యశాస్త్రి

ఈయన సూర్యరాయ నిఘంటువున పండితుడు. ఈయన పైని చెప్పిన పేరి పేరయ్య సంస్కృత పదములను పర్యవేక్షించెడివారు.

## 4. ఈయూణ్ణి వేంకట వీర రాఘవాచార్యులు

ఈయన పేరయ్యశాస్త్రిగారి శిష్యుడు. పిఠాపురము పాఠశాలలో చదివినాడు. తరువాత ఎమ్. ఏ. పట్టము పొందినాడు. సంస్కృత వాఙ్మయవేత్త. కాకినాడ పిఠాపురము మహారాజావారి కళాశాలలో సంస్కృతాంధ్ర భాషాధ్యక్షుడు.

## శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి

ఈయన నిఘంటు కార్యస్థానమున 13 ఏండ్లు వ్యవహర్తగా, సంపాదకుడుగా పనిచేసియున్నాడు మంచి పండితుడు. ఆ వెనుక మదరాసు విశ్వ విద్యాలయమున తెలుగు శాఖలో సహోపన్యాసకుడుగా 12ఏండ్లు 1944 వఱకు నున్నవాడు. ఈయన నన్నెచోడుని కుమార సంభవ విమర్శనము విశ్వ విద్యాలయ ప్రచురణ.

ఈయన తరువాత నేనే నాస్థానము బడసితిని.

ఆ యుదంతమిది —

కూచిమంచి తిమ్మకవి రచించిన రుక్మిణీ కల్యాణములోని పిఠాపురము వర్ణన ఇందులో లేదు.

సీ. చక్రవాళాహార్య జలధి తుల్యోన్నత
ప్రాకార పరిఖా విరాజితంబు
సాంద్ర ముక్తాసౌధ చంద్ర శాలానేక
భర్మ నిర్మిత హర్మ్య శర్మదంబు
కరి సైంధవాం దోళికా ధీను ధన ధాన్య
వసదేవ సర గృహ వర్ణనంబు
విమల చాతుర్వర్ణ్య విద్వత్కవి శ్రేష్ఠ
భట నటామాత్య విస్ఫారితంబు

గీ. రాజమహేంద్ర వర దుర్గ రాజ్యభార
భారసంభరణా క్రాంత భాసమాన
రావు మాధవన్యప పరిరక్షితంబు
భోగ నికరంబు పీఠికా పురవరంబు.

## జలగండము

నేను పెద్దయైన తరువాత సోమవారమునాడు శివుని దేవాలయమున కేగి శివునకు అభిషేకము చేయుట విద్యుక్త నియమము. పిఠాపురమున కుక్కుటేశ్వరాలయము కోనేటిలో స్నానము చేయుచుండగా నందులోబడి మునిగిపోయితిని. నాతో స్నానము చేయుచున్న కోమటి — అది చూచి నన్ను ఆ జల మండి పైకితీసి గండము తప్పించినాడు. అతడే—''మీకు జల గండము తప్పినది. మీకు గొప్ప పదవి లభిస్తుంది'' అని అన్నాడు. అవి యక్షరాలా యధార్థములైనవి. తరువాత మఱి రెండేండ్లకే నాకు మదరాసు విశ్వ విద్యాలయములో తెలుగు శాఖలో సహాయోపన్యాసక పదవి లభించినది. పిఠాపురము మహారాజా వారి మూలమున మానవ సహాయము లభించినది.

ఈ గ్రంధ ప్రకటనము మూలమున ఈనాడు దీనిని గూర్చి తెలుపు నవకాశము లభించినది.

గ్రంధకర్తయగు వేంకటరావుగారెంతయో అభినందనీయులు ఇది దేశమంతట ప్రచారము బడయునుగాక.

*కళాప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావు*



Printed and Published for Nageswara Rao Estate (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 75226.